The Largest Circulated Telugu Monthly

# చతుర

మే 1993

రూ. 5/-



పంతుల జోగారావ్ 'విషగుళిక'

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/–, రూ. 75/–, రూ. 50/– చొప్పున, మరో మూడింటికి రూ. 25/– చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

కూపన్

మే 'చతుర' నవల **'విషగుళిక'**

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

# చదువుకున్నవాళ్లు

## ట్యూషన్

సాయంత్రం నాలుగుగంటలు...

స్పోర్ట్స్‌డ్రెస్ వేసుకుని, షూస్ తొడుక్కుని ప్లేగ్రౌండ్‌కి వెళ్లడానికి ఎప్పటిలా రెడీ అయ్యాను. అందులోనూ ఇవ్వాళ మా చిరకాల ప్రత్యర్థులైన 'రత్నం ఇండస్ట్రీస్' టీమ్‌తో బ్రహ్మాండమైన ప్రిస్టేజియస్ మ్యాచ్ ఆడబోతున్నాం. కొంచెం పెందరాళే వెళ్ళడం మంచిది అన్పిస్తోంది. కానీ బుజ్జిగాడు చాపమీద పడుకుని నిద్రపోతున్నాడు. రజని ఆఫీసునుంచి రావడానికి ఇంకా కనీసం గంటన్నర టైముంది. నాలో విపరీతమైన టెన్షన్...

"కనీసం ఈ సుబ్బిగాడొచ్చినా బావుణ్ను... ఇంటిని, పిల్లాణ్ని వాడికి అప్పచెప్పిపోవచ్చు" అని గొణుక్కున్నాను.

సుబ్బిగాడంటే మాపక్కింటి రైతుబిడ్డ నాంచారయ్య కొడుకు. పదేళ్ళుదాటినా వాడికి అక్షరమ్ముక్క రాలేదు. అందుకే నాంచారయ్యా, ఆయన భార్యా మేమీ ఇంట్లో దిగిన మర్నాడేవచ్చి, "అయ్యా మా సుబ్బిగాడు ఊరికే గాలికి తిరుగుతున్నాడు. తిని తిరగడం తప్ప వెధవకి మరో పనిలేదు. మీ దగ్గరే ఉంచుకుని తీరుబాటువేళల్లో వాడికి నాలుగక్షరమ్ముక్కలు నేర్పండయ్యా మీకు పుణ్యం ఉంటుంది" అని బతిమాలారు.

ఎటూ నాకూ, రజనీకి ఇద్దరికీ ఉద్యోగాలే! బుజ్జిగాడ్ని చూసుకోడానికి ఓ పనిపిల్లను కుదుర్చుకోవాలనుకుంటున్నాం. అదేదో వీడితోనే అడ్జెస్ట్ అయిపోతే సరిపోతుందిగదా అనుకొని 'సరే' అన్నాం.

అప్పట్నించీ రోజూ నేను ప్లే గ్రౌండ్‌కి వెళ్లే వేళకి వాడు రావడం వాడికి నాలుగక్షరాలు దిద్దబెట్టి ఇంటినీ పిల్లాడ్నీ చూసుకుంటూ ఉండమని చెప్పి నేను బయటకు పోవడం అలవాటైపోయింది.

గుమ్మం దగ్గర అలికిడి అవడంతో ఆలోచనల్లోంచి బయటకొచ్చిన నేను సుబ్బిగాడు పలక పుచ్చుకుని అప్పుడే రావడం చూసి "ఏరా ఇప్పటిదాకా ఎక్కడ తిరుగుతున్నావ్?" అన్నాను కోపంగా.

పళ్లికిలించాడే తప్ప వాడేం మాట్లాడలేదు.

"సరే అమ్మగారొచ్చిందాకా ఇంటిని బుజ్జిగాడ్ని చూస్తూ ఉండు. నిన్న దిద్దబెట్టిన అక్షరాలే దిద్దుకో అవి ఇవ్వాళ రాకపోతే తన్నులే. నేవెళ్తున్నా" అంటూ హడావిడిగా ప్లే గ్రౌండ్‌వైపు పరిగెత్తాను.

★ ★ ★

ఆట మంచి రసవట్టులో ఉంది.

మంచి ఫామ్‌లో ఉన్నానేమో కొట్టిన ప్రతి బంతి ఫోరో సిక్సో పరుగిడుతోంది. ఎదుటి జట్టు నీరుకారిపోతున్నకొద్దీ నా విజృంభణ అధికమవుతోంది.

అంతలో ఉన్నట్టుండి "అయ్‌గారూ అవొచ్చింది అవొచ్చింది" అంటూ గావుకేకలు పెడ్తూ సుబ్బిగాడు పరుగెత్తుకొచ్చాడు.

"అవా? అమ్మగారు రాలేదా ఇంకా? బుజ్జిగాడ్ని ఒక్కడ్నే వదిలి ఎలా వచ్చావ్‌రా సన్నాసీ?" అని వాడినొక పక్క తిడ్తూనే ఇంటికి పరుగు లంకించుకున్నాను. నా వెనుకే మిత్రులూ... వారి వెనుక సుబ్బిగాడు... పరుగు పరుగున వచ్చారు.

కవర్‌ఫోటో: జగ్‌మోహన్

'మా బజార్లో తిరిగే పొగరుబోతు ఎర్రావు గురించి అందరికీ తెల్సు. అది నన్నే రెండుసార్లు కుమ్మబోయింది. పసివాడ్ని పచ్చడికింద తొక్కేసిందేమో?' భయంతో నాకు ముచ్చెమటలు పోశాయి.

టకు వచ్చారు. రాఘవ్ చేతుల్లో కిలకిల నవ్వుతూ కన్పించాడు బుజ్జిగాడు. ఆశ్చర్యం! వాడికి వంటిమీద ఎక్కడా ఒక్క గాయం కూడా కాలేదు.

నాకు పెద్ద రిలీఫ్! ఇంట్లోకి అసలు ఆవొ

ఇంటిని సమీపించేసరికి ఇంటికప్పు ఎగిరిపోయేలా విన్పిస్తోంది బుజ్జిగాడి ఏడుపు. లోనికి వెళ్తే ఏ దృశ్యం చూడాలో? నా కసలు కాళ్లూ చేతులూ ఆడలేదు. వాకిట్లో అరుగుమీదే కూలబడిపోయాను. నాతో వచ్చిన వాళ్ళంతా ఇంట్లోకి పరుగుతీశారు.

అప్రయత్నంగా నా కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

అంతలో లోపలకెళ్ళిన మిత్రులంతా బయ

చ్చిన జాడే లేదు అన్నారు ఇల్లంతా పరిశీలించివచ్చిన మిత్రులు ఆ తర్వాత.

"ఏరా సుబ్బిగా ఎక్కడ్రా ఆవొచ్చిందన్నావ్?" కోపంగా అడిగాను వాడివంక చూసి.

వాడు మౌనంగా జేబులోంచి చాక్‌పీస్ తీసి రెండో 'అ' అరుగుమీద రాసిచూపించాడు.

మేమంతా నోరు తెరిచాం.

-ప్రతాపచంద్ర




# డైటింగ్

ఈమధ్య కామాక్షి బొత్తిగా కూచుంటే లేవలేక, లేస్తే కూచోలేక ఆయాసపడిపోతోంది. భర్తగారు ఆవిడ బాధను అర్థం చేసుకుని పనుల్లో కొంత సాయపడటంతో ఆమెకి ఎక్సర్‌సైజ్ మరింత తగ్గిపోయి, పొద్దున్న తొమ్మిదికల్లా ఆఫీసుకెళ్లే భర్తకీ, ఎనిమిది గంటలకే స్కూలుకెళ్లే పిల్లలకీ బొంగరంలా తిరుగుతూ వడ్డించలేకా,



బాక్సులుకట్టలేకా సతమతమయిపోతోంది. అక్కడికీ డైటింగ్ పేరుతో దుంపకూరలూ, వెన్న, నెయ్యి, మీగడవుండే పదార్థాలు చాలావరకూ తినడం మానేసింది. అయినా ఫలితం కనిపించలేదు.

ఇది పనికాదని ఓరోజు భర్త భగవంతాన్ని తోడు తీసుకుని లేడీడాక్టరు దగ్గరకు బయలుదేరింది కామాక్షి.

కామాక్షి ఎత్తూ, బరువూ, ఆరోగ్యం వగైరాలన్నీ చెక్ చేసిన లేడీ డాక్టరు కొన్ని జాగ్రత్తలు చెప్పి ఆవిడ తీసుకోవలసిన డైట్ వివరాలన్నీ రాసిచ్చింది. ఆ ప్రకారం పొద్దున్న రెండు కప్పులపాలు మధ్యాహ్నం రెండు కప్పుల బత్తాయిరసం, సాయంత్రం రెండు కప్పుల టొమాటో రసం, రాత్రి 9 గంటలకి రకరకాల పచ్చికూరగాయలముక్కలు... ఇవీ కామాక్షి భోజన పదార్థాలు.

ఇలా కనీసం ఒక నెలపాటు ఖచ్చితంగా పాటిస్తే, ఆ తర్వాత అందాల పోటీలకు కూడా వెళ్లచ్చుని డాక్టరు చెప్పడంతో మర్నాడు బుట్ట

నిండా బత్తాయిపళ్లు, మరోబుట్టెడు టొమాటోలు, అయిదారు రకాల పచ్చికూరగాయలూ తెమ్మంటూ ఓ లిస్టు రాసి భర్త చేతికిచ్చింది కామాక్షి. ఆయనగారు కూడా భార్య బాధని సానుభూతితో అర్థం చేసుకుని ఆమె చెప్పినవన్నీ తు.చ తప్పకుండా తెచ్చేవాడు.

అయితే... అది నడి వేసవికాలం. బత్తాయిలు మాత్రం కనీసం ఎండువి కూడా దొరకడంలేదు. అథవా దొరికినా ధర ఆకాశాన్నంటుతోంది. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా ఎండల్లోపడి తిరిగి మరీ తెస్తూనే వున్నాడు భగవంతం.

పదిహేను రోజుల అనంతరం కామాక్షిలో కొద్దికొద్దిగా మార్పు కనిపిస్తున్నట్లు ఇరుగు పొరుగు వాళ్లందరూ అన్నారు. కామాక్షి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఇలాగే కష్టపడితే అటుపైన తన శరీరం ఖచ్చితంగా తన చెప్పు చేతల్లోకి వస్తుందన్న గట్టి నమ్మకం వచ్చేసింది కామాక్షికి. తను నిజంగానే బ్యూటీ కంటెస్ట్‌లో పాల్గొనబోతున్నట్టు కలలు కూడా వచ్చాయి ఈమధ్య.

అలా ఓ అందమైన మునిమాపువేళ కలలు కంటూ కూర్చున్న కామాక్షి, గుమ్మంలో ఆటో చప్పుడు విని వులిక్కిపడింది. గేటుకేసి చూస్తే భగవంతాన్ని ఓ ఇద్దరు వ్యక్తులు సాయం పట్టి లోపలికి తీసుకొస్తున్నారు. ఖంగారుపడిపోయింది కామాక్షి. ఆ వచ్చినవాళ్ల కథనం ప్రకారం...

'లంచ్ టైములో టిఫిన్ కూడా తినకుండా అక్కడే వదిలేసి ఓ బుట్ట, రెండు సంచులతో ఎక్కడకో వెళ్లాడట భగవంతం. ఓ 20 నిమిషాల తర్వాత ఈయన్ని రోడ్డుమీద పడిపోయుంటే ఆఫీసుకు తీసుకొచ్చారట ఎవరో. అక్కడనుంచి వాళ్లిలా ఇంటికి తీసుకొచ్చారట. కామాక్షి గుండెలు బాదుకుంది "అమ్మో! అమ్మో! ఇలా ఎప్పుడూ రాలేదు. ఈ సందులోనే మాకు తెలిసున్న డాక్టరున్నారు. అక్కడికే తీసుకెళదాం" అంటూ అదే ఆటోలో బయలుదేరింది కామాక్షి.

భగవంతాన్ని బాగా పరీక్షించాక డాక్టరు చెప్పాడు "చూడమ్మా! ఈయనకి జబ్బేమీ లేదు. కానీ బాగా అలసటగా, నీరసంగా వున్నారు. బ్లడ్, వెయిట్ కూడా తక్కువగా వున్నాయి. అందుకని ఓ నెలరోజులన్నా మంచి భోజనంతోపాటు ఉదయం బత్తాయి రసం, మధ్యాహ్నం గ్లూకోజ్ కలిపిన టొమాటో రసం, రాత్రికి రకరకాలవచ్చి కూరగాయముక్కలూ, పాలూ ఇవ్వకపోతే..." డాక్టరుమాట పూర్తికాకుండానే కళ్లు తిరిగిపడిపోయింది కామాక్షి.

-రాధాశివమోహన్

---

# మేధావి

పరాంకుశంగారి క్వాలిఫికేషను ఎమ్.ఎ.పి.హెచ్.డి. అయినందుకు కాదుగానీ, ఆయన మేధాసంపత్తికి జనరల్‌గానే సాటివాళ్ళందరూ అబ్బురపడుతూ వుంటారు.

ఆయన అర్హతకి తగిన ఉద్యోగం ప్రభుత్వం ఆయనకి ఎంతకాలం గడిచినా చూపించలేకపోయింది.

అందుకు నిరసనగా ఆయన నెలకు ఆరు వందల రూపాయల జీతానికి ఒక పెద్ద డిపార్ట్‌మెంటల్ స్టోర్సులో స్టోరుకీపరుగా ఉద్యోగంలో చేరాడు.





మొదటిరోజున ఆ స్టోర్స్ మేనేజరు వినయంగా పరాంకుశంగారితో అన్నాడు.

"అయ్యా- పరాంకుశంగారూ- నన్ను మీరు క్షమించాలి. నేను మీకు పనినేర్పగలిగేటంతటి వాణ్ని కాదు. కాని నా విధిగా మాత్రమే మీకు చెబుతున్నాను. ఇదిగో- మీకు పుస్తకం, కలం ఇస్తున్నాను. ఇవాళ మీరు స్టోర్‌లో కూర్చుని సరుకులన్నీ ఏవి ఎంతెంత వున్నాయో వ్యక్తిగతంగా చూసి లిస్టు తయారుచేయండి- మీరు ఖచ్చితంగా లెక్కలు చూసుకుని లిస్టు రాసుకోకపోతే, తర్వాత మీరే ఇబ్బంది పడవలసివస్తుంది. ఏ వస్తువైనా మీరు స్వయంగా చెక్ చేసుకోవటం మంచి పద్ధతి" అని కూడా

మరోసారి గుర్తుచేశారాయన.

పరాంకుశంగారు పొద్దుట్నించి, సాయంత్రందాకా అతిదీక్షగా, పట్టుదలగా పని చేశారు.

సాయంత్రం మేనేజరుగారు పిలిచి అడిగాడు-

''ఏమండీ పరాంకుశంగారూ- నేను చెప్పిన పనిపూర్తయిందా?''

పరాంకుశంగారు అన్నాడు.

''అప్పుడే ఎల్లా పూర్తవుతుందండీ? ఇవాళేగా పనిమొదలుపెట్టింది?''

మేనేజరుగారు ఆశ్చర్యంగా అడిగాడు- ''ఎన్నిరోజులు పడుతుందండీ! ఇంతకీ ఇవాళంతా ఏం చేశారూ?'

''స్టోరురూమ్‌లోకెళ్లానండీ. ముందు కందిపప్పు బస్తా ఒకటి విప్పాను. అన్నీ స్వయంగా సరిచూసుకోమన్నారుగా- అందుకని నేనే లెక్కపెట్టాను. మొత్తం ఆ బస్తాలో మూడు లక్షల నలభయిఆరువేల ఎనభయిరెండు గింజలు వున్నాయి. రేపు రాగానే రెండవ బస్తావిప్పి లెక్కపెడతాను''

మేనేజరుగారు తలపట్టుకుని కూర్చుండిపోయాడు.

-పెయ్యేటి రంగారావు





వీడియో స్క్రీన్‌మీద కాబోయే భార్యామణిని ఎంపిక చేసుకుంటున్న ఓ క్లయింట్

వధువుల చిత్రాల ముందు పెట్టుకొని
తన క్లయింట్‌తో సంభాషిస్తున్న గ్యారీ బ్రీస్లే

# వీడియో పెళ్ళిళ్ళ పేరయ్య

సాధారణంగా పెళ్ళి సంబంధాల విషయంలో మనం పెళ్ళిళ్ళపేరయ్యలమీద, సంబంధాల్ని కుదిర్చిపెట్టే 'మేరేజ్ లింక్స్' వంటి సంస్థలమీద, 'వధువు కావలెను' లైపు పత్రికా ప్రకటనలమీదా ఆధారపడుతుంటాం. ఈ విషయంలో సిడ్నీలోని ఎ.పి.పి. ఇంటర్నేషనల్ ఏజెన్సీ మరింత ముందుకుపోయి వీడియో పెళ్ళిళ్ళ పేరయ్యల్ని సృష్టించింది. ఆ సంస్థలో పెళ్ళి కావల్సిన అమ్మాయిలు-అబ్బాయిల జాబితాలు, ఫొటోలు, వ్యక్తిగత వివరాలేగాక ఆయా వ్యక్తుల తాలూకు వీడియో ఫిల్ములు కూడా లభిస్తాయి. ఆ ఫిల్ములలో సదరు వధువులు, వరులు తమ వ్యక్తిగత వివరాల్ని అభిరుచుల్ని స్వయంగా చెబుతున్నట్లు షూట్ చేయడం జరుగుతుంది.

పెళ్ళి సంబంధం గురించి ఆ సంస్థను సంప్రదిస్తే చాలు పెళ్ళికూతుళ్ళు లేదా పెళ్ళి కొడుకుల తాలూకు వీడియో క్యాసెట్లు డజన్ల కొద్దీ పంపేస్తారు. అవన్నీ నిశితంగా చూసి మనకి నచ్చిన వ్యక్తిని ఎంపిక చేసుకుంటే ఆ వ్యక్తి తాలూకు పూర్తివివరాలు చిరునామాలు అందచేస్తుందీ సంస్థ. జీవిత భాగస్వాముల ఎంపికలో తన క్లయింట్లకి యింతగా సహకరిస్తూ సేవ చేస్తున్నందుకుగాను కొంత రుసుము పుచ్చుకుంటుంది ఈ ఏజన్సీ. ప్రస్తుతం తన వ్యాపారం బ్రహ్మాండంగా సాగుతోందంటున్నాడు ఈ ఏజన్సీని స్థాపించిన గ్యారీ బ్రీస్లే.



# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచంవంటి శీర్షికలుకాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. 'చతుర'లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదు గనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35 వేలపదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్ వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్కప్రకారం 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరం లేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# ఏరిన ముత్యాలు

★ మనుమలకు తమ అవసరాలు గుర్తుంటాయేగాని సామర్థ్యాలు గుర్తుండవు.

— నెపోలియన్

★ ఏదో ఒకపనిలో నిరంతరం నిమగ్నమైనవారికి కన్నీళ్లకు చోటులేదు.

— బైరన్

★ ఒక పనిని 'నేను చేయలేనేమో'నని అధైర్యపడి నిరుత్సాహపడొద్దు. పనిచెయ్యటం ప్రారంభించు. నువ్వే ఆశ్చర్యపడేవిధంగా నువ్వు ఆ పనిని చెయ్యగలుగుతావు.

— గెథె

★ అభిప్రాయాలను మార్చుకోలేని వ్యక్తి తన తప్పులను సరిదిద్దుకోలేడు. నేటికంటే రేపు ఎక్కువ వివేకం ప్రదర్శించాలనుకుంటే మనిషిలో మార్పు అవసరం.

— ఎడ్వర్డ్

★ పెళ్లిచేసుకోవద్దు. కావాలంటే ప్రేమించు. ప్రేమించే ముందు ప్రేమార్హతగల వ్యక్తిని ఎన్నికచేసుకోవడం అవసరం.

— పెన్

★ నిష్కల్మషంగా ప్రేమించినవాని హృదయం భూలోక స్వర్గమే- సందేహంలేదు. ఎందుకంటే అతనిలో భగవదంశ కనిపిస్తుంది. భగవంతుడంటేనే ప్రేమ.

— లామానెన్

★ ప్రేమ కత్తిలేకుండా పాలిస్తుంది. చట్టం లేకుండా బంధిస్తుంది.

— సత్యసాయిబాబా

★ ప్రేమించిన యువతికి ప్రాణం ఇచ్చేయడం తేలికేగాని ఆమెతో కలిసి జీవించడం మాత్రం కష్టం.

— రోమారోలా

★ అందరిముందు ప్రేమను వ్యక్తపరిచేవాడు చాలా తక్కువగా ప్రేమిస్తాడు.

— షేక్స్పియర్

★ ఆవేశపరులకు బతుకొక ట్రాజడీ, ఆలోచించేవారికదొక కామెడీ.

— హోరిస్ వాల్పోల్

★ జీవితం నాకు ఆలోచించడం నేర్పింది కానీ, ఆలోచన నాకు జీవించడం నేర్పలేదు.

— హెర్జన్

★ జీవితం అంటే ఒకర్ని మరొకరు నమ్మించి మోసగించడం, అందర్ని అందరూ మోసగించడం.

— షేక్స్పియర్

★ డబ్బు, కాలం రెండూ కూడా జీవితంలో భరించరాని బరువులే. వాటిని సద్వినియోగం చేసుకోలేనంత ఎక్కువగా ఉన్న వాడెవడయినా నిర్భాగ్యుడే. వాడికి జీవితంలో సుఖం ఉండదు.

సేకరణ: నలబెల్లి శ్రీమన్నారాయణ

# చతుర

సంపుటి : 16
సంచిక : 4
మే :1993

ఆదర్శ ఉపాధ్యాయునిగా రూపొందాలని కలలుగన్న అతను తన ఎప్పాయింట్‌మెంట్ ఆర్డరు తీసుకుని మండల విద్యాధికారిని కలుసుకుందుకు వెళ్లినప్పుడు ఎదురయిన విషాదానుభవం... జీవితంలో మరువలేనిదిగా మిగిలిపోయింది.

"మీరిప్పుడే ఈ చీకటి దారుల్లోకి అడుగుపెట్టారు. ఈ మార్గంలో ఎన్నో రాళ్లు, రప్పలూ, తుప్పలూ, డొంకలూ... అవన్నీ దాటుతున్నకొద్దీ మీ మనసు బండబారిపోతుంది లెండి" అనేవి రాటుదేలిన అతడి సహోద్యోగి మాటలు! అవి అడుగడుగునా అక్షర సత్యాలై అవగతమవుతున్నప్పుడు... అతడేం చేశాడు?

"ఏ రంగాన్ని పట్టి చూసినా ఏమున్నది గర్వకారణం? అడుగడుగునా అరాజకత్వం, మితిమీరిన స్వార్థపరత్వం!"

అన్నదాన్ని నిజం చేస్తున్న విద్యారంగంలోని లోటుపాట్లను విచిత్రకథా నేపథ్యంలో విశ్లేషిస్తూ రాసిన పంతుల జోగారావ్ సమగ్ర నవల 'విషగుళిక' ఈ నెల 'చతుర' సమర్పణ.

పంతుల జోగారావు

# విషగుళిక

"ఆ కనిపిస్తున్నాయన్ని అడగండి. అతనికి తెలుస్తుంది"

కౌంటర్లో కూచున్న వ్యక్తి వసారాలో నిలబడి బీడీ తాగుతున్న మనిషిని వేలితో చూపిస్తూ అన్నాడు.

'థాంక్స్' చెప్పి ఆ యువకుడు అటువేపు చూశాడు.

అక్కడొక నలభై నలభైఅయిదేళ్ళ వ్యక్తి నిలబడి నింపాదిగా బీడీ కాలుస్తున్నాడు.

తలంతా నెరిసిపోయివుంది. మనిషి కొంచెం వంగిపోయినట్టుగా నిలుచునిఉన్నాడు. బీడీలూ అవీ తెగకాలుస్తాడేమో పెదవులు కమిలిపోయి నల్లగా వికారంగా వున్నాయి. మనిషి సన్నగా పీలగా గెడకర్రకి చొక్కా ఫేంటూ తొడిగినట్టుగా అదోలా ఉన్నాడు. అతను నింపాదిగా బీడీ కాల్చే విధానం చూస్తే, బీడీ కాల్చడం తప్ప అతనికి మరోధ్యాస వున్నట్టు లేదు.

ఆ యువకుడు నెమ్మదిగా అతని పక్కకి చేరి నిలుచున్నాడు. సన్నగా, ఒకమోస్తరు ఎత్తుగా ఆ యువకుడు స్మార్టుగా అందంగా ఉన్నాడు. కళ్లలో తెలివితేటలూ, ఏదో సాధించాలన్న పట్టుదల ప్రస్ఫుటిస్తున్నాయి. బ్రౌను కలరు ఫేంటులో సన్నని చారలషర్టు టక్ చేసుకుని ఉన్నాడు. కళ్లకున్న అందమయిన ఫ్రేం కళ్లజోడులోంచి అతని కళ్లు చురుగ్గా మెరుస్తున్నాయి.

తన చెంతనే నిల్చున్న యువకుణ్ణి చూసి కూడా ఏమీ పట్టనట్లుగా ఉండిపోయేడతను. ఈసారి కుడికాలు కొంచెం పైకిలేపి గోడకి ఆన్చి మరింత రిలాక్సింగ్‌గా నించున్నాడావ్యక్తి.

ఆ యువకుడు కొంచెం గొంతు సవరించుకుని అడిగేడు, "అయ్యగారున్నారా?" అని.

విననట్లూ ఆ యువకుడు తన పక్కనే నిల్చున్న సంగతి కూడా గుర్తించనట్లుగా అతను అరమోడ్పు కళ్లతో మౌనంగా వుండిపోయేడు.

దగ్గరగా వెళ్లి "అయ్యగారున్నారా?" అని మళ్లీ ప్రశ్నించేడు ఆ యువకుడు.

సమాధానం లేదు.

"చూడండి, మిమ్మల్నే... అయ్యగారున్నారా?"

మరోసారి అడిగేడతను.

ఆమాత్రం మర్యాదగా తనని మన్నించే వ్యక్తి అంతవరకూ తటస్థించలేదేమో ఆ యువకుణ్ణి ఎగాదిగా చూసేడతను.

బీడీని వసారాలో ఓ మూలకి విసిరేసి "ఏ అయ్యగారు బాబూ" అని ప్రశ్నించేడు.

ఆ యువకుడు సమాధానం చెప్పేలోగా ఆ పక్క గదిలోంచి "వీరాస్వామీ, ఇలారా ఓసారి" అన్నకేక వినిపించింది.

"ఆఁ... ఆఁ... వస్తున్నాను బాబూ" అంటూ పరుగులాంటి నడకతో ఆ గదిలోకి వెళ్లిపోయేడతను.

వసారాలో ఆ యువకుడొక్కడూ మిగిలిపోయేడు. ఇతని పేరు వీరాస్వామి అన్నమాట. అయ్యగారి అటెండరు కాబోలు, అనుకున్నాడు.

గదిలోకి వెళ్లిన వీరాస్వామి నాలుగయిదు నిమిషాలవరకూ బయటకి రాలేదు. ఓసారి గదిలోకి చూద్దామా అనిపించిందిగాని ధైర్యం చాలలేదు. ఇంతకీ ఆయన ఉన్నారో లేదో? ఉండేవుంటారు. ఈ సమయంలో తప్పకుండా ఇక్కడ ఉంటారని ఆఫీసులో చెప్పారు. అయ్యగారు ఇక్కడ ఉద్యోగంలోచేరి ఏడాది కావస్తోంది. కుటుంబాన్ని తెచ్చుకోలేదుట. వారంలో మూడు నాలుగురోజులు ఇక్కడికొచ్చి ఏవో ఆఫీసు పనులు చూసుకుని తమ స్వగ్రామం వెళ్లిపోతూ ఉంటారుట. వచ్చినప్పుడల్లా ఈ హొటలు గదిలోనే బసచేస్తారుట. ఈ వివరాలన్నీ ముందుగా తెలుసుకునే అయ్యగార్ని కలుసుకోవడం కోసం అతనిక్కడికొచ్చేడు.

ఆ యువకుడు తన జేబులోంచి కాగితం తీసుకుని ఓసారి తృప్తిగా చూసుకున్నాడు. నిన్న ఉదయం పోస్టులో వచ్చిందది.

అప్పుడు తన కళ్లని తనే నమ్మలేకపోయేడు.

కలా వాస్తవమా అని ఆశ్చర్యపోయేడు.

ఆనందంతో తబ్బిబ్బయిపోయేడు.




ఆ వార్తవిని అతని తల్లి ఆనందంతో కళ్లంట నీళ్లు పెట్టుకుంది.

చెల్లెలి సంతోషం వర్ణనాతీతం.

ఇంట్లోకి పండుగొచ్చినంత సంబరం. చీకటి తెరలు తొలిగిపోయి వెలుగు వెల్లువ వరుచుకున్న అనుభూతి.

ఇది నిజమేనా!

నిజమే అని చెప్తోంది చేతిలోని కాగితం. నిజాయితీతో జరిగే కొన్నిపనులు విశ్వసనీయం కానంత అద్భుతంగా వుంటాయి, మరి.

''పాండ్యా''

చేతులెత్తి ఆ మహోన్నత మూర్తికి నమస్కరించేడు. మనసులోనే కృతజ్ఞతలు సమర్పించుకున్నాడు.

అతని మనసు కృతజ్ఞతాభావంతో ఆర్ద్రమైపోయింది.

లోకం ఇంకా పూర్తిగా కలుషితమయిపోలేదు. లోకంలో అంతా చెడ్డలేదు. మంచి కూడా వుంది. ఆ మంచి ఉత్తుంగశిఖరమంత మహోన్నతమయినది. మకరందమంత మధురమయినది.

పతనావస్థలో ఉన్న సమాజసౌధాలను నిలకడగా నిలబెట్టేందుకు అలాంటి మంచి ఆదర్శప్రాయమయిన వ్యక్తులు ఇంకా అక్కడక్కడా లేకపోలేదు. నైరాశ్యపు తిమిరాన్ని పటాపంచలు చేసేందుకు దీపకళికల్లా సౌజన్యపు వెలుగులు విరజిమ్ముతూనే వుంటారు వారు. అలాంటి వ్యక్తుల మూర్తిమత్వం మంచి గంధంలా సుగంధాలు వ్యాపింపజేస్తూనే వుంటుంది.

ఆ యువకుని పెదిమలమీద చిన్న చిరునవ్వు మెరిసి మాయమయింది. ఎంత భావుకతతో ఆలోచిస్తున్నాడు తనివాళ! నిజమేమరి-

నిన్నటివరకూ అంధకారమే తప్ప తన జీవితంలో ఏంవుంది? ఇవాళ అన్నీ అందంగానే కనిపిస్తున్నాయి. అంతా మంచితనమే వెన్నెల్లా మనసుని తాకుతోంది. వీరాస్వామి గదిలోనుంచి బయటకి రావడంతో ఆ యువకుని ఆలోచనలకు తెరపడింది. ఆత్రుతతో అతనివేపు చూశాడు.

వీరాస్వామి అతనివేపు చూడనయినా చూడకుండా గబగబ నడుచుకుంటూ మెట్లుదిగి బయటకి వెళ్లిపోయాడు.

ఆ యువకుణ్ణి నిరుత్సాహం ఆవరించింది. తనిక్కడికొచ్చి దాదాపు అరగంట కావస్తోంది. ఆయన్నింకా కలుసుకోలేపోయాడు. కనీసం ఆయన కోసం తనొచ్చేనన్న వార్త కూడా అందించలేకపోయాడు.

ఇంతకీ ఆయన గదిలో ఉన్నారో లేదో కూడా తెలీదు... అసలు ఈ వీరాస్వామి ఆయన దగ్గర పనిచేసే అటెండరేనా అన్న అనుమానం కూడా అతనికి కలగకపోలేదు. మళ్ళీ తననితనే సమాధానపర్చుకున్నాడు. నిశ్చయంగా ఆయన పనచేసేది ఈ లాడ్జిలోనే. కింద కౌంటర్లో మనిషి రూమ్‌నెంబరు కూడా సరిగానే చెప్పాడు. తప్పక వుండివుండాలి. పోనీ, తనే వెళ్లి కలిస్తే!

కబురు చెయ్యకుండా వెళ్లడం మర్యాదగా వుండదేమో... సందేహిస్తూ వీరాస్వామి రాక కోసం ఎదురుచూస్తూ వుండిపోయేడతను.

మరో అరగంట గడిచేక వీరాస్వామి మేడ మెట్లెక్కి వసారాలోకి రావటం కనిపించి, ప్రాణం లేచొచ్చినట్టయిందతనికి. వీరాస్వామి రెండు చేతులనిండా ఏవో టిఫిన్ పొట్లాలతో గబగబ వస్తున్నాడు. అయ్యగారికి టిఫిన్ ఏర్పాట్లేమో- వీరాస్వామి తను నిల్చున్నచోటుకి వచ్చేవరకూ ఆగి, అతనికెదురుగా నిలబడ్డాడు.

అతనలా తన దారికి అడ్డం రావడం ఇష్టం లేనట్టుగా ముఖం కనిపించీ కనిపించనట్లుగా చిట్లించి, అన్నాడు వీరాస్వామి. ''అరె! మీరింకా ఇక్కడే వున్నారా!''

''ఆ... అయ్యగార్ని కలవాలనొచ్చేను... గదిలో ఉన్నారుకదూ?''

''అయ్యగారి కోసమా!'' అని చిన్నగా నవ్వి, ''ఉండండి, ఇప్పుడే వస్తాను'' అంటూ ఆ యువకుణ్ణి తప్పించుకుని, గదిలోకి వెళ్లిపోయాడు వీరాస్వామి.

మళ్ళీ ఈ నిలువుజీతం ఎంతసేపో! అనుకుంటూ దిగాలుపడి అటే చూస్తూవుండిపోయాడతను.

ఈసారి వీరాస్వామి అట్టే ఆలస్యం చెయ్యలేదు. తను తెచ్చిన పొట్లాలు గదిలో పెట్టి,

నీళ్ళకూజాతో బయటకి వచ్చేడు.

వస్తూనే ఆ యువకుడివేపు నవ్వుతూ చూశాడు.

"లోపలికి రమ్మన్నారా?" అతని ముఖం వికసించింది.

వీరాస్వామి తల అడ్డంగా వూపుతూ, "ఏదీ, ఇంకా మీరొచ్చేరని అయ్యగారితో చెప్పనేలేదు- ఇంతకీ మీ పేరేటి బాబూ" అన్నాడు.

"నా పేరు... సాగర్... విద్యాసాగర్"

"అలాగా బాబూ! ఒక్క సిటం ఆగండి... ఈ కూజాలో నీళ్లు నింపుకొచ్చి మీరొచ్చినట్టు అయ్యగోరికి సెప్తాను" అని ఒకడుగు ముందుకువేసి సాలోచనగా ఆ యువకుడివేపు చూశాడు. క్షణంలో సగంసేపు అలా చూసి, ఏమనుకున్నాడో "బాబూ... అయిదు రూపాయలుంటే ఇప్పించండి... అయ్యగోరికి సిగరెట్ పెట్టె కొనాల" అని చెయ్యి చాపేడు.

అప్రయత్నంగా జేబులోంచి అయిదురూపాయలనోటు తీసిఇచ్చేడతను.

వీరాస్వామి ముఖం వికసించింది.

ఆ నోటు అందుకుని, ఫేంటు జేబులో దోపుకుంటూ, "మరొక్క నిమిషం ఆగండి బాబూ... పాపం, మీరొచ్చి ఎంతసేపయినాదో, ఏటో!" సానుభూతిగా పలికి నీళ్లు తేవడానికి వెళ్లేడు వీరాస్వామి.

మళ్ళీ కాస్సేపు నిరీక్షణ.

ఆ యువకుడికి విసుగ్గా వుంది. ముళ్ళ మీద నించున్నట్టుగా వుంది. అయినానరే ఏమీ చేయలేని పరిస్థితి.

తను వీరాస్వామికి ఆ అయిదురూపాయలూ ఓ అరగంటముందే ఇస్తే బాగుండేదన్న ఆలోచన స్ఫురించి ఆ యువకుడు విసుగ్గా నిట్టూర్చేడు.

కూజాలో నీళ్లు నింపుకుని గదిలో పెట్టి, మరో రెండు మూడు నిమిషాల తర్వాత బయటికొచ్చి చెప్పేడు వీరాస్వామి, "అయ్యగారు రమ్మంటున్నారు బాబూ!" అని.

ఒకసారి క్రాఫ్ సరిచేసుకుని, గదిలోకి అడుగుపెట్టబోతూ ఎందుకేనా మంచిదని సందేహ నివృత్తి కోసం వీరాస్వామి చెవిలో మెల్లిగా అడిగేడు, "అయ్యగారు... అంటే ఎమ్.యి.ఏ.వో అచ్యుతరావుగారేకదూ ఈ గదిలో వుండేది?" అని.

గారపళ్ళు కనిపించేలా నవ్వుతూ తలవూపేడు వీరాస్వామి "అవునాయనే బాబూ! ఎల్లండి"

★ ★ ★

పులిగుహలో అడుగుపెట్టిన మేకపిల్లలా గదిలోకి వచ్చి బెరుకుగా నిల్చున్న విద్యాసాగర్ మీద అయిదు జతలకళ్ళు ఒక్కసారిగా పడ్డాయి.

అక్కడి వాతావరణం చూసి విద్యాసాగర్ కొంచెం చకితుడయ్యాడు.

ఆ సింగిల్‌రూం అయిదుగురు వ్యక్తులతో ఇరుగ్గా కనిపిస్తోంది. ఓ మూల ఉండాల్సిన టేబిలు గదిమధ్యకి లాగివుంది. టేబిలుమీద పలావ్ పొట్లాలు విప్పదీసి ఉన్నాయి. ఇందాక వీరాస్వామి తెచ్చిన నీళ్ళకూజా, దానిపక్కనే నాలుగయిదు గాజుగ్లాసులు అక్కడున్నాయి.

టేబిలుమీద, మంచంమీద ఏవేవో లిక్కర్ సీసాలు కనిపిస్తున్నాయి.

గదిలో సీలింగ్‌ఫేను చప్పుడు చేసుకుంటూ తిరుగుతోంది. కాని ఆ గది వాతావరణం మాత్రం చల్లగా లేదు.

మంచంమీద ఓ వ్యక్తి బాసింపట్టు వేసుకుని కూచుని ఉన్నాడు. పొడుగుచారల డ్రాయరు తప్ప ఒంటిమీద మరొకబట్ట లేదతనికి. నల్లగా తుమ్మమొద్దులా వున్నాడు. అతని బానపొట్ట చూడ్డానికి అదోలావుంది. చేతి వేళ్లమధ్య కింగుసైజు సిగరెట్టొకటి వెలుగుతోంది.

అతని పక్కనే ఇద్దరున్నారు. ఒకవ్యక్తి టేబిలు అంచుమీద, మరొకాయన ఎదురుగా గాడ్రెజ్ కుర్చీమీద కూచుని ఉన్నారు. ఈ మిగతా నలుగురూ మాత్రం ఫేంటూ షర్టులతో అతనితో మాట్లాడిపోవడానికి వచ్చిన వాళ్ళలాగే ఉన్నారు. డ్రాయరు తప్ప ఒంటిమీద బట్టల్లేకుండా ఉన్న వ్యక్తి అతనొక్కడే. బహుశా అతనే ఆ రూంలో బసచేసిన ఎమ్.యి.ఏ.వో అయి వుంటారని అర్థం చేసుకున్నాడు విద్యాసాగర్. అందుకే అతనికి రెండు చేతులూ జోడించి "నమస్కారం సార్" అన్నాడు వినయంగా.





విద్యాసాగర్ పెట్టిన నమస్కారాన్ని అతను స్వీకరించేడో లేదో తెలీదు. తల కనిపించీ కనిపించనట్టుగా పంకించేడు. కుడి అరచేయి కొంచెం పైకి లేచింది. ఆ వెంటనే ఆ చెయ్యి టేబిలు మీదున్న సిగరెట్ పెట్టెని అందుకోవడంవల్ల ఆ చేతినతడు ప్రతినమస్కారం చెయ్యడానికి లేపేడని నమ్మడం కష్టం. చేతిలో అప్పటికే ఓ సిగరెట్టు వెలుగుతూండడంతో ఆ సిగరెట్ పెట్టెని మళ్ళీ ఉన్నచోట జారవిడిచేడతను.

ఆ గదిలో వున్న తక్కిన వ్యక్తులు ఇతన్ని కొంత ఆసక్తితో చూడసాగారు.

''నా పేరు విద్యాసాగర్''

సిగరెట్టు ఓ పఫ్ పీల్చి వదిలి తలకిందికీ మీదికీ ఆడించేడతను.

''ఏ సాగరు?'' అడిగేడు కళ్ళు చిట్లించి. అది వినబడకపోవడమో, వెటకారమో అర్థంకాలేదు విద్యాసాగర్‌కి.

''విద్... విద్యాసాగర్'' తడబడుతూ చెప్పేడు.

''ఆహా...'' చెప్పుకోవలసిందేమేనా వుంటే చెప్పుకోడానికి అనుగ్రహించినట్టుగా కళ్ళలోకి చూశారాయన.

''నేను బి.యస్సీ, ఎమ్.యీ.డీ చేశాను సార్. సెకెండరీ పోస్టులో వేశారు ఈ మండలంలోనే''

''అవునవును... మొత్తం పన్నెండుమంది లిస్టుకదూ అది... ఏదీ ఆర్డరు. ఎక్కడ పోస్టింగిచ్చేరూ?'' అని ఆర్డరు కాగితంకోసం చెయ్యిచాచేరు.

విద్యాసాగర్ వెంటనే జేబులోంచి తన అపాయింట్‌మెంట్ ఆర్డరు తీసి వినయంగా అతని చేతికి అందించేడు. ఆ తర్వాత చేతులు కట్టుకుని ఒద్దికగా అతనివేపే చూస్తూ వుండిపోయాడు.

ఆ కాగితం ఎగాదిగా పరిశీలించి ''ఊఁ... అయితే నువ్వు పనిచెయ్యాల్సింది 'పులిపుట్టు'లోనన్నమాట... బాగుంది''

''అవును సార్... నాకీమండలం కొత్తసార్... నేను వెళ్ళాల్సిన ఊరు ఎక్కడుందో తెలీడంలేదు. లోకల్‌గా ఒకరిద్దరిని అడిగేను కానీ అదెక్కడో ఈ ఏజెన్సీలో మారుమూల కొండలమీద వుందన్నారే కాని ఎవరూ సరిగా ఇన్ఫర్మేషనివ్వలేకపోయారు. మండలాఫీసుకెళ్తే ఎమ్.డీ.వోగారూ, ఎస్టాబ్లిష్మెంటు క్లర్కుగారూ వాళ్లు కేంప్ వెళ్లారని చెప్పారు. అక్కడెవరో మిమ్మల్ని కలుసుకోమని చెప్తే ఇలా వచ్చేను''

తను చెప్పదలుచుకున్న విషయం తడబాటు లేకుండా చెప్పేసినందుకు సంతృప్తిచెంది అతని జవాబుకోసం ఎదురుచూశాడు విద్యాసాగర్.

చేతిలో సిగరెట్టు టేబిలు అంచుకేసి రుద్ది గదిమూలకి విసిరేస్తూ ''ఈ మండలంవాడివి కావూ? పరదేశివన్నమాట! ఏ దేశం బాబూ తమది?'' వంకరగా నవ్వుతూ అడిగేడతను.

ఈ పరిణామానికి బిత్తరపోయాడు విద్యాసాగర్. ఈ ఎదురుదాడి అతను ఊహించనయినాలేదు. అంత వెక్కిరింతగా అతనెందుకు మాట్లాడుతున్నాడో అర్థం కాలేదు. తనమీద ఈ అకారణ కోపానికి హేతువు లేశమాత్రం కూడా అంతుబట్టలేదు.

ఆ మాటలకి చుట్టూ ఉన్నవారంతా పొట్టలు కదిలేలా నవ్వేరు. దాంతో అతను మరీ వెర్రెక్కిపోయాడు. అంతకుముందే కడుపులోకి దిగిన ద్రవం తన మహిమ చూపిస్తోందేమో-

''నాది భోగాపురం మండలం సార్'' విద్యాసాగర్ నీళ్లు నమిలేడు.

''మరి ఆ మండలమే ఎలాట్ చేయించుకోక ఈ ఏజెన్సీ ప్రాంతాన్ని వరించేరేమిటి స్వామీ''

తినెయ్యడానికి మేకపిల్ల దొరికితే కాస్సేపు కాలక్షేపం కోసం ఆడుకోవాలని సరదా పడుతున్న పులిలా రెచ్చిపోతున్నాడతను.

'తను ఈ సమయంలో ఇక్కడికి వచ్చి తప్పు చేశాడేమో'నని ఆ గదిలో అడుగుపెట్టాక మొదటిసారి అనిపించింది విద్యాసాగర్‌కి.

అక్కడి వాతావరణం వెగటుగా వుంది. అసహ్యాకరంగా వుంది. అవమానకరంగా వుంది.

అక్కడ మనుష్యులు మనుష్యుల్లా లేరు. మైకం తలకెక్కి మంచి హుషారుమీదున్నారు.



తనీగదిలోకి రావడానికి ముందే సీసాలు ఖాళీచేసే కార్యక్రమం పూర్తయినట్టుంది. వీరాస్వామి తెచ్చిన పలావ్‌పొట్లాలు తినబోతూ వుంటే తనొచ్చేడు. రాకుండా వుండాల్సింది.

అరుణ్‌పాండ్యాలాంటి నిజాయితీగల జాయింట్ కలెక్టరు కేవలం ప్రతిభ ఆధారం చేసుకుని- ఏ రిజర్వేషనూ లేని తనని మెరిట్ చూసి సెలక్టు చేశాడు. ఈ వ్యవహారంలో ఇదివరకయితే ఎమ్.యీ.వో జేబునిండేది. ఇప్పుడదేమీ లేక తను అపాయింట్‌మెంటు ఆర్డరుతో అతని ఎదుటికి రావడం కంటకింపుగా తోచి అతనలా మాట్లాడుతున్నాడన్న మాట. ఆ సంగతి కొద్దికొద్దిగా అర్థమవుతోంది విద్యాసాగర్‌కి.

విద్యాసాగర్ కళ్లలో సన్నగా నీళ్లు తిరిగాయి. రాబోతున్న ఏడుపుని బలవంతంగా అణుచుకున్నాడు. సమితిలో టీచరుగా నేడో రేపో తను జాయినయ్యాక తనమీద పర్యవేక్షణాధికారి అతను! ఎదిరించి ఏం మాట్లాడగలడు?

"నేను... నేనేమీ ప్రయత్నాలు చెయ్యలేదు సార్... ఈ మండలం ఎలాట్ చేశారు. ఎమ్.డీ.వోగారు పులిపుట్టులో పోస్టింగు ఆర్డరు పంపించేరు. ఆర్డరు నాకు టపాలో అందింది" అన్నాడు నీళ్లు నములుతూ.

ఎమ్.యీ.వోగారు మరో సిగరెట్టు అందుకుని వెలిగిస్తూ, "అదేనయ్యా నేనూ అనేది... ఏ ప్రయత్నం అక్కరలేకుండా, ఎవర్నీ కలవనవసరం లేకుండా వచ్చిన ఉద్యోగాలు మీవి... పులిపుట్టు ఎక్కడుందో నేను చెప్పెయ్యాలి. అవసరమయితే వెంటవచ్చి తోవ చూపించెయ్యాలి. తమరెళ్లి జాయనయిపోతారు. ఆ తర్వాత నెలనెలా జీతంబిల్లు మా ముఖాన వేసికొడతారు-అవునా?"

అతని మాటలు కొంచెం ముద్దగా వస్తున్నాయి. కళ్లు ఇప్పుడిప్పుడే ఎర్రబారుతూ చూడ్డానికి భయంకొల్పుతున్నాయి.

మండల విద్యాశాఖాధికారివంటి బాధ్యత గల ఉద్యోగి అంత పరుషంగా, అంత విచక్షణ లేకుండా మాట్లాడుతూ వుంటే విద్యాసాగర్‌కి ఏంచెయ్యాలో తోచలేదు. స్థాణువులా ఉండిపోయాడు.

సిగరెట్ సరిగా వెలగలేదేమో, మరో అగ్గిపుల్ల గీస్తున్నాడతను. అగ్గిపుల్ల గీస్తున్న చేత్తోనే తన ఆర్డరు కాగితం పట్టుకుని వున్నారు. విద్యాసాగర్‌కి గుండె గుబగుబలాడింది. ఈ మనిషి మామూలు స్థితిలో లేడుకదా! ఆ అగ్గిపుల్ల మంట కాగితానికి అంటుకోదుకదా?

సిగరెట్టు వెలిగించుకోవడం పూర్తయ్యేక ఆరిన అగ్గిపుల్లను నేలకేసి కొట్టేడతను. అప్పటికి విద్యాసాగర్ మనసు కొంచెం కుదుటపడింది. తేలిగ్గా నిట్టూర్పు విడిచేడు.

"అదికాదు సార్..." అంటూ ఏదో చెప్పబోయాడు.

ఇంతలో-

హఠాత్తుగా జరిగింది ఆ సంఘటన!

ఊహించని విధంగా అక్కడి వాతావరణం వేడెక్కిపోయి, ఓ ఇరవై నిముషాలసేపు నానా బీభత్సంగానూ తయారయింది. ఎమ్.ఈ.వోగారు ఉగ్రనరసింహావతారమెత్తి చిందులు తొక్కేశారు. అతను కోపంతో అలా కథాకళి ఆడెయ్యడానికి కారణం- అప్పుడే ఆ గదిలోకి ఒక కొత్తవ్యక్తి అడుగుపెట్టడం-



అతను తెల్లషరాయీ కమీజు వేసుకున్నాడు. పొడుగ్గా రివటలా వున్నాడు. జుత్తంతా పైకిదువ్వుకుని, బుగ్గన కిళ్లీ బిగించేడు. అతను వేసుకున్న కిళ్లీ మంచివాసన వెదజల్లుతోంది.

వస్తూనే "నమస్తే సార్" అన్నాడతను.

బరువుగా వాలిపోతున్న కళ్లని పైకెత్తి అతనివేపు చూశారు ఎమ్.యీ.వో. తటాలున




అతని ముఖంలో రంగులుమారిపోయాయి. ముఖం రౌద్రంగా తయారయింది. మరుక్షణంలో తలదిండు కిందనుంచి సీసాతీసి గుటగుటమని నాలుగయిదు గుక్కలు మింగేశారు. ఆ తర్వాత సీసా మూత బిగించి మంచంమీద పడేస్తూ ఒంటికాలిమీద లేచిపోయారు. పూనకం వచ్చిన మనిషిలా వూగిపోసాగేరు. కోపంతో అతని శరీరం కంపించిపోతోంది. పెదిమలు అదిరిపోతున్నాయి. రెండు చేతులూ గాలిలో బారలుచాపుతూ అరవడం ప్రారంభించేరు. అతని నోటివెంట రకరకాలయిన తిట్లు బూతులతో కలగలిసిపోయి కర్ణకఠోరంగా వినవస్తున్నాయి.

ఈ హఠాత్పరిణామానికి విద్యాసాగర్ బిత్తరపోయి కొయ్యబొమ్మలా నిలువుగుడ్లేసి చూస్తూ వుండిపోయాడు. అతని కాళ్లలోనుంచి సన్నని జలదరింపు మొదలై ఒంట్లో మొత్తం వణుకు ప్రారంభమయింది. ఏదో తెలీని భయం అతన్ని ఆవరించింది. అరచేతులు చెమటతో తడిసి ముద్దయ్యాయి. అతని చూపు ఎమ్.యీ.వో.గారి చేతిలో నలిగిపోయి రెపరెపలాడుతున్న తన అపాయంటుమెంటు ఆర్డరు కాగితంమీదే నిలచివుంది. అతను కుడిచేతిని విసురుగా ఎటు కదిలిస్తే అటు చూస్తున్నాడు. ఎమ్.యీ.వో.గారి కుడిచేతి విన్యాసాన్నీ కదలికల్నీ విద్యాసాగర్ గొంతు తడారిపోతూవుంటే భయం భయంగా చూస్తూ వుండిపోయాడు.

గదిలో మిగిలిన వ్యక్తులు ఈ దశలో కలగజేసుకున్నారు. ఎమ్.యీ.వో.గార్ని శాంతవరచటంకోసం ప్రయత్నించసాగారు. వాళ్లు వారిస్తున్నకొద్దీ అతను మరింత రెచ్చిపోవడం ప్రారంభించేరు.

"ఏం నాగరాజు మేష్టరూ! ఏం నాయనా ఇలా వచ్చేరు తమరు? మీరు నాగరాజా! బుసకొడతారా! మీది పాంపగటకదూ... కాటేసి తడాఖా చూపిస్తానని అన్నారుటకదా. బద్మాష్... బస్తీకే నవాల్... ఈ మండలంలో నన్ను కాటేసే పాములేం వున్నాయో నేనూ చూస్తాను. తోకలు కత్తిరించేస్తాను ఏమనుకున్నారో! డబ్బులెక్కువ అడుగుతున్నాననీ, మండలంలో టీచర్లని పీడిస్తున్నాననీ కూస్తావా? నామీద డీ.యీ.వో.కి కంప్లయింటు పెడతావా! పెట్టుకో చూస్తాను... నీయవ్వ... నాతో పెట్టుకోకండి- ఒక్క కలంపోటుతో మీతో ఫుట్‌బాల్ ఆడేస్తాను జాగ్రత్త..." బూతులు మినహాయిస్తే అతని కేకల సారాంశం ఇదే.

అతను శివాలెత్తిపోతూ అరుస్తున్నంతసేపూ ఆ నాగరాజు అనబడే వ్యక్తి ఏం మాట్లాడలేదు. ఎదురు సమాధానం చెప్పలేదు. ముఖంలో ఏ భావమూ ప్రకటించకుండా చూస్తూ వుండిపోయాడు. అతను తొణక్కుండా బెణక్కుండా అంత నిర్లిప్తంగా ఎలా ఉండగలిగేడో విద్యాసాగర్‌కి ఒకపట్టాన అర్థంకాలేదు. మిగతావాళ్ళు మాత్రం రకరకాల అనునయవాక్యాలతో అతని కోపం తగ్గించడానికి ప్రయత్నిస్తూనేవున్నారు.

కేకలు వేస్తూ మధ్యలో చేతిలోని కాగితాన్ని విసిరికొట్టేరతను. బ్రతుకుజీవుడా అనుకుంటూ గదిలో ఓ మూల విసిరివేయబడిన ఆ కాగితాన్ని అందుకుని, నలిగిపోయిన ఆ కాగితాన్ని మడతలు సరిచేసే వ్యవధి లేకపోవడంవల్ల అలాగే జేబులో కుక్కుకున్నాడు విద్యాసాగర్.

అతనికి అక్కడనుండి ఎంత వేగిరం బయటపడి పారిపోదామా అనిపిస్తోంది. కాని అలా చేస్తే ఎదురయ్యే పరిస్థితి మరింత చేదుగా వుంటుందని స్ఫురించి అయిష్టంగానే అక్కడ ఓ మూలకి నక్కిపోయి చూస్తూ వుండిపోయాడు.

అరచి అరచి శక్తి వుడిగిపోయినా, ఎమ్.యీ.వో.గారి గొంతులోంచి ఏవో మాటలు గరగరలాడుతూ వినిపిస్తూనే వున్నాయి.

పదినిమిషాలు వీరంగం తరువాత చారల డ్రాయరు బొందువదులైందన్న ఆలోచన వచ్చి, బొందు సరిగా ముడివేసుకుని మళ్లీ మంచంమీద కూలబడ్డారాయన. అయినా ఇంకా రొప్పుతూనే ఉన్నారు. కేకలు వేయడం అయిపోయాక మళ్లీ ఆయన దృష్టి తటాలున 'మందు' మీదకి పోయింది. సీసా అందుకున్నారు. అందులో కొంచెం మాత్రమే మిగిలి వుండడం చూసి ముఖం చిట్లించుకున్నారు. అసహనంగా తల విదిలించికొట్టేరు.

ఆయన పక్కనున్నవాళ్లలో ఒకాయన చనువుగా వారించేడు. "ఇక చాలు గురూగారూ...

ఇప్పటికే లోడెక్కువయిపోయింది.... ప్లీజ్... మరింక చాలించండి సార్...'' అని బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నాడు.

అతనిమీద కన్నుసమన్నారు ఎమ్.యీ.వోగారు. ''అంటే ఆరు పెగ్గులకే నేను ఔటయిపోతానని నీ డౌటు. నేనెందుకూ పనికిరానివాణ్ణనీ, తాగడం తెలీని చవటదద్దమ్మ వీడనీ నీ ఊహ... అంతేనా?''

''అమ్మమ్మ... గురువుగారి కెపాసిటీ మాకు తెలీదు కనుకనా! అంతమాట అంటానా... ఏదో... కోపంతో ఇవాళ మరెండు పెగ్గులు ఎక్కువ లాగించేస్తున్నారని వద్దంటున్నాను. మిమ్మల్ని వెక్కిరించేంత గుండెధైర్యం మాకుందా చెప్పండి సార్'' అంటూ నసిగేడతను.

''కోపమా! కోపమున్నరా! నాకు మండెత్తిందంటే ఇలాంటి నాగరాజులు నాముందు పడగ దించెయ్యాల్సిందే- నామీద నిగిడితే ఒక్కోడి సర్వీసులోనూ బొక్కలు పొడిచేస్తాను. ఏం అనుకున్నారో!'' అంటూ సిగరెట్ పెట్టె కోసం మంచంమీద తడుముకోవడం మొదలెట్టారు.

ఎవరో సిగరెట్‌పెట్టె, అగ్గిపెట్టె అతని చేతికందించేరు.

అప్పటికే అతను తాగిన సిగరెట్ పీకల గుట్టొకటి ఆ గదిలో ఓ మూల పోగుపడివుంది. మరో సిగరెట్ ఆ నల్లని పెదాల మధ్య గుప్పుమంటూ పొగలు కక్కుతోంది.

బ్రాందీ వాసనా, సిగరెట్ పొగల వాసనా విద్యాసాగర్‌ని ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నాయి, ఇందాకటినుంచీ- అతని కడుపులో ఏదో వికారం మొదలయింది. తల పగిలిపోవడం ప్రారంభించింది. నోట్లో లాలాజలం ఉప్పగా తగులుతోంది. అతనికి మరింక అక్కడ నించోవడం రానురాను కష్టమైపోతోంది. ఒళ్లు స్వాధీనం తప్పుతోంది.

పెదిమల మధ్య సిగరెట్ ఉండడంతో ఎమ్.యీ.వోగారి నోరు తాత్కాలికంగా మూతపడింది.

అతను మాట్లాడటం ఆపేసిన క్షణాన్ని సద్వినియోగం చేసుకుంటూ నాగరాజు టీచరు చెప్పడం ప్రారంభించేడు.

''అయ్యా! మీరు నన్ను మన్నించాలి- నిజంగా మన్నించాలి. ఇందులో నాకే పాపం తెలియదు. నా గురించి మీకింత చెడ్డగా ఎవరు చెప్పారో నాకు తెలుసు. మీ దృష్టిలో నన్ను మీ శత్రువుగా చిత్రీకరించి తమ పబ్బం గడుపుకోవడానికీ, తన పనులు చేయించుకోడానికీ వాళ్లుపన్నిన ఎత్తుగడ అది. నాకు తెలుసు- నాకు తెలుసండీ, బాబూ! ఆ మాటలు విని మీరు నన్ను నిష్కారణంగా కోపగించుకుంటున్నారు.

ఎప్పుడూ లేనిది అయ్యగారు నన్నీవేళ ఇన్ని తిట్లు తిట్టేరు, నాకేం బాధ అనిపించడంలేదు. మీరు పెద్దలు. మా అధికార్లు. మీరు తిట్టడం, మేం పడడం విధాయకమే. తిట్టేరని నాకు బాధేం లేదు. కాదన్ను!

కానీ, మీరు సత్యం తెలుసుకోవాలి. మీ మీద వ్యతిరేకంగా ప్రచారం చేసేవాడ్నయితే ఇవాళ ఇప్పుడు మీ ఎదుటికి వచ్చి ఎందుకు నించుంటానో తమరే ఆలోచించండి.

లోగడ తమరు మా స్కూలుకి విజిట్‌కి వచ్చినపుడు నేనిచ్చిన ఆతిథ్యాన్ని ఓసారి గుర్తు తెచ్చుకోండి.

మీ దగ్గరకి వచ్చినపుడల్లా ఎప్పుడేనా వట్టి చేతుల్తో వచ్చేనా! మీరే చెప్పండి!

ఇదిగో ఇప్పుడిది మీకు సమర్పించుకుందామని వచ్చేను. తీరా నేను నోరు విప్పేలోగానే మీరు నా మీద కలియబడిపోయి కరిచేస్తున్నారు.

నేను బాధపడను కానీ, నిజం మీరు గ్రహించుకోవాలి. మీరు నన్ను దులపరించేసినందుకు నాకు బాధేంలేదు. నేను మీకు వ్యతిరేక వర్గంవాడ్ని కాదని మీరు గ్రహిస్తే అంతేచాలు.

తెరవెనుక మనుషులెవరో తమకి తర్వాత విశదం చేస్తాను. అందాకా ఇదుంచండి. ఫారిన్ సరుకు. మా తోడల్లుడి స్నేహితుడొకడు మిలటరీలో పని చేస్తున్నాడు. అతనిప్పుడు సెలవుల్లో ఇక్కడికొచ్చేడు. అతను దీన్ని మా తోడల్లుడికిస్తే కాళ్లా వేళ్లావడి బతిమాలి మీకిచ్చుకుందామని తెచ్చాను దీన్ని. తీసుకోండి...

అంటూ ఓ అందమయిన బాటిల్




ఎమ్.యీ.వో గారిచేతికందించేడు నాగరాజు.

దాన్ని చూస్తూనే మంచుగడ్డలా కోపమంతా కరిగిపోయింది ఎమ్యీవోగారికి.

దాన్నందుకుని అభినందిస్తున్నట్టుగా అత నివేపు చూసేరు.

క్షణం క్రితం కోపంతో జేవురించిన అతని ముఖంలో ఇప్పుడు ప్రసన్నత చోటు చేసు కుంది.

తక్కిన వాళ్లంతా ఆబగానూ, ఆసక్తిగానూ అతని చేతిలో గువ్వపిట్టలా ఒదిగిపోయివున్న సీసావేపు చూడసాగేరు.

ఆ దృశ్యం రుచించని వ్యక్తి అక్కడ విద్యా సాగర్ కాక మరొకరున్నారు.

అతను జానకేశ్వరరావు. అతను టైం చూ సుకుంటూ అన్నాడు, ''సార్ కొంచెం బజారులో పనుంది నాకు. సెలవిప్పిస్తే వెళ్తాను''

కొత్త సీసా చేతిలో పడిన హుషారులో సరే అని తలూపేరాయన.

విద్యాసాగర్ కూడా అప్రయత్నంగా చేతులు జోడించి ఇక వెళ్లొస్తానన్నట్టుగా తల వంకించి అభినయించేడు.

''వెళ్లవోయి, పులిపుట్టు మేష్టరూ! పులిపుట్టు కి దారేదని అడిగేవుకదూ! అమాయకుడా! ఆ దారేదో మా జానకేశ్వరరావు మేష్టరు నీకు చెప్తాడులే. ఓయ్ జానకీ! ఈ పిల్ల మేష్టరుకి దారి చూపించి గైడ్ చెయ్యివోయ్, ఇహ వెళ్లి రండి''

గలగలా మాట్లాడేస్తూ పడిపడి నవ్వడం మొదలెట్టారు ఎమ్యీవోగారు.

అతనన్న మాటల్లో ఏం హాస్యం వుందో కానీ చుట్టూవున్న వాళ్లందరూ కూడా అతన్తో శ్రుతి కలిపి నవ్వసాగేరు.

ఆ నవ్వుల మధ్య సెలవు తీసుకుని జానకే శ్వరరావు విద్యాసాగర్ జబ్బపట్టుకుని బయట కి బయలుదేరదీశాడు.

గదిలోంచి బయటకి వచ్చేస్తూ, ఒక లిప్త కాలం వెను తిరిగి చూసిన విద్యాసాగర్ కళ్లకి నాగరాజు పళ్లు బయటపడేలా నవ్వుతూ ఎమ్ యీవోగారి తొడమీద చెయ్యివేసి అతనిని తాకుతూ కూచోడం కనిపించింది.

ఎమ్యీవో గారు కూడా అతని చనువుని దయతో అపార్థం చేసుకున్నట్టు లేదు.

జానకేశ్వరరావు జబ్బపట్టుకుని నడిపిస్తూ వుంటే, తూలుతున్నట్టు నడుస్తూ మేడ మెట్లు దిగి రోడ్డు మీదకి రాగానే భళ్లున వాంతి చేసుకున్నాడు విద్యాసాగర్.

★ ★ ★

''అరే! ఏమయింది... ఏమయింది విద్యా'' వాంతి చేసుకున్న విద్యాసాగర్ వేపు గాభరాగా చూస్తూ కంగారుగా అడిగేడు జానకేశ్వరరావు.

విద్యాసాగర్ మరింక నిల్చోడానికి శక్తి చాల నట్టుగా రోడ్డు వారన అక్కడే ముంగాళ్ల మీద కూర్చుండిపోయేడు. జానకేశ్వరరావు అతని వీపు మీద నుంచి వంగి అరచేతులతో రెండు చెవులూ మూసేడు. ''డోంట్‌వర్రీ ఫ్రెండ్... మరేం భయంలేదు. కడుపులో వికారం తగ్గిందా? ఇంకా వాంతయేలా వుంటే కాని వ్వండి. మీకు పూర్తిగా నిమ్మళించేక నోరు కడుక్కోడానికి సోడా తెస్తాను'' అన్నాడు ధైర్యం చెప్తూ.

ఆ ప్రియ వచనాలకి విద్యాసాగర్ మనసు కదిలి పోయింది. కళ్లలో నీళ్లు చిప్పిల్లాయి. తను వాంతి చేసుకుంటున్నపుడు, అతడు తనని గురించి గాభరా పడుతూ పిలిచిన పిలుపు గుండెని మలయమారుతంలా చల్లగా తాకింది.

''విద్యా!'' అమ్మ పిలిచినట్టు, నాన్న పలక రించినట్టు. హఠాత్తుగా, అప్రయత్నంగా హృద యంలోంచి బయలుదేరి నూటిగా బయటకి వెలువడిన ఆత్మీయత రంగరించుకున్న పిలుపు అది!

ఏ పూర్వ పరిచయమూలేని తనని కష్టంలో ఆదుకుంటూ స్నేహహస్తం చాచినట్టుగా ఎంతో ప్రేమగా పిలిచిన పిలుపు అది.

కృతజ్ఞతనిండిన కళ్లతో అతని ముఖంలోకి చూసేడు విద్యాసాగర్.

''ఇప్పుడెలా వుంది... సర్దుకుందికదా... కాసే పిలా ఈ మెట్ల మీద కూచోండి'' అని విద్యాసా గర్‌ని ఆ పక్కనున్న షాపు మెట్ల మీద కూచోపె ట్టి గబగబ వెళ్లేడు జానకేశ్వరరావు.

వెళ్లి ఒకటి, రెండు నిముషాలలోనే ఒక సోడా, ఒక కూల్‌డ్రింక్ సీసాలతో తిరిగొచ్చేడు.

సోడా అందించి, ''ముందు నోరు కడుక్కోండి పుక్కిలించి వుమ్మెయ్యండి, ఆ తర్వాత డ్రింకు తాగుదురుగాని'' అన్నాడు.

విద్యాసాగర్ ఆ సోడా సీసా అందుకుని నీళ్లు నోట్లో పోసుకుని పుక్కిలించి వుమ్మేసి నోరు శుభ్రం చేసుకున్నాడు. మిగిలిన కొద్దిపాటి నీళ్లు చేతిలో వంపుకుని ముఖం మీద చిలకరించుకున్నాడు.

అప్పటికి స్వస్థత చేకూరి నట్లనిపించింది. కడుపులో వికారం పూర్తిగా తగ్గింది.

ఖాళీ సోడా సీసాని అందుకుంటూ కూల్ డ్రింక్ బాటిలు అందించేడు జానకేశ్వరరావు.

''ఎం... ఎందుకండీ... తగ్గిందిలెండి'' పుచ్చుకోడానికి మొహమాటపడుతూ అన్నాడు విద్యాసాగర్.

''భలేవారే! ముందిది తాగండి చెప్తాను'' అని బలవంతం చేశాడు జానకేశ్వరరావు.

మరింక తప్పక దాన్నందుకుని మూడు నాలుగు గుక్కల్లో కూల్‌డ్రింక్ తాగడం పూర్తి చేశాడు విద్యాసాగర్.

ఆ బాటిలు కూడా జానకేశ్వరరావు అందుకోడానికి చెయ్యి చాపితే ''వద్దొద్దు... పదండి... ఎక్కడినుంచి తెచ్చారు వీటిని, నేను డబ్బులిస్తాను'' బయలుదేరుతూ అన్నాడు విద్యాసాగర్.

జానకేశ్వరరావు అతనివేపు ఆదరంగా చూసేడు.

నవ్వుతూ చనువుగా అతని చేతిలో నుంచి కూల్‌డ్రింక్ సీసా లాక్కుని ''ఉండండి ఇప్పుడే వస్తాను'' అంటూ ఆ పక్కనున్న కిళ్లీ షాపువేపు వెళ్లాడు. అక్కడ బాటిల్సు ఇచ్చేసి, డబ్బు చెల్లించేక మళ్లీ విద్యాసాగర్ దగ్గరకొచ్చేడు.

''ఆ గదిలో వాతావరణం చూసి ఆ అసహ్యానికి మీరు తట్టుకోలేకపోయేరు. అందుకే వాంతి చేసుకున్నారు. కదూ విద్యాసాగర్?'' అనడిగేడు మృదువుగా.

విద్యాసాగర్ ఓ క్షణంసేపు ఏమీ బదులు చెప్పలేదు. జానకేశ్వరరావు కళ్లలోకి ఆపేక్షగా చూస్తూ వుండిపోయేడు ఏదో వెతుక్కుంటున్నట్టుగా.

కాస్సేపు ఆగేక ఒక్కొక్క మాటే పేర్చుకుంటూ నెమ్మదిగా అన్నాడు. ''నన్ను... నన్ను... మీరు విద్యాసాగర్ అని పిలవకండి... ఇందాక పిలిచారే విద్యా అని ప్లీజ్... అలాగే పిలవండి. మీర్నన్ను అలా పిలవడమే నాకిష్టం''

అతని స్వరం తెలీని ఉద్వేగంతో నిండిపోయింది.

జానకేశ్వరరావు ఆశ్చర్యపోతూ చూసేడతని వేపు. ఆ క్షణంలో ఒక నూతన మైత్రీబంధానికి అంకురార్పణ జరిగిందక్కడ. ఒక స్నేహ పవనం రెండు గుండెల్ని హాయిగా సేదదీర్చింది.

''అలాగే విద్యా!'' అంటూ అతని అరచేయి అందుకుని సుతారంగా నొక్కి వదిలేడు జానకేశ్వరరావు.

''మీరింక ఇంటికి వెళ్లాలనుకుంటాను. వెళ్లి విశ్రాంతి తీసుకోండి'' చేతివాచిలో టైం చూసుకుంటూ అన్నాడు జానకేశ్వరరావు

''ఫరవాలేదు. ఇప్పుడు రిలీఫ్‌గానే వుందిలెండి. అప్పుడే ఇంటికి వెళ్లి చేసేదేమీ లేదు కూడా''

''అయితే అలా వంతెనవేపు వెళ్లి కాసేపు కూచుని వద్దాం, వస్తారా?''

''ష్యూర్... పదండి''

ఇద్దరూ వంతెన వేపు బయలుదేరారు. టైం సాయంత్రం ఏడున్నర దాటింది.

పెద్ద పట్నానికీ పల్లెటూరికీ మధ్యస్థంగా వుండే ఒక మోస్తరు ఊరది. ఏజెన్సీ ముఖద్వారం కావడంచేత, చుట్టుపక్కల రవాణా సౌకర్యాలున్న వూళ్లు అంతంత మాత్రంగా వుండడం చేత ఆ ఊరే ముఖ్య వాణిజ్య కేంద్రంగా రూపొందింది.

ఓ నాలుగు సినిమా హాళ్లూ, తగుమాత్రం లాడ్జింగ్ హవుస్‌లూ వున్నాయి. వ్యాపారాల నిమిత్తం, ఆఫీసు పనుల నిమిత్తం, సినిమాలు చూసి పోడానికీ చుట్టుపక్కల గ్రామాలనుంచి వచ్చే జన సంఖ్యే హెచ్చు.

రోజూ నాలుగాటలతోనూ, పండుగ రోజుల్లో అయితే ఐదాటలతోనూ వున్న నాలుగు సినిమా

థియేటర్లూ కిటకిటలాడిపోతూ వుంటాయి. సాయంత్రం పూట ఆర్టీసీ బస్సులు తిరుగు ప్రయాణీకులతో కిటకిటలాడి పోతూ ఉంటాయి. నాలుగయిదు లాడ్జీలున్నాయన్న మాటేకానీ వాటిలో కనీస సౌకర్యాలు కూడా మృగ్యం. సాయంత్రాలూ, రాత్రులూ అక్కడ గొడవ పడుతూనో పెద్దగా మాట్లాడుకుంటూనో వుండటం మామూలే కనుక లాడ్జి యజమాను లు ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోరు.

ఆ ఇద్దరూ మెయిన్‌రోడ్డు దాటి వంతెన దగ్గరకి చేరేసరికి పావుగంటపైగా పట్టింది. అప్పటికి చీకటి చిక్కబడింది.

ఆశ్వయుజ మాసపు చివరి రోజులు కావ డంచేత చలిగాలి ఒంటిని గిలిగింతలు పెడ తోంది.

ఇద్దరూ వంతెన మీదకి చేరి జనసంచారం అట్టేలేని చోటు చూసుకుని కూచున్నారు. అంతకుముందే అక్కడకి షికారుకి వచ్చిన వాళ్లు ఒక్కొక్కరే ఇళ్లకు బయలుదేరుతున్నా రు.

వంతెన కింద నీరు నిశ్శబ్దంగా పారుతోంది. కూతవేటు దూరంలో ఎలక్ట్రిక్ దీపాల వెల్తుర్లో ఊరు నంగనాచిలా కనిపిస్తోంది. అన్ని పాపా లూ చూస్తూ కూడా కళ్లు మిటకరించి చూసే టక్కరిలా ఆ దీపాలు కనిపిస్తున్నాయి.

''చలి మొదలయింది''

''అవును''

''ఈ యేడు చలి హెచ్చుగానే ఉండేట ట్టుంది''

''ఊఁ...''

''మీరేమీ సరిగా మాట్లాడటంలేదు. ఇందా కటి సంఘటనే మిమ్మల్నింకా కలత పెడుతు న్నట్టుంది. మరిచిపొండి. దాని గురించి మీ రంతగా పట్టించుకోకండి''

''అబ్బే లేదు... లేదు... కానీ, నాకలాంటి పరిస్థితి బొత్తిగా కొత్త. ఆయనలా ప్రవర్తిస్తారని నేను కలలో కూడా ఊహించలేదు'' విద్యాసా గర్ నొచ్చుకుంటూ అన్నాడు.

జానకేశ్వరరావు చిరునవ్వునవ్వేడు.

వెచ్చదనం కోసం అరచేతులు ఒకదానికొ కటి రుద్దుకుంటూ ''నిజమే... మీకు కొత్త కనుక అలా అనిపిస్తోంది. కానీ మాకివి నిత్యం అల వాటు అయిపోయాయి. మీరింకా ఇప్పుడే ఈ చీకటి దారుల్లోకి అడుగుపెట్టారు. ఈ దారిలో ఎన్నో రాళ్లూ, రప్పలూ, ముళ్ళతుప్పలూ, డొంక లూ ఇలాంటి చేదు అనుభవాలు ఒక్కొక్కటీ ఎదురవుతున్న కొద్దీ మీ మనసు కూడా రాటుదే లిపోతుంది''

విద్యాసాగర్ అతని వేపు నిబిడాశ్చర్యంతో చూసేడు. కళ్లు పెద్దవి చేసుకుంటూ ''చీకటి దారులా!'' అన్నాడు.

''మరి... కనీసం వెలుగుబాటలు మాత్రంకావు''

''అంటే... రాళ్లూ రప్పలే తప్ప గులాబులూ సుగంధాలూ శూన్యమేనంటారా?'' ప్రశ్నించే డు.

తమ సంభాషణ కొంత భావుకతతో చిత్రంగా సాగుతున్న సంగతి విద్యాసాగర్ గమనించకపోలేదు. కానీ ఊరు చివర ఈ ప్రశాంత వాతావరణంలో, చల్లగాలి గుండెల నిండా పీల్చుకుంటూ, ఇందాక లాడ్జిలో జరి గిందాన్ని మరిచిపోడానికి ప్రయత్నిస్తూ జానకే శ్వరరావుతో అలా మాట్లాడటమే తనకెంచేతో బాగుంది.

''లేవనను... వెతికితే అక్కడా అక్కడా కని పించకపోవు. కానీ చిక్కేమిటంటే ఇక్కడికొ చ్చేక మల్లె మొక్క అనుకున్నది కాస్తా ముళ్ల కంచె అయి కూచుంటోంది''

నవ్వుతూ అన్నాడు జానకేశ్వరరావు.

ఈ ఆలోచనలోని సత్యాసత్యాలను మననం చేసుకుంటున్నట్టుగా ఒక్కక్షణం ఏమీ మాట్లా డకుండా ఇద్దరూ మౌనం వహించేరు.

ఆ తర్వాత విద్యాసాగరే సంభాషణ కొనసాగి స్తూ అన్నాడు, ''సరేలెండి, ఈ గులాబులూ, ముళ్లూ వీటి సంగతి కాస్సేపు పక్కన పెడదాం. ఇంతకీ మన ఎమ్మియావో గారి గురించి చె ప్పండి'' అంటూ హాయిగా నవ్వేశాడు.

కొన్ని గంటల అనంతరం ఇవాళ అతనిలో హాసరేఖలు ముఖాన కనిపించింది ఇప్పుడే.

విద్యాసాగర్ మళ్లీ మామూలు మూడ్‌లోకి రావడం సంతోషం కలిగించింది జానకేశ్వరరా వుకి.



హుషారుగా చెప్పడం ప్రారంభించేడు.

"ఏం చెప్పమంటారు చెప్పండి. మన మండలానికి అతను విద్యాశాఖాధికారిగా వచ్చి ఆర్నెలలు కావస్తోంది. ఈ మండలంలో ఎలిమెంటరీ స్కూళ్లలో పనిచేసే మేష్టర్లందరినీ నంజుకు తినేస్తున్నాడు.

అతని పేరు అచ్యుతరావు.

పట్టని వ్యసనం అంటూ లేదతనికి. మేష్టర్లని పీడించి డబ్బు లాగడం, సంపాదించినదంతా పీకలదాకా తాగెయ్యడం...

ఆ కుటుంబ పరిస్థితి చూస్తే జాలేస్తూ వుంటుంది.

లంచగొండి ఆఫీసర్లు చాలామందే వున్నారుకానీ ఇతనిలా తమ కుటుంబాలను అధ్వాన్న స్థితిలో వుంచే వ్యక్తులు అరుదు.

అంటే నేను లంచగొండితనాన్ని సమర్థిస్తున్నాననుకోకండి. అచ్యుతరావుగారి కుటుంబస్థితిగతులు చూస్తూ వుంటే మన దగ్గర దోచుకుంటున్న డబ్బుతో వాళ్ల కనీస అవసరాలు కూడా తీర్చటం లేదే అని బాధపడుతూ వుంటాను.

ఇవాళ చూసేరుకదూ ఆ వీరంగం? ఆ చిందులు?

ఊపిరి పీల్చుకోడానికి కాస్సేపు ఆగేడతను. విద్యాసాగర్ విభ్రాంతిగా అతని ముఖంలోకే చూస్తున్నాడు.

తాగిన మైకంలో అతనికి ఒళ్లు తెలీదు. దానికితోడు చెయిన్ స్మోకింగొకటి. టీచర్లు వాళ్ళ వాళ్ల పనులు చేయించుకోవడం కోసం అతని చుట్టూ చేరి మందు పార్టీల మజాలో ముంచెత్తేస్తూ వుంటారు.

ఆ నాగరాజు మేష్టారుని చూసేరుగా! అతనో తిరకాసు మనిషి. అచ్యుతరావుగారి ఎదుట ఎంత వినయాన్ని ప్రదర్శిస్తాడో అతని వెనుక అన్ని దుర్భాషలు ఆడుతూ వుంటాడు. అందుకే ఇందాక ఎమ్యీవోగారు అతని మీద అంతగా ధ్వజమెత్తారు.

అసలు ఎమ్యీవోగారు కుటుంబాన్ని ఈ ఊరు తెచ్చుకోకపోవడానికి ముఖ్య కారణం ఈ విలాసాలే. ఆయన తమ మీద అగ్గిరాముడై పోతే అతన్ని ఎలా కూల్ చెయ్యాలో నాగరాజు లాంటి వాళ్లకి బాగా తెలుసు''

''ఫారిన్ లిక్కరు సప్లయ్ చేసి కదూ...'' నవ్వడానికి ప్రయత్నిస్తూ అన్నాడు విద్యాసాగర్.

ఈసారి అతని నవ్వులో ప్రసన్నతలేదు. ఏదో విషాదం తొణికిసలాడుతోంది.

అతని స్వప్నసౌధాలు ఒక్కొక్కటే కళ్ల ముందు కూలిపోతున్నాయి. అతని ఆదర్శానికీ, ఆశయాలకీ అవరోధాలు దృగ్గోచరమవుతూ వుంటే అతడు ఖిన్నుడైపోతున్నాడు.

తను ఆశించినదేమిటి? తనకి ఎదురవుతున్నదేమిటి?

ఈ యేటికి తను ఎదురీదగలడా?

లేక ఈ ఊబిలో తనూ కూరుకుపోయి, ఆ దుర్గంధమే సుగంధమని తననుతాను భ్రమింపచేసుకుంటూ జీవించడానికి అలవాటు పడిపోతాడా!

ఏమో!

''మన విద్యాశాఖలో ఇప్పుడందరూ ఇలాగే ఉంటున్నారంటారా?'' నీరసంగా అడిగేడు.

''ముళ్ల వెంటే గులాబీలూ వుంటాయన్న సంగతి మరచిపోతున్నారు విద్యా!''

''మరి ఇలాంటి అవినీతిపరుల గురించీ, వ్యసనపరుల గురించీ ఎవరూ పట్టించుకోరేం? పై అధికారులకి రిపోర్టు చెయ్యొచ్చుకదా?''

''చెయ్యరు! ఎంచేతనంటే ఇక్కడి వాళ్లలో అధిక సంఖ్యాకులకి డబ్బు పారేస్తే తమ పనులు సజావుగా జరిగిపోతున్నాయి కనుక. రిపోర్టు చేసీ ప్రయోజనం లేకపోవచ్చుననే భయం మరొకటి. ప్రతిచోటా ఎవరో ఒక అచ్యుతరావు ఉండనే వుంటాడు గదా!''

అతనా మాటలన్నాక మరింక ఏమీ అనలేకపోయేడు విద్యాసాగర్. హఠాత్తుగా అతనికి తనని టీచరుగా అపాయింటు చేసిన ఊరు సంగతి గుర్తొచ్చింది.

''అన్నట్టు, పులిపుట్టు సంగతి చెప్పారేకాదు, ఎలా వెళ్లాలి. ఎంతదూరం వుంటుంది'' అంటూ ఆత్రుతగా అడిగేడు.

జానకేశ్వరరావునుంచి అతనికి వెంటనే కావలసిన సమాచారం దొరకలేదు.

దాని గురించి ఇప్పుడు మాట్లాడ్డం ఇష్టం లేని వాడిలాగా చుట్టూ చిక్కబడిన చీకటిని చూస్తూ ''బాగా లేటయినట్టుంది. ఇక పోదాం పదండి'' అంటూ లేచాడు జానకేశ్వరరావు.

ఇంత మంచి వాడిలా కనిపించే అతనిలో ఇంకా ఏదో అంతుబట్టని సన్నని మెలిక ఉన్నట్టు తోచి బాధ కలిగింది విద్యాసాగర్‌కి.

''ఇప్పుడు చెప్పకూడదా యేం?'' అన్నాడు కొంచెం రోషం తెచ్చుకుంటూ.

''లేదు... రేపు ఉదయం చెప్తాను. ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది. మీ ఇల్లెక్కడో చెప్పండి. రేపు ఉదయం మిమ్మల్ని తప్పక కలుస్తాను'' అంటూ మరో మాట మాట్లాడటానికి వ్యవధి ఇవ్వకుండా విద్యాసాగర్‌ని బయలుదేరదీశాడు.

ఇద్దరూ ఊళ్లోకి దారితీశారు.

★ ★ ★

''వాడింకా రాలేదా?'' నారాయణమూర్తిగారు ఇలా అడగడం అప్పటికి ఎన్నోసారో!

''లేదు... అదే చూస్తున్నాను. సినిమాకిగాని వెళ్లాడో యేమో. చెప్పకుండా ఎప్పుడూ వెళ్లడే...'' ఎంత దాచుకుందామని ప్రయత్నించినా ఆమె మనసులోని ఆందోళన బయ




టపడుతూనే ఉంది.

రాత్రి పదకొండు గంటల ప్రాంతం. విద్యా ఇంకా ఇంటికి రాలేదు. ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో! పిల్లలిద్దరూ చదువులు ముగించి నిద్రలోకి జారుకున్నారు. విద్యాసాగర్ తర్వాత పుట్టింది శాంతి. ఆ పిల్ల పదో తరగతిలోకి వచ్చింది. వెంకుబాబు వారికి చివరి సంతానం. కొంచెం ఆలస్యంగా పుట్టేడు. ఏడో తరగతి చదువుతున్నాడు. పెద్ద కూతురు ఉమ పెళ్లయి పోయి భర్తతో విశాఖపట్నంలో ఉంటోంది.

విద్యాసాగర్ ఇంటికి రావడానికి రాత్రి పూట ఎప్పుడూ ఇంత ఆలస్యం చేయలేదు. పెందళాడే వచ్చి భోజనం ముగించి చెల్లికీ, తమ్ముడికీ పాఠాలు చెప్తూ దగ్గిరుండి చదివిస్తూ ఉంటాడు. ఆ తర్వాత ఏ పుస్తకమో చేతబుచ్చుకుని ఏ అర్ధరాత్రికో గాని పడుకునేవాడుకాదు.

అలాంటిది ఈ రోజు ఇప్పటికింకా ఇల్లు చేరలేదు. నారాయణమూర్తి దంపతులు ఆందోళన చెందడానికి ఇదే కారణం.

ఎక్కడకి వెళ్లాడో!

ఎప్పుడూ ఇంత ఆలస్యం చెయ్యడే...

భర్త నడుంవాల్చి పడుకున్న మంచం పక్కనే కుర్చీ మీద కూచుని ఏదో వారపత్రిక లోని పేజీలు అనాసక్తంగా తిరగవేస్తోంది పార్వతమ్మ. ఉదయం నుంచీ పనిచేసి అలిసిపోయిన ఆమె కళ్లు బరువుగా వాలిపోతున్నాయి. శరీరం విశ్రాంతి కోరుతోంది.

"పోయి పడుకోరాదూ"

"ఫరవాలేదు. వాడొస్తే అన్నంపెట్టి పడుకుంటాను"

కాసేపు ఇద్దరిలో ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఓ చెవి వీధి తలుపు ఎప్పుడు చప్పుడవుతుందా అని అటువేపు పడేసి ఎవరి ధ్యానలో వాళ్లుండి పోయేరు.

నారాయణమూర్తిగారు కోర్టులో గుమాస్తా. సర్వీసు ఇంకా దాదాపు ఎనిమిదేళ్లువుంది. విద్యాకి ఉద్యోగం దొరకడం అతనికెంతో సంతోషాన్నీ బలాన్నీ ఇచ్చింది. వేలకు వేలు పోసి ఉద్యోగాలు కొనుక్కుంటున్న రోజుల్లో అనాయాసంగా ఏ ప్రయత్నమూ లేకుండానే వాడికీ ఉద్యోగం లభించింది. ఓ పక్క రిజర్వేషన్లు అమలు చేస్తూనే మెరిట్‌కి పట్టంకట్టి నిజాయితీగా నిక్కచ్చిగా వ్యవహరించిన కొత్త జాయింటు కలక్టరు పాండ్యా అతని మనసులో మెదిలారు. అతని మనసు ప్రఫుల్లమయింది. కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. మనసులోనే అనేక ధన్యవాదాలు చెప్పుకున్నారు. లేకపోతే ఈ ఉద్యోగాల సంతలో తన కొడుక్కి ఓ ఉద్యోగం తను కొని పెట్టగలిగి వుండేవాడా! చదువూ, ట్రయినింగూ పూర్తయిన కొద్దికాలానికే వాడికి టీచరు ఉద్యోగం రావడం అదృష్టంకాక మరేమిటి!

నారాయణమూర్తిగారి పెదవుల మీద తృప్తితో కూడిన నవ్వొకటి మెరిసి మాయమయింది.

భర్త ఎందుకో నవ్వుతున్నట్టనిపించి ఓసారి అతని ముఖంలోకి చూసి, "అన్నట్టు మన విద్యాని పోష్టుచేసిన ఆ ఊరెక్కడ వుందో వాకబు చేశారా?" అనడిగింది.

భార్య ప్రశ్న విన్నాక నారాయణమూర్తిగారి ముఖంలో హాసరేఖలు మటుమాయమై దిగులు చోటు చేసుకుంది.

చిన్న నిట్టూర్పు విడిచి చెప్పేరు, "తెలిసినవాళ్లందరినీ అడిగేను. ఎవరూ సరిగా చెప్పలేకపోయేరు. ఎక్కడో మారుమూల కొండల మీద వుందిట ఆ ఊరు. పూర్తిగా కొండదారి వెంట, పొలాల గట్లమ్మట చాలా కిలోమీటర్లు నడిచి వెళ్లాలిట. మధ్యలో ఒకటి రెండు కొండ వాగులు కూడ దాటి వెళ్లాల్సి ఉంటుందేమో అన్నారు. ఇక్కడినుంచి కొంతవరకే బస్సు సౌకర్యం వుందిట. ఆ పైన కిలోమీటర్ల కొద్దీ కొండలూ గుట్టలూ దాటి వెళ్లాలనీ, ఒంటరిగా వెళ్లడం సాధ్యం కాదనీ తలోరకంగా చెప్తున్నారు. అవన్నీ వింటూ వుంటే భయంగా వుంది"

భర్త మాటలు విని పార్వతమ్మ ముఖం వివర్ణమై పోయింది. కొడుక్కి చిన్న వయసులోనే ఉద్యోగం వచ్చిందన్న సంతోషం హరించుకుపోయింది. అలాంటి చోట ఎలా వుంటాడో, ఎలా పని చేస్తాడో అని ఆమెలో ఆరాటం అధికమైపోయింది.

ఇంతలో వీధి తలుపు చప్పుడయింది. పార్వతమ్మ చప్పున లేచి వెళ్లి తలుపు

తీసింది. విద్యాసాగర్ ఇంటిలోకి అడుగుపెట్టే డు.

"ఇంత లేటయిందేం విద్యా! సినిమాకి వెళ్లావు కాబోలు" మామూలుగా అడిగేరు తండ్రి.

"లేదు నాన్నా! ఎవరో కనిపిస్తే అతన్తో ఆ సంగతీ ఈ సంగతీ మాట్లాడుతూ ఉండిపోయేను. టైం గమనించలేదు. అన్నట్టు... వీళ్లిద్దరూ ఇవాళ ఏమైనా చదివేరా. పరీక్షలు దగ్గరకొస్తున్నాయి కూడా" అడిగేడు చెల్లి గురించీ, తమ్ముడి గురించీ.

"ఆc... ఇంతసేపూ చదువుకుని ఇప్పుడే పడుకున్నారు. నువ్వు బట్టలు మార్చుకుని కాళ్లు కడుక్కో. భోజనం చేద్దువుగాని" అంటూ వంటింట్లోకి దారి తీసింది తల్లి.

విద్యాసాగర్ మౌనంగా బట్టలు మార్చుకుని లుంగీకట్టుకుని కాళ్లు కడుక్కోడానికి బాత్‌రూంలోకి వెళ్లాడు. కొడుకు ఉదాసీనంగా వుండడం ఆ తల్లీతండ్రీ గమనించకపోలేదు. కారణం అడగడం వాళ్లకిష్టం లేకపోయింది. ఎక్కడో, మారుమూల కొండల్లో తొలిసారిగా ఉద్యోగంలో ప్రవేశించవలసి రావడంతో కొంచెం కలత చెందుతున్నాడని అనుకుని వాళ్లు అతన్ని మరేమీ అడగలేదు.

కాళ్లూ చేతులూ కడుక్కొని వచ్చేక, తల్లి వడ్డిస్తూ వుంటే కంచం ముందు కూచున్నాడు విద్యాసాగర్. అతని మౌనం తల్లిని కలవరపరుస్తోంది. కొడుకు ఎందుకో బాధపడుతున్నట్టు తెలుస్తూనే వుంది. జరగరానిది ఏమైనా జరిగిందా! ఎప్పుడూ గలగలా మాట్లాడేస్తూ, కొసరి కొసరి అన్నీ అడిగి వడ్డించుకుంటూ తాపీగా ఓ గంటసేపు భోజనం ముందు కూచుండే విద్యా ఈ రోజు అన్నం తినడం రెండు మూడు నిముషాలలోనే ముగించేడు. అన్నం అటూ ఇటూ కెలికి, ఏవో నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని భోజనం అయిందనిపించేడు. అతను చెయ్యి కడిగేసుకుంటూ వుంటే "అరె! ఏమిట్రా అది... అప్పుడే లేచిపోతున్నావేం..." పార్వతమ్మ ఆదుర్దాగా అడిగింది.

"ఆకలిగా లేదమ్మా" అన్నాడు



మంచం మీద పడుకున్నాడన్న మాటేకానీ విద్యాసాగర్‌కి ఎంత రాత్రయినా నిద్రపట్టలేదు. విసుగ్గా అటూ ఇటూ పక్క మీద దొర్లుతున్నాడు.

సాయంత్రంనుంచీ జరిగిన సంఘటనలు ఒక్కొక్కటీ అతని మనసుని ములుకుల్లా తాకి బాధిస్తున్నాయి.

ఎమ్.యీ.వోగారిని కలవడానికి లాడ్జికి వెళ్లినపుడు అక్కడ వీరాస్వామి ఎంతసేపటికీ తన ఉనికినే గుర్తించనట్టు ప్రవర్తించడం, ఎమ్.యీ.వోగారికి సిగరెట్టుపెట్టె కొనాలన్న మిషతో తననుంచి అయిదురూపాయలు రాబట్టుకోవడం గుర్తొచ్చింది. లంచగొండితనం ప్రాథమిక స్వరూపం అతనికి అక్కడే దర్శనమిచ్చింది.

ఆ తర్వాత తను గదిలోకి వెళ్లడం-

అచ్యుతరావుగారి హేళనాపూర్వకమయిన మాటలధోరణీ-

ఆ తర్వాత నాగరాజు రాకతో అక్కడ మారిపోయిన వాతావరణం-

అన్నీ వరసగా అతని కళ్లముందు మళ్లీ కదలాడేయి. మనసంతా చికాగ్గా, వేదనాభరితంగా తయారయింది.

చదువుకునే రోజుల్లో తనేమిటో, తన చదువేమిటో అంతే! బి.ఎస్సీ పూర్తి చేశాక బి.యీ.డీ ఆ తర్వాత ఎమ్.యీ.డీ చేశాడు.

అప్పుడు కూడా అంతే! చదువే తనలోకం. లోకంలో ఇంత కర్కశత్వం, ఇంత జుగుప్స




ఇంత అరాచకత్వం ఉంటుందన్న సంగతి తనకి తట్టనేలేదు. దౌర్జన్యాలూ, దుర్మార్గాల గురించి తెలియదని కాదు.

కాని బాధ్యతగల అధికారులూ, పవిత్రమయిన ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నవాళ్లూ కూడా అలా వుంటారనీ, అలా ప్రవర్తించగలరనీ మాత్రం అతను ఊహించలేదు.

ముక్కుపచ్చలారని పిల్లలకి విద్యాబుద్ధులు నేర్పుతూ- వాళ్ళకీ సమాజానికీ కూడా ఎంతో ఆదర్శప్రాయంగా ఉంటారనీ- ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశింపబోవడం అదృష్టవశాత్తూ లభించిన వరం అనీ, ఇలా ఎన్నెన్నో కలలు కన్నాడు. ఎంతో ఊహించుకున్నాడు.

పాపం పుణ్యం ప్రపంచమార్గం...

కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలూ...

ఏమీ ఎరుగని ఆ పసిపిల్లలమధ్య గడపగలిగే భాగ్యం లభించినందుకు పొంగిపోయాడు.

అందుకే, ఎక్కడో మారుమూల కొండల మీద టీచరు పోస్టు లభించినా అతనంతగా బాధపడలేదు. తన ఆదర్శాలని అమలుచేసే సదవకాశం లభించినందుకు ఉప్పొంగిపోయాడు.

చదువూ ట్రయనింగూ పూర్తయ్యేక ఈ రెండేళ్ళూ ఖాళీగానే ఉన్నాడు. ఈ తీరిక సమయాన్ని పుస్తకాలు చదవడం కోసం వినియోగించేడు. లెక్కలేనన్ని పుస్తకాలు పూనకం పట్టినవాడిలా చదివేశాడు. అన్నీ- జీవితకోణాలని చూపించేవీ, సమాజాన్నీ, దాని స్వరూపాన్నీ విశ్లేషించి ప్రదర్శించే మంచి పుస్తకాలే...

ఈ సాహిత్యావలోకనం అతనిలో కొత్త ద్వారాలు తెరుచుకునేలా చేసింది. అతని ఆదర్శ ప్రపంచానికి సరికొత్త మెరుగులు దిద్దింది. ఒక నూతన చైతన్యాంశతో తను పునరుద్భవించిన అనుభూతి కలిగింది.

ఇంతలో సెకెండరీ గ్రేడు పోస్టుల కోసం అప్లై చేసుకోమని నోటిఫికేషను పడటం-

ఎంప్లాయ్‌మెంటు ఆఫీసునుంచి లెటరు రావడం-

రిటెన్ టెస్టులో ఉత్తీర్ణుడై ఇంటర్వ్యూకి పిలుపు రావడం-

వరసగా గబగబా జరిగిపోయాయి.

వ్రాతపరీక్షలో పాసవుతానన్న ధీమా ఉన్నప్పటికీ ఇంటర్వ్యూ అనేసరికి ఏదో తెలీని భయం ఆవరించినమాట నిజం.

డబ్బు ప్రమేయం, రాజకీయ జోక్యంతో సాధారణంగా ముడిపడి వుండే ఇలాంటి ఇంటర్వ్యూల్లో తనలాంటి అతిసామాన్యుడు నెగ్గుకుని రాగలడా?

తనకి ఉద్యోగం వస్తుందా!

ఎవరిని కలవాలో తెలీదు.

ఏం ప్రయత్నాలు చెయ్యాలో అంతకన్నా తెలీదు. నిజానికి ఏ ప్రయత్నాలు చెయ్యడానికీ మనసు అంగీకరించనూలేదు.

అలాంటి పరిస్థితుల్లో వరదహస్తంలా ఆదుకున్న అద్భుతమూర్తి అరుణ్‌పాండ్యా! ఆమె ఈ జిల్లాకి జాయంటు కలెక్టరుగా పదవీబాధ్యతలు తీసుకున్నాక జిల్లాలో పెద్ద ఎత్తున మార్పులు చకచకా జరిగిపోయాయి. ఆమె ముందుగా ఖాళీ ఉద్యోగాల భర్తీ విషయంలో తీసుకున్న చర్యలు ఆ జిల్లాకేకాక దేశానికే ఆదర్శప్రాయం కాతగినవి.

వ్రాతపరీక్షలో ఎలాంటి అవకతవకలకూ అవకాశం లేకుండా పూర్తిగా మెరిట్‌కే పెద్దపీట వేశారు.

వాటి ఫలితాలు వెలువడడంలో అనవసర జాప్యాన్ని నివారించేరు.

ఆ తర్వాత ఇంటర్వ్యూలు పకడ్బందీగా నిర్వహించేరు.

ఇంటర్వ్యూలకు కాల్‌లెటర్లు పంపించేక ఇంటర్వ్యూ బోర్డులో ఎవరెవరు ఉంటారో తుది క్షణం వరకూ ఎవరికీ తెలీకుండా కట్టుదిట్టం చేశారు. ఇంటర్వ్యూలు చేయాల్సిన ఇతర జిల్లా అధికారులకి కూడా ఏ సంగతీ అంతుచిక్కలేదు. తాము ఇంటర్వ్యూ బోర్డులో ఉంటామో లేదో కూడా తెలీని అయోమయంలో పడిపోయారందరూ.

ఇలా చెయ్యడంవల్ల పైరవీలకు ఆస్కారం లేకుండాపోయింది. మధ్యవర్తులు జోక్యం చేసుకుని ఇంటర్వ్యూలు వచ్చిన అభ్యర్థులను గేలంవేసి పట్టుకుని ప్రలోభాలు చూపించి

డబ్బు గుంజుకునే అవకాశం లేకుండాపో యింది.

తుదిక్షణంలో సంబంధిత శాఖలకు చెందిన అధికారులను కారు పంపించి రప్పించడం. ఇంటర్వ్యూలు నిర్వహించడం జరిగింది.

ఎస్టాబ్లిష్మెంటుకి చెందిన ఇతర చిన్న ఉద్యోగులనూ, గుమస్తాలనూ కూడా అక్కడికే రప్పించి ఇంటర్వ్యూలు పూర్తయిన వెంటనే మెరిట్ ప్రకారం సెలక్షన్లు పూర్తయేలా చూశారు.

రిజర్వేషను కోటాలు అమలు చేస్తూనే అర్హులైన వారికి ఎలాంటి అన్యాయం జరగకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నారు.

సెలక్షన్లు పూర్తయ్యేక ఎంత రాత్రయినా అపాయంటుమెంటు ఆర్డర్లు తయారయ్యేదాకా ఆమె విడిచిపెట్టలేదు.

ఆవిడ పర్యవేక్షణలో అన్నిపనులూ త్వరత్వరగా పూర్తయి ఆ మర్నాడు ఉదయానికల్లా ఆర్డర్లు టపాకి అందిపోయాయి.

ఈ పరిస్థితి అక్కడివారికి పూర్తిగా కొత్త!

సద్యో ఫలితమేదో నిష్కారణంగా చేజారిపో తున్నట్టుగా అందరూ విలవిలలాడిపోయారు.

కాని, ఎవరూ చేయగలిగిందేమీలేదు. ఉన్నతాధికారంతోపాటు నిజాయితీకి వున్న బలం అది.

తాత్కాలికమే కావచ్చు, కానీ దానిముందు ఏ శక్తులయినా తలవంచక తప్పదు.

ఈ టీచరు పోస్టుల వ్యవహారంలో ఎంతో కొంత లాభపడవచ్చని ఆశపడ్డవారందరికీ ఆవిధంగా తీవ్ర ఆశాభంగమయింది. ఇందాకటి ఎమ్.యి.వో.గారి కోపానికి గల కారణాలలో ఇదొకటి.

అయితే అలా వచ్చిన ఉద్యోగపు ఉత్తర్వు అందుకుని విద్యాసాగర్‌తోపాటు అతని ఇంటిలోని వారందరూ సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయిపోయారు.

ఆ ఆనందంతో తను పనిచెయ్యాల్సిన గ్రామం గురించి భోగట్టా చెయ్యడానికి వెళ్లిన విద్యాసాగర్‌కి అనుకోనివిధంగా చేదు అనుభవం ఎదురయింది. అతనిలోని ఉత్సాహం పాలపొంగులా చల్లారిపోయింది.

ఆ చేదుఅనుభవం తాలూకు నీలినీడలు అతన్ని వెంటాడుతూ ఈ రాత్రి అతనికి నిద్రపట్టకుండా చేస్తున్నాయి. అశాంతిగా అటూ ఇటూ దొర్లుతున్నాడు. మస్తిష్కం ఆలోచనలతో వేడెక్కిపోతోంది.

అతనిని ముఖ్యంగా రెండు ప్రశ్నలు వేధిస్తున్నాయి.

''విద్యా!'' అని ఆత్మీయంగా సంబోధించి, తను వాంతి చేసుకున్న క్షణంలో పొదివి పట్టుకుని, తన కోసం ఆరాటం చెందిన వ్యక్తి... జానకేశ్వరరావు... మంచి ఉన్నతభావాలు కల వాడే అని బోధపడుతూనే ఉంది. మరి అలాంటివాడు తనకి తొలి పరిచయంలో అలాంటి సంస్కారహీనులయిన వ్యక్తుల సమూహం మధ్య ఎందుకు కనిపించేడు.

మనసు విప్పి మాట్లాడే అతను- తను పులిపుట్టు గ్రామం గురించి అడుగుతున్నప్పుడు సమాధానం చెప్పకుండా ఎందుకు దాటవేశాడు?

ఎంత ఆలోచించినా అర్థం కాలేదు విద్యాసాగర్‌కి. జానకేశ్వరరావుని తప్పుగా ఊహించుకోడానికి అతని మనసు అంగీకరించడంలేదు.

తమలో ఎన్ని వైరుధ్యాలయినా వుండొచ్చు- అభిప్రాయాలలో, ఆలోచనలలో ఎన్ని వ్యత్యాసాలయినా వుండొచ్చు- అవేవీ ఇప్పుడిప్పుడే రేకులు తొడుగుతున్న తమ మైత్రీ బంధానికి అడ్డురాకూడదు.

ఆరాత్రి ఎప్పటికోగాని నిద్రపట్టలేదతనికి.

★ ★ ★

చెప్పినట్టుగానే ఆ మర్నాడు ఉదయం పది గంటల ప్రాంతంలో విద్యాసాగర్ ఇల్లు వెతుక్కుంటూ వచ్చేడు జానకేశ్వరరావు.

నిద్రలేమిచేత రాత్రంతా చికాకుపడి ఏ తెల్లవారుజామునో కాస్త కునుకుతీసిన విద్యాసాగర్ అట్టే పొద్దెక్కకుండా పెందళాడే నిద్రలేచాడు. గబగబ స్నానం అదీ ముగించి బట్టలు వేసుకుని అతని రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. తండ్రి కచేరీకీ, చెల్లీ తమ్ముడూ స్కూళ్లకీ వెళ్లిపోయారు. వంటింట్లో తల్లి ఏదో పనిచేసుకుంటోంది.




వీధిగుమ్మంలో అతను కనిపించగానే నవ్వు తూ ఎదురువెళ్ళి పలకరించి లోపలికి తీసుకొచ్చేడు.

"సరిగ్గా చెప్పిన టైంకే వచ్చారే! అన్నట్టు ఇవాళ స్కూలు కెళ్ళలేదా? సెలవుగానీ పెట్టారేమిటి?"

జానకేశ్వరరావు సమాధానం చెప్పకుండా అతను చూపించిన కుర్చీలో కూర్చున్నాడు, విద్యాసాగర్ అడిగిన ప్రశ్నకు జవాబుగా అన్నట్టు చిరునవ్వు నవ్వాడు.

"ఎవరూ?" అంటూ లోపలికి వచ్చిన తల్లికి జానకేశ్వరరావుని పరిచయం చేశాడు విద్యాసాగర్.

"నమస్కారమండీ" వినయంగా లేచి నించుని ఆమెకు నమస్కారం చేసి "నేను కూడా ఈ మండలంలోనే మేష్టారుగా ఉద్యోగం చేస్తున్నాను. మీ అబ్బాయిలాగే సెకెండరీ గ్రేడు టీచరుగా పనిచేస్తున్నాను" అన్నాడు.

"మంచిది నాయనా" అందామె.

సాధారణంగా ఎవరితోనూ అంతగా పరిచయాలు పెంచుకోని కొడుకు కొత్త వ్యక్తిని పరిచయం చేసుకోవడం ఆమెకు సంతోషం కలిగించింది.

"మా వాడికి కూడా నిన్ననే ఆర్డరొచ్చింది బాబూ... మేం ఈ ఊరొచ్చి రెండునెలలే అవుతోంది. వీళ్ళ నాన్నగారికి ఇక్కడికి బదిలీ అయితే వచ్చేం. అదృష్టవశాత్తూ వీడికి కూడా ఈ ప్రాంతంలోనే ఉద్యోగం దొరికింది. మీరు మాట్లాడుతూ వుండండి, కాఫీ తెస్తాను..." అని ఆమె లోపలికెళ్ళారు.

ఇద్దరూ కబుర్లలో పడ్డారు. ఏ ప్రయత్నమూ అవసరం లేకుండానే తనకు ఉద్యోగం ఎలా వచ్చిందీ ఆ సంగతంతా ఉత్సాహంగా వివరించి చెప్పాడు విద్యాసాగర్.

ఉన్నత భావాలుగల ఆఫీసర్లు, ఉద్యోగులు వుంటే- అసంతృప్తితో, అంధకారంగా కనిపించే భవిష్యత్తులోకి అవలోకిస్తూ, భయాందోళనలకీ, నిస్పృహలకీ గురవుతూ అశాంతితో వేగిపోయే యువతరానికి ఎంత ఊరట కలుగుతుందో ఆవేశంగా చర్చించేడు.

తర్వాత కాస్సేపు రాజకీయాలు చర్చించుకున్నారు.

ఈలోగా పార్వతమ్మగారు కాఫీలు తీసుకొచ్చేరు. అవి తాగేక "సారీ... నిన్న మిమ్మల్ని అడగడమే మరిచిపోయాను. ఆ చికాకులో అడగాలన్న గుర్తేరాలేదు. ఇంతకీ మీరెక్కడ పనిచేస్తున్నారో చెప్పండి" అడిగేడు విద్యాసాగర్.

"మిమ్మల్ని అపాయింట్ చేశారు చూడండి, పులిపుట్టు... అక్కడికి కొద్ది కిలోమీటర్లు ముందే వుంటుందా వూరు. పేరు కొండంగి... మీలాగే సింగిల్ టీచర్ని"

విద్యాసాగర్ ముఖం వికసించింది "వెరీ గుడ్! ఇద్దరం పనిచేసేది దగ్గర దగ్గరేనన్నమాట. మీ ఊరివరకూ ఇద్దరం కలిసే కబుర్లు చెప్పుకుంటూ వెళ్ళొచ్చుననుకుంటాను. అయాం రియల్లీ వెరీ హేపీ!... నేను అడిగేవరకూ ఈ సంగతి చెప్పేరుకాదేం...? సస్పెన్సులో పెట్టి నన్ను థ్రిల్ చేద్దామనేకదూ!" సంతోషంతో విద్యాసాగర్ ముఖం వెలిగిపోతోంది.

తర్వాత ఏదో గుర్తొచ్చినట్టు అడిగేడు. "సెలవుమీద ఇంటికొచ్చేరా? ఎన్నిరోజులు సెలవు పెట్టేరు. రేపు సప్తమి.. మంచిరోజు. రేపు వెళ్ళి జాయినవుదామనుకుంటున్నాను. తోడుగా మీరు నాతో రేపు రాగలరుకదూ!" అని ఆగి మళ్ళీ అన్నాడు.

"రేపు జాయినవుదామనుకుంటున్నాను. రేపు మంచిరోజని నాన్నగారు చెప్పేరు. చంద్రబలం తారాబలం కూడా బాగున్నాయట. ఎంతయినా జీవితంలో మొదటిసారి ఉద్యోగంలో ప్రవేశించడంకదా! మా అమ్మకి మరీ పట్టింపు ఇలాంటివంటే" అని నవ్వేడు.

కాస్సేపాగి మళ్ళీ అన్నాడు "నా కంతా కొత్త... కొత్తచోటు, కొత్త ఉద్యోగం. వారం పదిరోజులదాకా ఏ ఆదివారమో, సెలవురోజో వస్తే కానీ ఇంటికి రావడం కుదరదుగదా. వంటసామానూ, దినుసులూ అవీ ఏమేం పట్టుకువెళ్ళాలో తెలీదు. స్వయంపాకం చేసుకోవడమే తప్ప అక్కడ భోజనం దొరికే సదుపాయం వుండదేమో! మా అమ్మ నిన్నటినుంచి ఊరికే హడావిడి పడిపోతూ ఏవేవో సామాన్లు పెట్టెనిండా సర్దేస్తోంది. ఆవకాయలూ, పొడులూ...

కొండప్రాంతం చలెక్కువగా ఉంటుందని రగ్గులూ అవీ...''

హఠాత్తుగా కళ్లు పెద్దవి చేసుకుంటూ అడిగేడు జానకేశ్వరరావు ''పులిపుట్టు వెళ్తారా!'' అని.

''అదేం! రోజూ ఇక్కడినుండి అపరేట్ చెయ్యడానికి కుదరదుకదా! అదీకాక పనిచేస్తున్న హెడ్‌క్వార్టర్సులోనే కంపల్సరీగా ఉండాలని ఏదో జీ.వో. కూడా వుందని ఎప్పుడో నాన్నగారంటే విన్నాను...''

అతని మాటలు వింటూనే పకపకా నవ్వేసాగాడు జానకేశ్వరరావు. అతనలా ఎంతసేపు నవ్వేడంటే- తెరలు తెరలుగా వచ్చి పడుతున్న నవ్వుని ఆపుకోడానికి కష్టమై అతని కళ్లంట నీళ్లు తిరిగాయి.

అతనలా నవ్వడం విద్యాసాగర్‌కి- ముందు చెప్పలేనంత ఆశ్చర్యాన్నీ, తర్వాత ఆపుకోలేనంత కోపాన్నీ కలిగించింది.

''నవ్వుతారేం?'' అడిగేడు కోపం దాచుకోడానికి ప్రయత్నం చేస్తూ.

''మరి... పులిపుట్టు వెళ్తానంటూఉంటే...''

''అందులో నవ్వడానికేముంది? ఈ ఉద్యోగం వదులుకోమంటారా? జాయన్ కావొద్దంటారా?''

''ఎందుకొద్దంటాను... నిక్షేపంగా జాయనవ్వండి. కాళ్లముందుకు వచ్చిన ఉద్యోగాన్ని వదులుకోమంటానా చెప్పండి విద్యా! అదీకాక పులిపుట్టులో ఉద్యోగమంటే జాక్‌పాట్ కొట్టేసినట్టే. బి.సి.ఎ, సి.సి.ఎ, హెచ్.ఆర్.ఎ- అంటే తెలుసుగా! బేడ్ క్లైమేట్ అలవెన్సూ, కాంపన్సేటరీ అలవెన్సు, హౌస్‌రెంట్ అలవెన్సూ అన్నీ కలసి, మామూలుగా ప్లెయిన్ ఏరియాలో కొత్తగా సెకెండరీ గ్రేడు టీచరుగా జాయనయ్యే మాష్టారుకన్నా అదనంగా అధమపక్షం నాలుగయిదు వందలవరకూ వస్తుంది''

''మరి...'' విద్యాసాగర్ కనుబొమలు ముడిపడ్డాయి.

''అంచేత, ఈ ఉద్యోగంలో చేరొద్దని నేనేకాదు, మెడమీద తలవున్న వాడెవడూ కూడా చెప్పడు. రేపు మంచిరోజని అంటున్నారుకదా! రేపు ఉదయం మళ్లీ వస్తాను. ఓ జాయనింగ్ రిపోర్టు రాసివుంచండి. నేసికెళ్లి ఎమ్.యీ.వో.ని కలిసి ఇచ్చేస్తే సరిపోతుంది. ఉద్యోగంలో ప్రవేశించినట్టే...

ఈ మనిషిలో ఏదో తిరకాసు వుంది. కనిపించని మెలికలేవో వున్నాయి.

మనిషి మంచివాడే కావొచ్చును. కాని తను కోరుకునే మంచి ఇది కాదు.

బీదవాడని జాలిపడి తీసుకునే లంచంలో ఎంతో కొంత శాతం తగ్గించుకొనే మంచి కాదు తను కోరుకునేది.

తప్పని తెలిసీ పదిమందికోసం తలదించుకునే మంచికాదు తను ఆశించేది-

వెన్నెలంత స్వచ్ఛమయినదీ, మంచుబిందువులు పడి మెరిసే గడ్డి పువ్వంత నిర్మలమయినదీ, పవిత్ర పూజాద్రవ్యాలలాగా పరిమళించేదీ- అలాంటి మంచి తనకి కావాలి.

జానకేశ్వరరావుతో ఈ సంగతేదో అమీతుమీ తేల్చుకోవాలి.

''మీ మనసులో ఏంవుందో సూటిగా చెప్పండి-'' అనేశాడు చివరికి.

కుర్చీలో కొంచెం ముందుకు వంగి చెప్పేడు జానకేశ్వరరావు.

''అయాం సారీ... మిమ్మల్ని హర్ట్ చేసినట్టున్నాను- సూటిగా చెప్పాలంటే... ఇదివరకు నేను ఇక్కడే దగ్గర్లో వున్న వూళ్లో పనిచేస్తూ వుండేవాడిని. కొండంగి ట్రాన్స్‌ఫరయి ఏడాదిన్నరయింది- నిజం చెప్పాలంటే ఆ ఊరికి నేను కావాలని బదిలీ చేయించుకున్నాను. మీరు నమ్ముతారో లేదో... ఆ బదిలీకోసం నేను రెండువేలకు పైగా ఖర్చుపెట్టేను కూడా...''

''ఏజెన్సీ అలవెన్సు లేవో అదనంగా వొస్తాయని చెప్పేరుకదా... అందుకోసం కాబోలు...'' దాచుకుందామన్నా వెటకారం దాగలేదు విద్యాసాగర్ గొంతులో.

అతను నవ్వి... ''అది నిజమే! కాదనడం లేదు... కాని, మరో కారణం కూడా వుంది'' అన్నాడు.

''ఏమిటో అది''

''ఈ ఏడాదిన్నర కాలంలోనూ నేను ఒక్క

సారి కూడా ఆ ఊరు వెళ్లలేదంటే మీరు నమ్మకపోవచ్చు...''

ఆ మాటలు విని విద్యాసాగర్ దిగ్భ్రాంతి చెందేడు. నమ్మశక్యంగా లేవతనిమాటలు.

''లాంగ్‌లీవ్ పెట్టేననో, మరేదోనని అనుకోకండి- నెలనెలా జీతం అందుకుంటూనే వున్నాను''

అవినీతి నరకద్వారాలేవో తెరుచుకుంటున్నట్టు విద్యాసాగర్‌లో తెలీని భయం, గగుర్పాటు సన్నగా బయలుదేరింది. గొంతు తడారిపోతోంది. మాటలే మరిచిపోయినవాడిలా గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయేడతనివేపు.

గొంతు సవరించి చెప్పుకుపోసాగాడు జానకేశ్వరరావు... ''మీకు తెలుసో లేదో ఎలిమెంటరీ స్కూళ్లు పూర్తిగా ప్రభుత్వ ఆధీనంలో కొన్ని సమితి ఆధ్వర్యంలో కొన్ని ఉంటాయి. కొన్నిచోట్ల మేనేజిమెంటు స్కూళ్లు కూడా ఉన్నాయి. ఇన్స్పెక్టింగ్ అథారిటీ ఎమ్.యి.వో.ది. మండల విద్యాశాఖాధికారిది. మనకి సంబంధించినంత వరకూ ఇంక్రిమెంట్లూ, బదిలీలూ, తక్కిన ఆఫీసునోట్లూ ఎమ్.యి.వో చూడందే కుదరదు. ఆ తర్వాత ఎమ్.డీ.వోగారు. మన జీతాల బిల్లులు పాస్‌చేసి, చెక్కులమీద సంతకాలు చేసే అధికారి అతను. మా కొండంగి స్కూలూ, మీ పులిపుట్టు స్కూలూ గవర్నమెంటు ఎలిమెంటరీ పాఠశాలలు. మన పైఅధికారి జిల్లా విద్యాశాఖాధికారిగారు. ఏమయినా, మనమీద పర్యవేక్షణాధికారం ఎమ్.యి.వోగారికి వుంది. కనుక మన పనంతా అతనితోనే...''

''ఇదంతా ఎందుకు చెప్తున్నారో తెలుసుకోవచ్చా?''

''ఎందుకంటే, మన ఎమ్.యి.వో అచ్యుతారావుగారి సంగతి ఈపాటికి అర్థమయ్యే వుంటుంది. డబ్బుకీ, మందుకీ బానిస.. మన సంగతి అతను పట్టించుకోకుండా వుండడానికి అతనికి ముట్టచెప్పాల్సింది ముట్టచెప్తూ ఉండాలి. అప్పుడప్పుడు నిన్న నాగరాజు మేష్టారులాగా ఫారిన్ లిక్కరు కాకపోయినా దేశవాళీ సరుకయినా పోయిస్తూవుండాలి''

''అసలిదంతా ఎందుకు చెయ్యాలి?''





కోపం తన్నుకొస్తోంది విద్యాసాగర్‌కి. లేచి నిలబడ్డాడు.

''చెయ్యక తప్పదు. మనం పనిచేసే వూళ్లకి వెళ్లక్కరలేకుండా ఎగనామం పెట్టాలంటే తప్పదుమరి''

కస్సున లేచాడు విద్యాసాగర్. ''షిట్... మీర న్యాయంగా మాట్లాడుతున్నారు. అసలు స్కూళ్లకి వెళ్లకుండా ఎందుకు మానెయ్యాలో చెప్పండి'' అన్నాడు ఆవేశంగా.

అతని కేకలు వినిపించి ఆదుర్దాగా ముందుగదిలో కొచ్చింది పార్వతమ్మ. కొడుకూ అతనూ మాట్లాడుకునేదేమిటో ఆమెకి అర్థం కాలేదు. అలా చూస్తూవుండిపోయింది.

''చెప్తాను. మీరు ముందు ఆవేశం తగ్గించుకోవాలి. కొండంగి కానీ పులిపుట్టు కానీ దగ్గర్లో ఉన్నాయనుకుంటున్నారేమో ఈ ఏజెన్సీలో మన స్కూళ్లున్న గ్రామాలు కొండలమీద వున్నాయి. గంటలకొద్దీ నడిస్తే కానీ అక్కడకి చేరుకోలేం. తీరా వెళ్లినా అక్కడంతా అడవీ అధ్వాన్నం- అదీకాక మన ఏజెన్సీ అడవుల్లోకి అన్నలు ప్రవేశించారని అంటున్నారు. అదొక భయం. ఆ వాతావరణంలో ఒకగంట గడిపినా చాలు మనం మంచాన పడకతప్పదు. డీప్ ఫారెస్టులో కొండలమీద ఉండే స్కూళ్లస్థితి దాదాపు అంతటా ఇలాగే వుంది. ప్రభుత్వం మంచి చర్యలే తీసుకుంటోంది. చాలావరకు రోడ్లు వేయిస్తోంది. సౌకర్యాలు కల్పిస్తోంది. కాని ఏవీ చాలటంలేదు. పులిపుట్టులాంటి రిమోట్ ప్లేసెస్ ఇంకా చాలా ఉన్నాయి. అక్కడొక స్కూలు ఉన్న సంగతి రికార్డులవరకే పరిమితం... ఇంతవరకూ ఏ టీచరూ వెళ్లిన దాఖలాలేదు. ఇదిక్కడ విద్యాశాఖలో బహిరంగ రహస్యమే. అందుకు అచ్యుతరావు లాంటివాళ్ల జేబులు నిండుతున్నాయి. టీచర్లు వ్యాపారాలు చేసుకోవడమో, టౌన్లో ట్యూషన్లు చెప్పుకోవడమో చేస్తుంటారు. అదనంగా వచ్చే అలవెన్సుల్లో ఎంతో కొంత డబ్బు పోయినా పరవాలేదు. ఇతర వ్యాపకాలు చూసుకోడానికి వాళ్లకి కావలసినంత టైముంటుంది''

''ఇది వంచన, దగా!'' ఆవేశం పట్టలేక అరిచేడు విద్యాసాగర్.

''విద్యా ఏమిటి... ఏమిట్రా ఇదీ?'' గాభరాగా కొడుకు దగ్గరకొచ్చి నిలబడింది పార్వత

మ్మ. కొడుకు కళ్లు చెమ్మగిల్లడం ఆమెని కలవరపరిచింది.

విద్యాసాగర్ ఆవేశపు తీవ్రతని అర్థం చేసుకోకపోలేదు జానకేశ్వరరావు.

ఒక క్షణం ఆలోచిస్తూ వుండిపోయి, నచ్చచెప్తున్నట్టుగా చెప్పేడు. ''ఒకరకంగా మోసమే- కాని, తెలిసీ మన ఆరోగ్యాలు చెడగొట్టుకోలేంకదా? ఒకవేళ పైఅధికారుల్లో స్ట్రిక్ట్ ఆఫీసర్లెవరయినా పంతంపట్టి ఆ కొండలమీదకి విజిట్ చేయడానికొచ్చేరంటే తప్పించుకోడానికి చాలా మార్గాలున్నాయి. అవన్నీ ఏకోపాధ్యాయ పాఠశాలలు కనుక మన సెలవు దరఖాస్తులు మండల ఆఫీసులుకి పంపుకోవాలి. ఆ అధికారి విజిట్ చేసిన రోజున సెలవులో ఉన్నట్టు- కాకపోతే కొద్దిరోజులుగా మెడికల్‌లీవులో ఉన్నట్టు ఎమ్.యీ.వో. రిపోర్టు రాసేస్తారు. శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలనీ...''

''అది మీలాంటివాళ్ల ఆత్మ వంచన'' అన్నాడు సాగర్

జానకేశ్వరరావు బాధగా నిట్టూర్చేడు.

మరింక నిల్చోడానికి శక్తి లేనట్టుగా మళ్లీ కుర్చీలో కూలబడ్డాడు విద్యాసాగర్. ముంజేతులు మోకాళ్లమీద పెట్టుకుని ముఖంలో చేతులు దాచుకున్నాడు.

''విద్యా! క్షమించండి... నేను చెప్పేది అర్థం చేసుకోండి. అక్కడికెళ్లడం చాలా కష్టం. అక్కడ ఉండడానికి వసతీ దొరకదు, తినడానికి తిండీ దొరకదు. ఆ కొండలెక్కడం అంటే మాటలు కాదు- ఓర్పూ ఒడుపు కావాలి. బస్సు సౌకర్యం వెదుళ్లవలసవరకూ వుంది. అక్కడి నుండి ఒకటే నడక. ఒక పూటంతా ఆ అడవి దారివెంట వాగులూ వంకలూ దాటుకుంటూ కొండలూ మిట్టలూ ఎగబ్రాకుతూ వెళ్లడం జరిగేపని కాదు. మీకు తెలుసా! ఆ స్కూళ్లు తనిఖీ చెయ్యాల్సిన అధికారులెవరికీ కూడా ఆ ఊళ్లెక్కడున్నాయో తెలీదు- ఏ ఒక్కరూ కనీసం ఒకసారి కూడా వెళ్లివుండరు. విజిట్లూ, ఇన్‌స్పెక్షన్లూ జరిపించినట్టు ఇక్కడే ఏ లాడ్జిగదిలోనో కూర్చుని రిపోర్టులు రాసుకుంటూ ఉంటారు.

మీ ఆవేశం నేనర్థం చేసుకోగలను. ఏదో సాధించాలన్న మీ తపన నాకు తెలుసు. కాని, నా మాట వినండి. రేపు జాయనింగ్ రిపోర్టు రాసివ్వండి. ఇక్కడే ఆఫీసులో అందచేద్దాం. ఎమ్.యీ.వోగార్ని కలిసి తతిమ్మా వ్యవహారాలన్నీ నేను చూసుకుంటాను...'' అన్నాడు.

''ఎమ్.యీ.వోగారు నిన్న లాడ్జిలో మీతో నన్ను గైడ్ చెయ్యమని చెప్పింది ఇదేననుకుంటాను'' విద్యాసాగర్ నిష్ఠూరంగా అన్నాడు.

''అదికాదు. నేను చెప్పేది వినండి. ఒక నాగరాజు మేష్టారులాగానో, మరొకరిలాగానో నేను అచ్యుతరావుగారికి బ్రోకరు పనిచెయ్యడం లేదు. కష్టం సుఖం అందులో ఇబ్బందులు అవీ బాగా తెలిసినవాణ్ణి కనుక మీకింతగా చెప్తున్నాను. రేపు జాయనింగ్ రిపోర్టు ఇచ్చేశాక మొదటి తేదీన మీ జీతం ఈ ఊర్లోనే బేంక్ దగ్గర తీసుకునే ఏర్పాటు నేను చేయిస్తాను. ఓ రెండొందలు మీవి కావనుకుంటే చాలు. ఇందులో రిస్కేమీ లేదు. ఫస్టు తేదీన కావాలంటే బ్యాంక్ దగ్గరకొస్తే- హిల్ ఏరియా స్కూళ్లలో పనిచేసే మేష్టార్లు స్కూళ్లకి వెళ్లకుండా ఎంతమంది ఇలా చేస్తున్నారో మీరే చూద్దురుగాని''

ఆ ప్రసంగం కొనసాగించడం మరింక ఇష్టం లేకపోయింది విద్యాసాగర్‌కి.

ఆ సంభాషణ అంతటితో తుంచేస్తూ- మెల్లగా, అయినా దృఢంగానే చెప్పేడు. ''నేను రేపు బయలుదేరి పులిపుట్టు వెళ్తున్నాను, స్కూల్లో జాయనయ్యేందుకు''

★ ★ ★

మర్నాడు ఉదయం లేచిన దగ్గరనుంచీ ప్రయాణానికి సిద్ధం కాసాగేడు విద్యాసాగర్.

తొందరగా స్నానాదికాలు ముగించి అభిషేకం చేయించడానికి శివాలయానికి వెళ్లాడు.

ఆలయంలో పూజలు ముగించుకుని వచ్చే ముందు మరోసారి తన ఇష్టదైవమయిన శివుణ్ణి ఇలా ప్రార్థించేడు.

''ఎన్నో ప్రశ్నార్థకాలతోనూ, మరెన్నో సందేహాలతోనూ నా ప్రయాణాన్ని ఆరంభిస్తున్నాను తండ్రీ! ఈ మార్గంలో ఎన్నో సవాళ్లను ఎదుర్కొనే పరిస్థితి కనిపిస్తోంది. నాకా శక్తినివ్వు. ఏ ఆదర్శాలు నిలువుకోవాలని కోరికోరి ఈ ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించదలిచేనో ఆ ఆదర్శా

లు నిలుపుకునే బలాన్నివ్వు'' అని.

తర్వాత ఇంటికొచ్చి కోవెలలో ఇచ్చిన పువ్వు లు, ప్రసాదం తల్లి చేతిలో పెట్టాడు.

కొడుకు ప్రయాణానికి సిద్ధపడుతూవుంటే- అతడికి ఉద్యోగం వచ్చిందన్న వార్త విన్నప్పటి ఆనందంలో సగం కూడా ఇప్పుడు మిగల్లేదు ఆమెకి. తండ్రి పరిస్థితి కూడా ఇంతకంటే మెరుగ్గా ఏమీలేదు. నిన్నరాత్రి తను ఇంటికొ చ్చేక భార్య చెప్పిన సంగతులు జీర్ణించుకోలేక ఆయన ఆందోళన చెందుతున్నారు.

కొడుక్కీ, జానకేశ్వరరావుకీ మధ్య జరిగిన సంభాషణలో ఆమెకి అవగతమయిన విషయం ఒక్కటే, పులిపుట్టు వెళ్లడం, అక్కడ ఉండడం చాలా కష్టమని.

విద్యాసాగర్ బట్టలు సర్దుకుంటూ ఉంటే అతని తండ్రి పక్కన నిల్చుని కొడుక్కి ఎలా చెప్పాలా అని సందేహిస్తూ ఉండిపోయేరు. కాసేపు అలా తటపటాయించి మెల్లిగా అన్నా రు, ''ఉద్యోగంలో చేరేందుకు మరో రోజు బయ లుదేర కూడదూ?'' అని.

విద్యాసాగర్ తలెత్తి తండ్రి ముఖంలోకి చూసేడు. తండ్రి తనతో చెప్పదలుచుకున్నది అది కాదని తెలిసిపోతూనే వుంది.

''ఇవాళ మంచి రోజని మీరే చెప్పేరు కదా నాన్నా''

''నిజమే అనుకో... కాస్త ముందూ వెనుకా మరోసారి భోగట్టా చేసి వెళ్తే బాగుంటుందేమో నని...'' నసిగేరు, సరైన మాటలు దొరక్క.

విద్యాసాగర్ తండ్రివేపు జాలిగా చూసేడు. తండ్రి వెనక అక్కడ ద్వారానికి చేరబడి తనవేపుదీనంగా చూస్తున్న తల్లి చూపులు అతన్ని కదిలించి వేశాయి. వాళ్ల ఆరాటం తను అర్థం చేసుకోగలడు. చూస్తూ చూస్తూ వచ్చిన ఉద్యోగాన్ని చేతులారా వదులుకోమని చెప్పనూలేరు. అలాగని ఆ కొండల మీది సుదూరపు ఊరికి తను వెళ్లవలసి రావడాన్ని తట్టుకోనూ లేకపోతున్నారు.

ఛ! ఇదంతా జానకేశ్వరరావువల్ల జరిగింది. అతని మాటలూ, అవి కల్పించిన భయాలూ విని అమ్మ బెదిరిపోయింది. నాన్న కూడా ఆ సందిగ్ధతతోనే ఊగిసలాడుతున్నారు. ముందు వీళ్ల బెంగలు, భయాలూ తీర్చాలి.

''చూడండి నాన్నా... పులిపుట్టు కొండ ప్రా తంలో ఎక్కడో మారుమూల ఉన్న ఊరే. అంత మాత్రం చేత నాకొచ్చిన భయమేమీ లేదు. ముంచుకొచ్చే ప్రమాదమూ లేదు. నిన్న ఆ జానకేశ్వరరావు వొచ్చి చెప్పిన సంగతులన్నీ అమ్మ మీతో అన్నట్టుంది. అది విని మీరు భయపడుతున్నట్టున్నారు... అవునా!

''అతను నాణేనికి ఒకవైపు మాత్రమే చూ పిస్తున్నాడనిపిస్తోంది. అదే నిజమనీ, నమ్మ మనీ చెప్తున్నాడు. తను చూపించే నాణేనికి బొరుసు తప్ప బొమ్మలేదని వాదిస్తున్నాడు. బొమ్మా బొరుసులలో ఏదో ఒకటి మాత్రమే వుండడం అసాధ్యం కదూ నాన్నా? అవినీతి మార్గాలు అవలంభించే ఉపాధ్యాయులు ఎక్కువమందే ఉండొచ్చు. వాళ్లకంటే ఎక్కువ సంఖ్యలోనే ఉండొచ్చు బాధ్యతాయుతంగా పని చేసేవాళ్లు. మంచీ చెడూ వెలుగూ నీడల్లా అంతటా ఉంటాయి. మీకు చెప్పేంత వాణ్నికా ను. ఒక గొప్ప వ్యవస్థకు వ్యక్తుల మంచితనంవ ల్ల మరింత మేలు జరుగుతుంది. వ్యక్తుల చెడ్డతనం వాళ్లనే పతనం చెందేలా చేస్తుంది తప్ప విస్తృతంగా విస్తరించిన ఆ మహావ్యవస్థ ను ఏమీ చెయ్యలేదు. టీచరవాలని చిన్నప్పటి నుంచీ కోరుకున్నాను. నా కోరిక నెరవేరే సమయం వచ్చింది. మీరింక మరేమీ దిగుళ్లు పెట్టుకోకండి నాన్నా! అమ్మా... నువ్వు కూడా!'' తండ్రివేపూ తల్లివేపూ మార్చి మార్చి చూస్తూ చెప్పాలనుకున్నది చెప్పేడు విద్యాసాగర్.

ఆ తర్వాత చెల్లెలు శాంతితోను, తమ్ముడు వెంకుబాబుతోను బాగా చదువుకోమని చెప్పే డు.

తొమ్మిదిన్నర కావస్తూండగా భోజనానికి కూచుని వేడివేడి అన్నం తిన్నాడు.

పెట్టెలో సామాన్లు అవసరమయితే ఒక మనిషి మోసుకుపోగల బరువుకి మించ కుండా వున్నాయోలేదో చూసుకున్నాడు. వెదు ళ్లవలస దగ్గర బస్సు దిగేక ఎవరయినా దొరుకుతారో లేదో తెలీదు. ఎవరూ దొరక్కపోతే పెట్టె తనే మోసుకుపోవాలి... తప్పదు.

ఇంట్లో అందరికీ మరోసారి వెళ్లొస్తానని చె ప్పి వీధి గుమ్మం దిగబోతూ వుంటే ఎదురుగా




వస్తూ కనిపించేడు జానకేశ్వరరావు.

వస్తూనే నవ్వుతూ పలకరించి "అమ్మయ్యా దొరుకుతారో దొరకరో అనుకున్నాను. ఉన్నారో, బయల్దేరి బస్సుకెళ్లిపోయేరో అనుకుంటూ తొందరగా నడచి వస్తున్నాను. అదృష్టవశాత్తూ మీరు మిస్‌కాలేదు. పదండి వెళ్దాం" అన్నాడు.

"మీరొస్తారని ఊహించనయినా లేదు. మీ చేతిలో ఆ సంచీ..." అతని చేతి సంచీని చూస్తూ సందేహిస్తూ అడిగేడు విద్యాసాగర్.

"పదండి పదండి... మీతో పాటే మీకు తోడుగా"

"నాకు తోడుగానా! ఎంతవరకూ వస్తున్నారు?" విద్యాసాగర్ ముఖంలో ఆనందాశ్చర్యాలు తాండవించేయి.

"పులివుట్టు వరకూ"



వెదుళ్లవలస దగ్గర ఆ ఇద్దరినీ దించేసి బస్సు ముందుకి సాగిపోయింది.

బస్సు దిగి ఓసారి చుట్టూ పరికించేడు విద్యాసాగర్.

అక్కడ గ్రామం ఏదీ కనిపించలేదు. టీలమ్ముకునే ఓ చిన్న పాక మాత్రం వుంది. అక్కడ బల్లల మీద కూచుని ఓ నలుగురయిదుగురు టీలు తాగుతూ కనిపించేరు. గ్లాసులు కడుగుతూ ఓ కుర్రాడూ, టీ కొట్టు యజమాని కాబోలు, మరొకతనూ మాత్రం ఉన్నారు.

అంత నిర్మానుష్యంగా వుండే చోట బస్సు దిగడం విద్యాసాగర్‌కి కొంత ఆశ్చర్యం కలిగించింది. జానకేశ్వరరావు వేపు ప్రశ్నార్థకంగా చూసేడు.

అతని సందేహం గమనించిన వాడిలాగా నవ్వి, "ఊరు ఇక్కడకి ఓ అరకిలోమీటరు దూరంవుంది. అదిగో అటువేపు చూడండి... అక్కడ పూరిళ్లూ, కొన్ని పెంకుటిళ్లు కనిపిస్తున్నాయే, అదే వెదుళ్లవలస" అంటూ చూపుడు వేలుతో రోడ్డుకి ఎడమ దిక్కుగా చూపించేడు.

విద్యాసాగర్ అటు తిరిగి చూసేడు. నిజమే వూరు కనిపిస్తోంది. అయితే తాము వెళ్లవలసింది ఆ ఊరు దాటుకునేనన్నమాట. ఆ విషయమే అడిగేడు జానకేశ్వరరావుని. అవునన్నట్టు తలూపి పదండి నడుద్దాం అని దారితీసేడతను. విద్యాసాగర్ అతన్ని అనుసరించేడు.

పావుగంటలోగానే ఇద్దరూ ఆ ఊరు సమీపించగలిగేరు.

ఊళ్లోంచి నడుస్తూ వుంటే ఎదురయిన గ్రామస్థులూ, ఆ పక్కన నీళ్ల బావి దగ్గర నీళ్లు తోడుకునే ఆడవాళ్లూ తమ వేపు కుతూహలంగా చూడడం గమనించేడు విద్యాసాగర్.

ఓ వ్యక్తి తాగుతున్న చుట్ట పీక పారేసి ఎదురొచ్చి "ఎవరు బాబూ మీరు?" అనడిగేడు.

"స్కూలు మేష్టర్లం. నాది కొండంగీ, ఇతనిది పులివుట్టూను. ఇప్పుడు పులివుట్టు వెళ్లేందుకే బయలుదేరాం" నడుస్తూనే జవాబిచ్చేడు జానకేశ్వరరావు.

"పులివుట్టు వెళ్తారా?" ఆశ్చర్యంగా అడిగేడతను.

అవునన్నట్టు తలూపి, నడకవేగం పెంచేడు జానకేశ్వరరావు. ఆ వ్యక్తి పులివుట్టు పేరు చెప్పగానే అలా ఆశ్చర్యపోవడం విద్యాసాగర్‌లో రవంత బెదురుపాటుని కలిగించింది. అయినా మాట్లాడకుండా జానకేశ్వర్ వెంట నడవసాగేడు.

ఆ ఇళ్ల మధ్యనుంచి నడుస్తూ ఓ పెంకుటింటిముందు ఆగిపోయేడు జానకేశ్వరరావు. అతనక్కడ ఎందుకు ఆగేడో తెలీకపోయినా, తనూ ఆగేడు విద్యాసాగర్.

ఆ ఊళ్లో కనిపిస్తున్న ఇళ్లన్నింటిలో ఆ పెంకుటిల్లు కాస్త బాగుందనే చెప్పాలి. గోడలకి సున్నాలు వేసివున్నాయి. తలుపులూ అవీ

కూడా కొంచెం డాబుగానే వున్నాయి. ఇంటికి కరెంటు కూడ వున్నట్టుంది.

"కామయ్యగారూ... కామయ్యగారున్నారా?" అంటూ చనువుగా ఇంటి తలుపులు తోసుకుని లోపలికెళ్లేడు జానకేశ్వరరావు.

సందిగ్ధంగా బయటే నిలబడిపోయిన విద్యాసాగర్‌ని చూసి "రండి... మీరూ రండి, ఫరవాలేదు. కామయ్యగారు మనకి బాగా తెలిసిన వ్యక్తే" అని పిలిచేడు.

గుమ్మం దాటి లోపలికి అడుగు పెడుతూనే చుట్టూ పరిశీలించేడు విద్యాసాగర్. ముందు గది విశాలంగా వుంది. ఒక సోఫా, రెండు అల్లిక కుర్చీలూ ఉన్నాయి. మీద సీలింగ్ ఫేను, ఒక మూల కర్రటేబులు మీద టీవీ సెట్టు ఉన్నాయి. కలర్ సెట్టులాగే వుంది.

మరో పక్క గాద్రెజ్ బీరువా. అక్కడి నుంచి కనిపిస్తున్న పాత కాలపు టేకు పందిరి మంచం మీద ఫోంపరుపూ, తలదిళ్లూ కనిపిస్తున్నాయి.

వీళ్ల మాటలు విని లోపలినుంచి ఒకామె వచ్చింది. నలభై యేళ్లు దాటి వుంటాయామెకి నేతగళ్లచీర కట్టుకుని వుంది. కాళ్లకి ఇంత మందాన వెండి కడియాలూ, చేతులకి బంగారు గాజులూ, ముక్కు మీద మెరుస్తూ పెద్ద ముక్కు పుడకా మెడలో బంగారు నగలు దిగేసి వున్నాయి. పల్లెటూరి మనిషిలాగే వుంది. అయితే ముఖాన పెద్ద కుంకుమ బొట్టుతో పెద్ద ముత్తయిదువులా వుంది.

"ఎవరూ...ఓ... నువ్వా మేష్టరు బాబూ! ఇలాగొచ్చినావేటి... రా, కూకో... నువ్వు కూడా కూకో బాబూ, ఎవులేంటి?" అని అడిగింది విద్యాసాగర్ గురించి.

"ఇతనూ మేష్టరే సన్యాసమ్మగారూ. కొత్తగా ఉద్యోగం వచ్చింది. పులిపుట్టు వేశారు. ప్రెసిడెంటుగారు ఇంట్లో లేనట్టున్నారే?"

"లేరు అలా పొలం కాడికెళ్లొస్తానని ఎల్లారు. మీరు కూకోండి పిక్కిరోడ్ని పంపించి కబురెట్టి సిటంలో పిలిపిస్తాను. ఏటితను పులిపుట్టు మేష్టరా! పేరేంటి బాబూ?" అనడిగిందామె.

"విద్యాసాగర్ అని మా వూరేనమ్మా" తనే బదులిచ్చేడు జానకేశ్వరరావు.

ఆవిడ వీధి గుమ్మం వరకూ వెళ్లి ఓ కుర్రాడ్ని కేకేసి ఏదో చెప్పింది. తర్వాత ఇంట్లో కొచ్చి ఓ చిరునవ్వు నవ్వి లోపలిగదిలోకి వెళ్లింది.

పెట్టె ఓ పక్కన పెట్టి అక్కడి సోఫాలో కూచున్నాడు విద్యాసాగర్.

"కామయ్యగారనీ, చాలా మంచి మనిషి. నాకు బాగా పరిచయం. అతనీ వూరికి ప్రెసిడెంటు... బాగా డబ్బున్న ఆసామీ కూడా" అంటూ స్విచ్‌బోర్డు దగ్గరకెళ్లి సీలింగ్ ఫేన్ ఆన్ చేశాడు జానకేశ్వరరావు.

ఇంతలో ఆవిడ పంపించిన కుర్రాడు రెండు టీ గ్లాసులతో తిరిగొచ్చేడు. గ్లాసులని ఇద్దరికీ చెరోటీ అందించేక "ప్రెసిడెంటుగార్ని వున్నపాట్న పిలుచుకొస్తాను" అని చెప్పి, మళ్లీ వీధిలోకి తుర్రుమన్నాడు.

విద్యాసాగర్ చేతి వాచి చూసుకుంటూ అన్నాడు

"మనం ఇక్కడ కూచుని ఇంకా ఆలస్యం చేస్తే ఎండెక్కి పోతుందేమో బాగా" అని తన అనుమానం వెలిబుచ్చేడు.

అతన్ని చూసి నవ్వి, "నేనో... ఇక్కడ అట్టే వెయిటింగ్ లేదు. కామయ్యగారు వచ్చేక అతన్తో మాట్లాడి బయలుదేరి పోవడమే" అన్నాడు జానకేశ్వరరావు.

మరింక తొందరపెట్టడం భావ్యం కాదనిపించి వూరుకుండిపోయేడు విద్యాసాగర్.

పావుగంట గడిచేక ఆ కుర్రాడు ఓ పెద్దాయనని వెంటపెట్టుకొని వచ్చేడు.

నన్నెంచు నూరో నెంబరు తెల్లని పంచెకట్టుకుని నగం చేతుల లూజుగా వుండేలాల్చీ ధరించి వున్నారాయన. చేతికి ఖరీదయిన రిష్టువాచీ వుంది. పాపిడి తియ్యకుండా మీదకి దువ్విన జుత్తు ఒత్తుగా వుంగరాలు తిరిగి వుంది. ఏభై యేళ్లుంటాయి. ముఖం కొంచెం మోటుగా కనిపిస్తున్నా, వెడల్పాటి కళ్లు మనుమల్ని నిలబెట్టి వుంచగలిగేలా చురుగ్గా వున్నాయి. చొక్కా జేబులో సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె కాక ఓ బాల్‌పాయింట్ పెన్ను కూడా వుంది.





వస్తూనే నవ్వుతూ జానకేశ్వరరావుని పలకరించేడు.

"ఓహో! చాలరోజులకొచ్చేరే మేష్టరుగారు. మొన్నామధ్య టవునుకొచ్చినపుడు మిమ్మల్ని కలుద్దామనుకున్నాను కానీ వీలయింది కాదు. బావున్నారా? ఇతనెవరు?" అన్నాడతను. విద్యాసాగర్‌వేపు చూస్తూ.

విద్యాసాగర్‌ని పరిచయం చేస్తూ చెప్పాడు జానకేశ్వరరావు "ఇతని పేరు విద్యాసాగర్. కొత్తగా మేష్టరు ఉద్యోగం వచ్చింది. నాలాగే సెకెండరీ గ్రేడు... పులిపుట్టు ఎలిమెంటరీ స్కూల్లో వేశారు. జాయినవడానికి బయలుదేరాం..."

"ఎక్కడకీ? పులిపుట్టుకే?"

పులిపుట్టుపేరు చెప్తే చాలు, అందరూ ఏదో పులిమీద పడ్డట్టుగా బెదిరిపోతూ మాట్లాడటం వింతగా వుంది విద్యాసాగర్‌కి.

"అవును అక్కడికే. ఇవాళ జాయనవుదామనుకుంటున్నాను" అన్నాడు వాళ్ల సంభాషణలో జోక్యం చేసుకుంటూ.

ఆ మాటలు విని చిన్నగా నవ్వేడు అతను. జేబులోనుంచి సిగరెట్ పెట్టె తీసి ఓ సిగరెట్ వెలిగించేడు. తాపీగా పొగవదులుతూ అన్నాడు, "చూడు బాబూ! నీపేరేమిటీ సాగర్‌బాబు కదూ. పులిపుట్టు గురించి నీకంతగా తెలిసినట్టులేదు. ఇక్కడికింకా ఏ పదిహేను కిలోమీటర్ల దూరమో వుంటుంది. అంతా నాటుదారి... కొండెక్కాలి. మధ్యలో పోతులగడ్డ, వరహాలవాగూ దాటాలి. వర్షాల రోజుల్లో నీరొచ్చినప్పుడు వాటిని దాటడం నీ వశంకాదు. ఇప్పుడంత ఫరవాలేదనుకో. ఇంతకీ అక్కడికెళ్లి ఉందామనే?"

"నన్నక్కడ ఎలిమెంటరీ స్కూల్లో సింగిల్ టీచరుగా వేశారు. డ్యూటీ సక్రమంగా చెయ్యాలంటే అదెలాంటి వూరయినా సరే అక్కడ వుండక తప్పదుకదా!" తన నిశ్చయాన్ని స్పష్టంగా చెప్పేడు విద్యాసాగర్.

అతను ఫెళ్లున నవ్వేడు. "నువ్వెక్కడో వెర్రిబాగుల వాడిలాగున్నావయ్యా. అక్కడికెళ్తాననడమేవిటి? వెళ్లి అక్కడ బసపెడతాననడమేవిటి?! చూడు సాగరూ! ఈ జానకేశంబాబు పనిచెయ్యాల్సిన వూరు పులిపుట్టుకన్నా వెయ్యిరెట్లు నయం. కొండెక్కఖర్లేకుండా చుట్టు తిరిగి వెళ్తే చాలు. ఏడాదో యేడాదిన్నరో అయింది, యీ మేష్టరే అక్కడికి వెళ్లలేదు. అసలీ మండలంలో ఏజెన్సీ ప్రాంతంలో రోడ్డు పాయింటుకి దగ్గర దగ్గరవున్న స్కూలు మేష్టర్లు తప్ప ఎక్కడో మారుమూల కొండగ్రామాల్లో మేష్టర్లు ఎంతమంది స్కూళ్లకెళ్తున్నారనుకుంటున్నావు? ఈ సంగతి నీకెవరూ చెప్పలేదా? భలేవాడివే! జానకేశంబాబు మీ ఎమ్‌యీవోబాబుతో చెప్తాడుగానీ, హాయిగా తిరుగుబస్సెక్కి ఇంటికిపో. ఏజెన్సీ కొండగాలి తడాఖా నీకు తెలీదు కాబోలింకా" అన్నాడు.

విద్యాసాగర్ ఇబ్బందిగా కదిలేడు. అతని ముఖంలో రంగులు మారిపోయేయి. ప్రెసిడెంటు కామయ్య మాటలు అతనిలో అసహనాన్ని రెచ్చగొడుతున్నాయి.

ఈ దశలో కలగజేసుకున్నాడు జానకేశ్వరరావు, "లేదు కామయ్యగారూ. అన్నీ విశదంగా చెప్పి చూసేను. అతను తన నిర్ణయాన్నిక మార్చుకోడు. పులిపుట్టుకి దారి నాకూ తెలీదు. దారి చూపే మనుమల సాయం లేనిదే వెళ్లడం సాధ్యం కాదని నాకు తెలుసు. అందుకే మీ సహాయం కోసం వచ్చేను. దయచేసి మమ్మల్ని అక్కడికి తీసుకెళ్లడానికి ఎవర్నయినా తోడుగా యిచ్చి పంపండి" అనడిగేడు.

ప్రెసిడెంటు ఓ రెండు మూడు నిముషాలు ఏం మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ వుండిపోయేడు. ఆ తర్వాత తల వంకిస్తూ "సరే... ఆ యేర్పాటు చేస్తాను మీరుండండి" అని చెప్పులు వేసుకుని యింట్లోంచి బయటకెళ్లేడు.

విద్యాసాగర్ ముఖం విప్పారింది. జానకేశ్వరరావు తనని ఈ యింటికి తీసుకు రావడంలో అంతర్యం ఇప్పుడర్థమయింది. మనసులోనే అతనికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

ఇంతలో వంటగదిలోంచి నన్యానమ్మ బయటికొచ్చింది. ఆవిడ ఓ చేతిలో పెద్ద కంచం నిండా ఉప్మా, మరో చేత్తో రెండు అరిటాకులు పట్టుకొచ్చింది. ఉప్మా ఇంకా అప్పుడే వేడివేడిగా తయారు చేసినట్టు కనిపిస్తూనే వుంది. ఓ వెడల్పాటి బల్ల వాళ్లముందుకి లాగి దాని మీద అరిటాకులు పరిచింది. ఆ తర్వాత

రెండు ఆకుల్లోనూ ఉప్మా వడ్డించింది. లోపలకి వెళ్లి రెండు పెద్ద కంచు చెంబుల నిండా మంచినీళ్లు తెచ్చి పెడుతూ "ఉప్మా చేసినాను బాబూ! టిఫినీ తినెళ్లండి. ఎంత బేగి నడిసినా ఆ వూరెళ్లేసరికి ఎంత పొద్దెక్కుద్దో... తినండి" అంది.

వేషభాషల్లో ఆమె ప్రెసిడెంటుకి పూర్తిగా విరుద్ధం. ప్రెసిడెంటుకి టౌన్‌తోనూ, టౌన్ మనుషులతోనూ చాలా యేళ్లుగా పరిచయాలున్నాయి. అదీకాక కొద్దిగా చదువుకున్న వాడిలాగే కనిపిస్తాడాయన. సన్యాసమ్మ అలా కాదు. పల్లెటూళ్లోనే పుట్టి ఇక్కడే పెరిగి, పెళ్లి చేసుకుని స్థిరపడిపోయింది కాబోలు.

ఆమె కట్టూ, బొట్టూ, మాట్లాడే తీరూ గ్రామీణ స్త్రీలాగే వున్నా ఆమె ముఖంలో ద్యోతకమవుతున్న ఆదర భావానికీ, ఆమె కళ్లలో తొణికిసలాడుతున్న మంచితనానికీ ముగ్ధుడయేడు విద్యాసాగర్. ఇద్దరూ ఆమె పెట్టిన ఉప్మా తినడం ముగించేసరికి ఆమె మళ్లీ లోపలికెళ్లి పెద్ద గాజు గ్లాసులతో చిక్కటి మజ్జిగ తీసుకుని వచ్చింది.

మజ్జిగ తాగి, రుమాలుతో పెదవులు ఒత్తుకున్నాడు విద్యాసాగర్. ఆవిడకి థాంక్స్ చెప్పాలనివుందతనికి. ఎలా వ్యక్తం చెయ్యాలో తెలీడంలేదు. కాస్సేపు తికమకపడి చివరికి "చాలా థాంక్సమ్మా! చాలా మంచి ఉప్మాపెట్టేరు. చాలా రుచిగా వుంది" అన్నాడు నవ్వుతూ.

ఆవిడ నిండుగా నవ్వేసి, ప్లేట్లు, గ్లాసులు తీసుకుని లోపలికెళ్లిపోయింది.

"ఈవిడ... ప్రెసిడెంటు పెళ్లాం... చాలా మంచిది" లోవాయిస్‌తో చెప్పాడు జానకేశ్వరరావు. ఆ మాటల్లో విద్యాసాగర్‌కి ఎందుచేతనోగాని "ప్రెసిడెంట్ మాత్రం కనిపిస్తున్నంత మంచివాడేమీ కాదు" అనే భావం వున్నట్లు-స్ఫురించింది.

ఆ తర్వాత ఇద్దరూ ప్రెసిడెంటు కామయ్యా రాక కోసం ఎదురు చూస్తూ కూచున్నారు. ముప్పావుగంట గడిచేక అతనొచ్చేడు. అతని వెంట ఇద్దరు మనుషులున్నారు. గోచీలు కట్టుకుని తలకి పాగాలు చుట్టుకొని వున్నారు.





ఇద్దరూ కాయకష్టంతో నునుపుదేలిన శరీరాలతో బలిష్టంగా ఉన్నారు. వాళ్ల ముఖాలు చూస్తే కొండ ప్రాంతాలకు చెందిన వాళ్లేనని తెలిసిపోతోంది.

ప్రెసిడెంటు ఇంట్లోకొచ్చి కుర్చీలో కూలబడి కాళ్లు బార్లా జాపి ఆడిస్తూ చెప్పేడు, "ఇదిగోనయ్యా... వీళ్లిద్దరూ మీతోపాటు వస్తారు. పెద్దినాయుడుగారి పాలేళ్లు వీళ్లు. ఆ కొండదారులన్నీ వీళ్లకి కొట్టినపిండి... మీకేం ఫరవాలేదు. మిమ్మల్నక్కడకి దిగబెట్టి తిరిగొచ్చేమని వీళ్లకి చెప్పేను. కాదూ మీరు వెంటనే తిరిగి వచ్చేస్తామంటే మీతోపాటే వస్తారు. ఎలాగయినా మీ ఇష్టమే. ఇక వెళ్లిరండి. ఒరే జాగర్తగా తీసుకెళ్లండిరా" అని వాళ్లని హెచ్చరించేడు.

విద్యాసాగర్ ప్రెసిడెంటుకి కృతజ్ఞతలు చెప్పి, వెళ్లొస్తామన్నట్టుగా తలూపుతూ చేతులు జోడించి నమస్కరించేడు. బయల్దేరడానికి ఉద్యుక్తుడవుతూ సోఫా పక్కన వుంచిన తన పెట్టెని అందుకున్నాడు. అది చూసి సాయంగా వస్తున్న ఆ మనుషుల్లో ఒకతను దాన్నందుకుని తల మీద పెట్టుకుని వీధిలోకి దారి తీశాడు. విద్యాసాగర్ అతని వెంట వీధిలోకి అడుగుపెడుతూ మామూలుగా ఓసారి వెనక్కి తిరిగి చూసేడు.

జానకేశ్వరరావు తన వెంట తెచ్చుకున్న చేతి సంచిలోంచి బ్రాందీ బాటిలు తీసి ప్రెసిడెంటు చేతిలో పెడుతూవుండడం కనిపించింది.

ప్రెసిడెంటు ముఖం మతాబాలాగా వెలిగిపోతోంది.

గతుకుల మయమయిన ఆ దారి వెంట ఆ నలుగురూ మౌనంగా నడుస్తున్నారు. పెట్టె తల మీదపెట్టుకున్న మనిషీ, ఆ రెండో వ్యక్తీ మాత్రం మధ్యలో అప్పుడప్పుడు మెల్లగా ఏవో విషయాలు మాట్లాడుకుంటున్నారు. వాళ్లిద్దరూ ముందు నడుస్తూ వుంటే కొంచెం వెనగ్గా విద్యాసాగర్, జానకేశ్వరరావులు పక్కపక్కనే వున్నా మౌనంగా నడక సాగిస్తున్నారు.

చాలాసేపు ఏదో ఆలోచిస్తున్నట్టుగా వుండిపోయి, చప్పున తలెత్తి జానకేశ్వరరావు కళ్లలోకి సూటిగా చూస్తూ అడిగేడు విద్యాసాగర్ "మీరు ప్రెసిడెంటుకి బ్రాందీ బాటిలు ఇచ్చేరు కదూ!"

జానకేశ్వరరావు వెంటనే జవాబేమీ చెప్పలేదు. నాలుగడుగులు నడిచేక "మిమ్మల్ని ఓ విషయం అడిగేదా విద్యా?" అన్నాడు.

ఆ రాత్రి తను కడుపులో వికారం బయలుదేరి వాంతి చేసుకున్నప్పుడు జానకేశ్వరరావు తనని పొదివి పట్టుకున్న దృశ్యం కళ్లముందు కదలాడినట్లయింది విద్యాసాగర్‌కి. కొంచెం విచలితుడై అతని వేపు చూస్తూ "చెప్పండి" అన్నాడు ముక్తసరిగా.

"నా సంచిలో మరో బాటిలుంది. మనిద్దరం ఏ చెట్టు కిందో జాగా చూసుకుని దాన్ని కొట్టేద్దామా!"

విద్యాసాగర్ ముఖం ఎర్రబడింది. "మీరు నన్ను వేళాకోళం చేస్తున్నారు" అతని పెదవులు వణుకుతున్నాయి.

జానకేశ్వరరావు పకపకమంటూ నవ్వి విద్యాసాగర్ చెయ్యి దొరకబుచ్చుకుని సుతారంగా నొక్కి వదిలేడు.

"సారీ! సరదాకన్నాను. మీకు భలే కోపం వచ్చింది కదూ!" నవ్వుతూ అన్నాడు.

విద్యాసాగర్ మాట్లాడకుండా దారి చూసుకుంటూ నడుస్తున్నాడు. కోపం తెచ్చుకున్నట్టుగా అతను నడక వేగం పెంచడం చూసి తనూ గబగబ అడుగులు వేయసాగేడు జానకేశ్వరరావు.

అతని వేగం అందుకోగానే అతని కుడి అరచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. అప్పుడన్నాడు విద్యాసాగర్‌తో

"మనిద్దరం ఇకనుంచి ఒకర్నొకరం మీరు... మీరు అని సంబోధించుకోకుండా వుంటే బాగుంటుంది కదూ!" అని.

ఈ మాటలు తొలకరి జల్లులా తాకేయి విద్యాసాగర్ మనస్సుని. కనుబొమలు పైకిలేపి తలవూపుతూ తన సంతోషాన్ని సూచించేడు.

చేతులు కలిపి నడుస్తున్న వాళ్ల అరచేతులు మరింత గట్టిగా పెనవేసుకున్నాయి స్నేహపూర్వకంగా.

తర్వాత ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ హుషారుగా నడక సాగించేరు.

దారి సవ్యంగా లేదు. కొంతసేపు పొలాలగట్ల మీద, కొంతసేపు గోర్జిలలోంచి నడవాల్సివస్తోంది. వర్షాలు బాగా పడ్డప్పుడు ఆ సన్నని గోర్జిల మధ్యనుంచి నీరు ప్రవహిస్తుంది. రెండు వైపులా తుప్పలూ డొంకలూ... మామూలప్పుడు అదంతా యిసకదారి. గోర్జిల మధ్యనుంచి వెళ్లేటప్పుడు ఎండకి వేడెక్కిన ఇసక కాళ్లకింద కరకరలాడుతోంది. అల్లంత దూరంలో ఎటు చూసినా కొండలే కనిపిస్తున్నాయి. ఆ కొండలు సమీపిస్తున్న కొద్దీ వాతావరణంలో మార్పు తెలుస్తూనే వుంది. వేడెక్కిన కొండరాళ్లు వాతావరణంలోని ఉష్ణోగ్రతను మరింత పెంచుతున్నాయి.

ఎంత దూరం నడిచినా దార్లో ఒక్క చిన్న ఊరూ కనిపించక్కపోవడం విద్యాసాగర్‌కి వింతగా వుంది. పోతులగెడ్డ దాటి గంటసేపు పైగా నడిచేక వరహాలవాగు వచ్చింది. వాటి పేర్లూ, వరదలొచ్చినపుడు వాటి ఉధృతి గురించీ వెంట వచ్చిన వ్యక్తులు వివరించి చెప్పేరు విద్యాసాగర్‌కి.

అప్పటికే నడవడానికి ఆయాసం అనిపించసాగిందతనికి.

"కాసేపు కూచుని అలుపు తీరేక వెళ్దామా?" అనడిగేడు.

"ఓయస్... అలాగే!" అని చెప్పి వరహాలు వాగు దాటి ముందుకి పోబోతున్న ఆ యిద్దర్నీ ఆగమని కేకేసి చెప్పేడు జానకేశ్వరరావు. "ఓయ్.. కాస్సేపాగి వెళ్దాం, ఉండండి" అని.

వాళ్లు ఆగిపోయేరు.

మోస్తున్న పెట్టె కిందకి దించి చుట్ట వెలిగించేడొకతను. రెండో మనిషి వాగు నీళ్లతో కాళ్లూ చేతులూ కడుక్కున్నాడు. ముఖం మీద నీళ్లు చల్లుకుని తలపాగా విప్పదీసి ముఖం తుడుచుకున్నాడు. ఒడ్డున పెట్టిన చేతికర్రను అందుకుని ఒడిలో దోపుకున్న చుట్టలకట్ట తీసి ఓ చుట్ట ముట్టించుకున్నాడు.

విద్యాసాగర్, జానకేశ్వరరావులు ఓ నాపరాయి చూసుకుని దానిమీద కూలబడ్డారు. బాగా అలసటగా వుందనిపిస్తోంది వాళ్లకి. ముఖాలు బాగా చెమటలుపట్టి ఎండకి బాగా వడలిపోయి కనిపిస్తున్నాయి.

చేతి సంచిలోంచి పెద్ద సైజు వాటర్ బాటిలు తీసి, తను దాహం తీర్చుకుని బాటిలు

విద్యాసాగర్‌కి అందించేడు జానకేశ్వరరావు.

"అరె! థాంక్స్... వాటర్‌బాటిలు తీసుకొచ్చారే!" దాన్నందుకుంటూ అన్నాడు విద్యాసాగర్.

"ఇలాంటి జాగ్రత్తలు తీసుకోకపోతే కష్టమే మరి. ఈ వరహాలువాగు దాటేక ఎక్కడా నీటి జాడే కనిపించదని ప్రెసిడెంటు చెప్తూ వుంటాడు" నవ్వేడు జానకేశ్వరరావు.

దాదాపు వాటర్‌బాటిల్‌లో నీళ్లన్నీ పూర్తిగా తాగేసి దాహం తీర్చుకున్నాడు విద్యాసాగర్.

అతని చేతిలోంచి వాటర్ బాటిలు అందుకుంటూ "నువ్వు నేనిందాక అడిగిన విషయం మరిచిపోయినట్టున్నావ్... ఇంకా నన్ను మీరనే పిలుస్తున్నావ్" అన్నాడు నవ్వుతూ.

విద్యాసాగర్ నొచ్చుకుంటూ "అహఁ! అదేం లేదు. కొంచెం అలవాటుపడాలి మరి... అంతే" అన్నాడు.

దాహం తీరేక ఇద్దరూ వాగునీళ్లలో దిగి ముఖం, కాళ్లూచేతులూ కడుక్కున్నారు. హాయిగా అనిపించింది.

సూర్య కిరణాలుపడి, కంటికి కనిపిస్తున్నంతమేరా వాగులోని నీరు తళతళా మెరిసిపోతోంది.

అదట్టే లోతులేదు. మోకాళ్లు మునిగే లోతుందంతే! మధ్యాహ్నపు ఎండలో ప్రవహిస్తున్న ఆ నీటి అడుగు భాగాన తెల్లని ఇసక స్పష్టంగా కనిపిస్తోంది. ఆ వరహాలవాగు అక్కడినుంచి కొంత దూరం ప్రవహించాక అక్కడ పెద్ద బండరాళ్ల మధ్య మలుపు తిరిగి అదృశ్యమైపోతోంది.

విద్యాసాగర్ చుట్టూ చూసేడు. ఎక్కడా మనుమలు తిరుగుతున్న అలికిడిలేదు. ఈ దారిలో ఒంటరి ప్రయాణం ఎంత భయంకరమో అతని కర్థమయింది. చాలాసేపు నడిచేక కర్రల మోపులు మోసుకు వస్తూనో, దూరంగా పొలాల్లో పనికోసం వెళ్తూనో కొద్దిమంది కనిపిస్తారు.

అంతే!

వాళ్లు దాటి వెళ్లిపోయేక దారి మళ్లీ నిర్మానుష్యమైపోతూ వుంది.

ఈ కొండదారులు ఇలాగే వుంటాయి కాబోలు. తనకిదంతా కొత్త. అసలు జీవితంలో ఇప్పటి వరకూ తను ఇంత దూరం ఏ రోజూ నడవలేదు కూడా!

విద్యాసాగర్ ఆలోచిస్తూ కళ్లు మూసుకుని ఆ రాతి మీదే వెనక్కి వాలేడు.

కాస్సేపటికి జానకేశ్వరరావు తట్టి పిలుస్తూంటే కళ్లు తెరిచాడు. "పద విద్యా... బయలుదేరుదాం... మరో గంటన్నర సేపు నడవాల్సి ఉంటుందేమో" చేతి సంచి అందుకుని భుజాన తగిలించుకుని లేచాడు జానకేశ్వరరావు.

వరహాలవాగు దాటేక నడక దారి మరీ అధ్వాన్నంగా వుంది. మెరక ప్రదేశాలూ, పొలాలూ దాటి, తోరణంలా వ్యాపించి వున్న కొండలు సమీపించేరు.

ఎప్పటి వరకో వారు అలా నడుస్తూనే వున్నారు.

★ ★ ★

పులిపుట్టు చేరారు.

అక్కడికి చేరేసరికి ఇద్దరూ బాగా అలసిపోయేరు. శరీరాలు స్వాధీనం తప్పుతున్నట్టు అనిపించసాగింది.

తమతోపాటు నడిచొచ్చిన ఆ ఇద్దరు మనుమలూ మాత్రం ఏమంత అలసిపోయినట్టనిపించడం లేదు. వాళ్లకి నడక బాగా అలవాటు లాగుంది.

విద్యాసాగర్ చేతి వాచీ చూసుకున్నాడు. టైం నాలుగున్నర కావొస్తోంది. అంటే ఏకబిగిన నాలుగు గంటలపైగా నడిచారన్న మాట.

పెట్టె ఓ పాక ముందు దించి, చేతులు రుద్దుకున్నాడు ఆ మనిషి. వెదుళ్ల వలసలో బయలుదేరాక దారిలో నాలుగయిదుసార్లు పెట్టె బరువుని ఆ మనుమలిద్దరూ మార్చుకున్నారు. ఇప్పుడు మళ్లీ మొదటి మనిషి తల మీద కొచ్చింది అది. చేతి కర్రలు పక్కన పడేసి అక్కడే గొంతుక కూర్చున్నారు.

"బాబూ, బడి యిదే..." అని ఆ పాకని చూపించి, అక్కడితో తమ బాధ్యత తీరిపోయినట్టుగా తాపీగా చుట్టలు తీసి ముట్టించుకున్నారు వాళ్ళు.

ఆ పాకవేసి ఎంత కాలమయిందో! అదిప్పుడు కనీసం పాకలాగా కూడా లేదు. ఏ గాలీ




వర్షానికి పడిపోయిందోగానీ రాటలూ అవి నేల కి జారిపోయి తాటికమ్మలు చిలికిపోయి చెల్లా చెదురుగా పడివున్నాయి. దానికి కొంచెం దూ రంలో మూడు వరసల పాకలున్నాయి. వాటి చూరు బాగా కిందకి వుండి మనిషి పూర్తిగా ఒంగితే తప్ప వాటి లోపలికి దూరడం కష్టం.

పాకల్లో ఎవరూ ఉన్నట్టులేదు. ఓ నలుగుర యిదుగురు పిల్లలు ఆ పక్కనే చింతచెట్టు కింద బుగ్గిలో ఆడుకుంటూ కనిపించేరు. ఎవరి ఒంటిమీదా గుడ్డల్లేవు. చింపిరి జుత్తుతో ఉన్న ఒకమ్మాయి మాత్రం చిరిగిన లంగా కట్టుకుని వుంది. ఆ పిల్లే వాళ్ళని ఆడిస్తోంది. కొత్త మనుషులు రావడం చూసి ఆశ్చర్యపోతూ వింతగా చూస్తూ నిలుచున్నారు పిల్లలు.

జానకేశ్వరరావు ఆ అమ్మాయిని దగ్గరకి రమ్మని పిలిచి అడిగేడు. "మీ ప్రెసిడెంటు ఊళ్ళోలేడా?" అని.

"ఉన్నడు దొర! సిరతలగూడెం నుండి వచ్చినడుగద" అందామె. ఆ తర్వాత గలగల మాట్లాడేస్తూ వీళ్ళ రాకను గురించి ఎన్నో ప్రశ్నలడిగింది. ఆ గిరిజన యాస అర్థం చేసుకోవడం కష్టంగానే వుంది విద్యాసాగర్‌కి.

ఆ పిల్లకి ఓపిగ్గా సమాధానాలు చెప్పి పంపించేసాక తమ వెంట తోడుగా వచ్చిన వాళ్ళలో ఒకడ్ని పిలిచి "నువ్వెళ్ళి ఈవూరి ప్రెసిడెంటుని పిల్చుకురా. టౌన్‌నుంచి స్కూలు మేష్టర్లు వచ్చేరనీ, వెదుళ్ళవలస ప్రెసిడెంటు కామయ్యగారికి బాగా తెలిసిన వాళ్ళ మనీ చెప్పి తీసుకురా" అని పురమాయించేడు.

కాస్సేపట్లో పులిపుట్టు ప్రెసిడెంటుని వెంట తీసుకొచ్చేడు వెళ్ళిన మనిషి. ప్రెసిడెంటు వెంట మరో నలుగురు వ్యక్తులు కూడా వచ్చేరు.

పులిపుట్టు ప్రెసిడెంటు నల్లగా తుమ్మమొద్దులా వున్నాడు. కండలు తిరిగిన శరీరం. మోకాళ్ళు దిగని గావంచా కట్టుకుని, చేతుల బనీనువేసుకుని వున్నాడు. జీలుగు కల్లు తాగినట్టు కళ్ళు రెండూ ఎర్రజీరలతో భయం కొలిపేలా వున్నాయి.

అంత ఒడ్డూ పొడుగూ వున్న మనిషి కూడా దగ్గరికొస్తూనే వంగి వంగి దండాలు పెట్టేడు వీరికి.

"ఏటి సెలవు?" అన్నాడు చేతులు కట్టుకుని.

"నా పేరు జానకేశ్వరరావు. కొండంగి స్కూలు మేష్టర్ని... ఇతను విద్యాసాగర్... మీ వూర్లో మేష్టరుగా ఉద్యోగంలో వేశారు... జాయినవ్వాలని వచ్చేడు... వెదుళ్ళవలస ప్రెసిడెంటు కామయ్యగారు మీకు బాగా తెలుసుకదూ... ఈ మేష్టరుకి యిక్కడ కావలసిన సదుపాయాలు చూడమని మీతో చెప్పమన్నారు" వివరంగా చెప్పేడు జానకేశ్వరరావు.

ప్రెసిడెంటు ముఖం విప్పారింది. "ఏం మేష్టరూ... బడి సెప్పుకుంటావా... ఇక్కడ బడెట్టిన తర్వాత యిక్కడుండి బడి సెప్పుకున్న పంతులు ఒక్కడ్నేడు... ఆ మద్దిన ఒక పంతు లొచ్చినాడు కాని బిగిలిపోయి పారిపోయినాడు... అయితే మల్ల నువ్వలాగే సెయ్యవు కద?" అనడిగేడు.

ప్రెసిడెంటు కూడా గిరిజనుడే. కాని అతని మాటతీరు కాస్త బాగుంది, యిక్కడి మిగతా వారి మాటతీరుతో పోల్చిచూస్తే...

రాజకీయాలతోనూ, టౌను మనుషులతోనూ పరిచయాలవల్ల తన భాషనీ, వేషధారణనీ మెరుగు పర్చుకున్నట్టున్నాడు. కొద్దిగా చదువుకున్నాడో ఏమో కూడా-

"ఇక్కడ ఉందామనే వచ్చేను... ఉండడానికి నాకోవసతి చూపిస్తే చాలు... బడి... ఈ బడి ఏమిటిలా వుంది... ఈ పాకని లేవనెత్తి నిలబెడితే" విద్యాసాగర్ మాట నాన్చుతూ చెప్పాడు.

"అయ్యన్నీ ఎలాగూ సేస్తాంలే గురూ... రాత్రవుతోంది... పదండి మీరుండడానికి చోటు చూపిస్తాను... అన్నట్టు మీ బోజినాల సంగతేటి?" అడిగేడు ప్రెసిడెంటు బయల్దేరడానికి ఉద్యుక్తుడవుతూ.

"ఈ రాత్రి తినడానికి మేం ఏదో తెచ్చుకున్నాం... రేపటినుంచి యితను వంట చేసుకుంటాడు" జానకేశ్వరరావు చెప్పేడు.

"సరే" అని తలూపి ప్రెసిడెంటు పాకల వేపు దారితీసేడు. అందరూ అతన్ని అనుసరించేరు.

★ ★ ★

ఆ పాక ఎవరో కొత్తగా కట్టుకున్నట్టుగా ఉంది. ఇంకా ఎవరూ లేరు. ఖాళీగానే వుంది.

నేలంతా పేడతో అలికివుంది. సున్నంతో రకరకాల ముగ్గులు, లతలు గోడలనిండా వేసివున్నాయి. కొత్తమట్టి వాసన... అదోరకమయిన చిత్రమైన వాసనని వెదజల్లుతున్నాయి... మట్టిగోడలు.

ప్రెసిడెంటుతోపాటు వాళ్ళు ఆ పాకలో ప్రవేశించేవేళకి- ఎక్కడెక్కడికో పనులమీద వెళ్ళిన వాళ్ళందరూ తిరిగి వచ్చేసినట్టున్నారు... వార్త తెలిసి చాలామంది పాకముందు గుమిగూడిపోయేరు.

తమ వూళ్ళోకొచ్చిన మేష్టర్ని చూసేందుకు వాళ్ళు ఒకర్నొకరు తోసుకుంటూ తొందరపడుతున్నారు.

పాకలోకి తీసుకొచ్చేక తన వెంట వచ్చిన మనుమల్ని పరిగెత్తించి, ఎవరి పాకలోంచో ఓ రెండు నులకమంచాలు తెప్పించి వేయించేడు. ఒక హరికెన్ లాంతరు కూడా తెప్పించేడు. కుండతో తాగడానికి నీళ్ళూ, ఒక సిల్వరు గ్లాసూ పెట్టించాడు.

అతను పంపించిన వాళ్ళలో ఒకడు పెద్ద సైజు అరటిపళ్ళు నాలుగు అత్తాలు, ఓ తప్పే లాతో కాచిన పాలూ తీసుకొచ్చేడు. మరొకడు ప్రెసిడెంటు యింటినుంచి యినపకుర్చీ తెచ్చి వేశాడు.

ఏర్పాట్లు పూర్తయేక ప్రెసిడెంటు ఆ యిద్ద ర్నీ ఉద్దేశించి అన్నాడు. ''ఈ పాలికిలి సరిపోత య్గద! తిని తొంగోండి... ఇక్కడ మీకేటి బయ్యంనేదు... తిండి కోసం వొంటకి సరుకు లు కావాలంటే రేపు మడిసిని పంపించి సింతలగూడెంనుంచి తెప్పిస్తాను... పెద్దూరే అది... కోవటిదుకాణం కూడా వుంది. ఈ కొండ లమీద గూడెపోళ్ళందరికీ అక్కడ సంత జరు గుతాది. కార్పొరేషనోల్ల గొడవునుందక్కడ... సింతలగూడెం బడిమేష్టు మీలాగే కుర్రాడే... బడి బాగా సెప్తాడులే. మంచోడు...''

అతని మాటలతో ఉత్సాహం కలిగింది విద్యాసాగర్‌కి ''చింతలగూడెమా! ఎంత దూరం... పెద్ద ఊరేనన్నమాట!''

''మరి... ఎంతో దూరవేటినేదు... అల్లద, ఆ కొండ పక్కనుంచెల్తే కనిపిస్తాది... ఓ! అన్నీ దొరుకుతాయి... కిర్సనాయిలూ, సబ్బులూ... వప్పులూ బియ్యం... అన్నీనూ! ఆ కోవిటోడు గుడ్డ ముక్కలు కూడా అమ్ముతాడు... అల పింటి గుడ్డలు మీలాంటోళ్ళకి నచ్చవనుకో...'' చెప్పేడు ప్రెసిడెంటు.

''ఆ స్కూల్లో పనిచేసే మేష్టరు పేరేమిటీ?... అక్కడే ఉంటున్నాడా అతను?'' ఆతృతగా అడిగేడు విద్యాసాగర్.

''చెప్పేను కాదా! మంచోడని... అక్కడే ఉంటాడు...''

జానకేశ్వరరావు గురించి తండ్రితో తనన్న మాటలు హఠాత్తుగా గుర్తొచ్చేయి విద్యాసాగర్‌కి.

అవును-

ఈ నాణేనికి బొరుసు మాత్రమే కాదు... బొమ్మకూడా వుంది! ఓసారి వెళ్ళి అతన్ని కలుసుకోవాలి.

''అతని పేరు చెప్పలేదు-'' మరోసారి గుర్తు చేస్తూ అడిగేడు విద్యాసాగర్.

''పేరా! సత్యంబాబు''



కొస్సేపు మాట్లాడేక అందరూ సెలవు తీసు కుని వెళ్ళిపోయేరు.

వెదుళ్ళవలసనుంచి సాయంగా వచ్చిన యిద్దర్నీ ప్రెసిడెంటు భోజనాలకి తనవెంట తీసుకుపోయేడు. ఆ రాత్రి అక్కడ గడిపి, మర్నాడు తెల్లవారగానే వాళ్ళు తిరిగి వెళ్ళి పోయేందుకు నిర్ణయమయింది.

అందరూ వెళ్ళిపోయేక, పాకలో విద్యాసా గర్, జానకేశ్వరరావులు మిగిలేరు. బట్టలు మార్చుకుని, లుంగీల్లోకి మారిపోయేక విద్యాసా గర్ పెట్టి తెరిచి రెండు దుప్పట్లు తీసి నులకమంచాలమీద పరిచేడు. ఇద్దరూచెరో మంచంమీదా ఎదురెదురుగా కూచున్నారు.

''ఎలా వుంది విద్యా, నీ పులిపుట్టు?''

విద్యాసాగర్ నవ్వేసి ఊరుకున్నాడు. క్షణం ఆగి అడిగేడు. ''స్కూలు రికార్డులన్నీ ఎక్క డుంటాయి? నా జాయ్‌నింగ్ రిపోర్టు ఎమ్.యీ.వో.కి పంపించాలి కదూ''

''స్కూలు పాక ఎలా వుందో చూసేవుకదా... ఇలాంటి స్కూళ్ళకి ఒల్లు రికార్డులంటూ ఏవీ ఎక్కువ వుండవు... ఏమైనా వుంటే ప్రె సిడెంటు యింట్లో వుండొచ్చుననుకుంటాను... లేదా నీకు ఛార్జీ అప్పచెప్పాల్సిన నీలకంఠ రావు దగ్గరే వుంటుంది రికార్డంతా. నీ జాయ్ నింగ్ రిపోర్టు పంపించేక తాపీగా అతని దగ్గరనుంచి ఛార్జితోపాటు తీసుకోవచ్చు...''

''అతనెక్కడ వుంటాడు?''

''చెప్పలేను... అతనీ వూరికి వచ్చిందేలే




దు... టౌన్లోనే ఏవో వ్యాపారాలున్నాయని వినికిడి... ఎమ్...యీ.వో అచ్యుతరావుతో మంచి దోస్తీ వుందతనికి''

''మరతని దగ్గరనుంచి ఛార్జి ఎలా తీసుకోవడం?'' సందేహంగా అడిగేడు విద్యాసాగర్.

''అవన్నీ తరవాత చూద్దాం... రాబోయే శనివారం మన టౌన్లో సెంటర్‌క్లాస్ మీటింగ్ వుంటుంది... అక్కడ దొరుకుతాడు మనకి... యిప్పటికే బాగా అలిసిపోయేం... కాస్త తినేసి పడుక్కోపోతే యీ వొళ్ళునొప్పులు తగ్గవు''

అప్పుడు గుర్తొచ్చింది విద్యాసాగర్‌కి- ఇందాక ప్రెసిడెంటు తమ భోజనాల గురించి అడిగినప్పుడు తమ వెంట ఏదో తినడానికి తెచ్చుకున్నామని జానకేశ్వరరావు చెప్పడం.

''టిఫిన్ తెచ్చేరా!'' ఆశ్చర్యంగా అడిగేడు.

''ఊ... ఈ రాత్రికి ఏదో సాపాటు వుండాలిగా!''

''ఛ... ఏదేనా టిఫిన్ చేయించి, తీసుకురావాలన్న ఆలోచనే నాకు తట్టలేదు... అమ్మ పెట్టిలో ఏవో చేగోడీలూ కారప్పూసలాంటి పిండి వంటలు పెట్టింది... టిఫిన్ చేయించుకొస్తే ఈ రాత్రి గడిచి పోతుందన్న ఊహే రాలేదు'' నొచ్చుకుంటూ అన్నాడు విద్యాసాగర్.

''ఫరవాలేదు... నేను తెచ్చానుగా! నువ్వనవసరంగా ఫీల్ కావొద్దు... సరే యిక లేచి కాళ్ళూ చేతులూ కడుక్కో'' అంటూ లేచేడు జానకేశ్వరరావు.

అప్పటికి చీకట్లు ముసురుకోవడం మొదలయింది. జానకేశ్వరరావు వెళ్ళి హరికేన్ లాంతరు వెలిగించేడు. పాకంతా వెల్తురు పరుచుకుంది.

ఊరంతా అప్పుడే సద్దుమణిగిపోతోంది. ఎదురు వరస పాకల్లోంచి బుడ్డి దీపాల వెలుగు మసకమసగ్గా కనిపిస్తోంది. పాకలోంచి కొంచెం వంగి చూసేడు విద్యాసాగర్. చీకటి సముద్రంలో మునిగిపోయినట్టు అంతసేపూ కనిపించిన ఎత్తయిన కొండలు మరి కనిపించడంలేదు. చల్లని కొండగాలి రివ్వున వీస్తూ ఒంటిని ఝుళ్‌ఝుళ్‌మనిపిస్తోంది. చీకట్లో కొండలు కనిపించకపోయినా బొగ్గులకోసం, పోడు వ్యవసాయంకోసం గిరిజనులు పెట్టిన అగ్గి బాగా రాజుకుని నెగడు సన్నని జ్వాలా తోరణంలా యిక్కడికి కనిపిస్తోంది.

కాస్సేపు అలా వీధి చీకట్లలోకి చూసి, చలిగాలి హెచ్చుగా ఉండడంతో వీధి తలుపులు గడియపెట్టాడు విద్యాసాగర్.

ఈలోగా తను తెచ్చుకున్న సంచీలోంచి ఓ పెద్దపొట్లాం తీసి దానికి చుట్టివున్న దారం విప్పదీసేడు జానకేశ్వరరావు.

విద్యాసాగర్ పెట్టెలోంచి రెండు స్టీలుగ్లాసులూ, స్టీలు ప్లేట్లూ బయటకి తీసేడు.

పొట్లం విప్పి చపాతీలు, కూర రెండు ప్లేట్లలోనూ సర్దేడు జానకేశ్వరరావు.

విద్యాసాగర్ మనసు ఆర్ద్రమైపోయింది. తను కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో తెలియ లేదతనికి. చెప్పినా అందుకతడు అంగీకరించడేమో కూడా!

కడుపులో ఆకలి కరకరమంటూ ఉండగా ఆవురావురుమంటూ ఆ టిఫిన్ తిన్నారిద్దరూ. ఆ తర్వాత- యిందాక ప్రెసిడెంటు మనిషి తెచ్చిచ్చిన అరటి పళ్ళు నాలుగేసి తిని, చెరొక గ్లాసుతో పాలు తాగేరు. అప్పటికి ఆకలి చల్లారింది.

తర్వాత మరింక కబుర్లు చెప్పుకుంటూ గడపడానికి యిద్దరికీ ఓపిక లేకపోయింది.

కళ్ళు నిద్రమత్తుతో కూరుకుపోతూ వుంటే లాంతరు వత్తి తగ్గించి మంచాలమీద వాలిపోయేరు.

ముంచుకొస్తున్న నిద్రని ఆపుకుంటూ ''నువ్వు... నువ్వు రేపే బయల్దేరి వెళ్ళొద్దు ఈశ్వర్! రేపంతా నాతో గడిపి, ఎల్లుండి వెళ్ళరాదూ?'' అడిగేడు విద్యాసాగర్.

మొట్టమొదటిసారి తనని ఏకవచనంతో విద్యాసాగర్ సంబోధించడం గమనించి అదో తృప్తితో కూడిన మెరుపు మెరిసి మాయమయింది జానకేశ్వరరావు ముఖంలో. ఆ మసక వెల్తుర్లో విద్యాసాగర్‌కి అది కనిపించలేదు.

మరోవేపు ఒత్తిగిలి పడుకుంటూ మనసులో అనుకున్నాడు. ''వీలుచూసుకుని త్వరలో చింతలగూడెం వెళ్ళి ఆ సత్యం టీచర్ని కలవాలి'' అని.

ఆ తర్వాత క్షణాల్లోనే యిద్దరికీ గాఢనిద్ర

పట్టేసింది. ఒళ్ళెరక్కుండా నిద్రపోయేరు.

★ ★ ★

బడలికవల్ల మొద్దునిద్ర పోయాడేమో, విద్యాసాగర్ నిద్రలేచేసరికి ఎనిమిదయింది. బద్ధకంగా కళ్ళువిప్పి చూసేడు.

ఒక లిప్తకాలం తనక్కడ పాకలో ఉండడం అతనికి అయోమయం కలిగించింది.

మరుక్షణంలో పూర్తిగా మెళుకువ తెచ్చుకున్నాడు. పక్కనున్న నులకమంచంవేపు చూసేడు.

ఎప్పుడు లేచిపోయేడో జానకేశ్వరరావు మంచంమీద కనిపించలేదు.

తనూ లేచి, దుప్పట్లు మడతపెట్టి, మంచాలు రెండూ గదిలో మూలకి చేర్చాడు. తలదిండు లేకపోవడంవల్ల మెడంతా యిరుకు పట్టినట్లయి నొప్పి పెడుతోంది. ఓసారి తల విదిలించుకుని ఒళ్ళు విరుచుకున్నాడు.

ఈలోగా జానకేశ్వరరావు పాకలోకి వచ్చేడు. "గుడ్మార్నింగ్... రాత్రిబాగా నిద్రపట్టింది కదూ?" నవ్వుతూ పలకరించేడు.

"ఓ! బ్రహ్మాండంగా- ఇంతకీ యింత పొద్దున్నే నువ్వెక్కడి కెళ్ళావ్?" అడిగేడు విద్యాసాగర్.

"ప్రెసిడెంటు యింటికెళ్ళేను... లే, లేచి ముఖం కడుక్కుంటే ప్రెసిడెంటు టీ, టిఫినూ పంపిస్తున్నాడు. తినొచ్చు"

"టిఫినా!"

"అవును ప్రెసిడెంటు తెల్లవారుఝామునే మనిషిని చింతలగూడెం పంపించేడు. మన కోసం ఇడ్లీలు పట్టుకురమ్మని- అక్కడ టీ టిఫిన్లు దొరికే కాకా హొటలుందిట"

కనిపించని పేగేదో తియ్యని బాధతో కదిలినట్టయింది విద్యాసాగర్‌కి.

తమ టిఫిన్లుకోసం ప్రెసిడెంటు మూడు నాలుగు కిలోమీటర్ల దూరాన్నవున్న ఊరికి మనిషిని పంపించేడా! అదీ యింత ఉదయాన్నే!

శీతాకాలపు ఎండలా ఒక ఆత్మీయతాభావం అతని హృదయాన్ని వెచ్చగా తాకింది. శ్రుతి చేసిన వీణని సుతారంగా మీటినట్టు ఆనందంతో అతని డెందం పులకరించిపోయింది.

నాగరికత బలిసినచోట అధికార దర్పాల ప్రదర్శనే కాని- యీ అభిమానాలూ, ఆప్యాయతలూ మృగ్యం.

ఈ పల్లె, తల్లి ఒడిలా, ఆమెలాలనలా మనోహరంగా వుంది. ఇక్కడి వాళ్ళ ఆదరాభిమానాలకి అతని మనసు పరవళ్ళు తొక్కింది.

ఇక్కడి పరిస్థితుల గురించి తను విన్నదేమిటి. ఇప్పుడు చూస్తున్నదేమిటి? ఎంత వ్యత్యాసం.

ఇక్కడి మనుషులు చూపించే ఆత్మీయతలో కల్లాకపటంలేదు. వాళ్ళు అందించే సహకారంలో భేషజాలూ, డాంబికాలూ వుండవు.

అందర్నీ సొంతమనుషుల్లాగా చూసే అమాయకమయిన సంస్కారం వీళ్ళది. నాలుగు అక్షరాలు నేర్పించి తమ పిల్లల్ని తీర్చిదిద్దడంకోసం వొచ్చిన మేష్టర్లపట్ల ఎంతో ఆదరాన్ని చూపిస్తారు.

కాని, తమ స్వంతప్రయోజనాలకోసం, స్వార్థాలకోసం, తమ విలాసాలకీ, సౌకర్యాలకీ ఆటంకం కలుగుతుందన్న భయంతో యీ మారుమూల ఉండి పని చెయ్యడానికి ఎవరూ అంగీకరించరు.

అందుకోసం వాళ్ళొక అబద్ధపు ప్రపంచం సృష్టించేరు. ఒక అవినీతి వలయాన్ని ఏర్పరచుకున్నారు. తప్పించుకుందుకి కుటిలోపాయాల్ని కల్పించుకుంటున్నారు...

ఒక్కరోజు కూడా ఇక్కడ బడి నడపనక్కరలేకుండానే తమ పబ్బం గడుపుకొన్తున్నారు.

అదనపు అలవెన్సులతో జీతాలందుకుంటున్నారు.

అవినీతిలో కూరుకుపోయిన అచ్యుతరావు లాంటి అధికారులు ఈ విషపు గోడల్ని పూటుకర్రల్లా నిలబెడుతున్నారు.

ఈ కొండ ఊరి ప్రజలకు, తమ ఊళ్ళో బడి ఎప్పుడు తెరుస్తారో తెలీదు. ఎప్పుడూ ఎందుకు మూతబడి ఉంటుందో అసలే తెలీదు. ఆ విషయాల్ని పట్టించుకోగలిగే పరిజ్ఞానమూ వారికి లేదు. పట్టించుకున్నా ఆ విషయం

 

ఎవరికి తెలియజెయ్యాలో తెలీదు. తెలిసినప్పటికీ ప్రెసిడెంటులాంటి కొద్దిపాటి చదువుకున్న వాళ్ళకి అక్కర్లేదు- అవసరమయితే వాళ్ళని మంచి చేసుకునో, మందుపోసో తమకి అనుకూలంగా తిప్పుకునే చాకచక్యం కూడా ఆ మేష్టర్లకీ అధికారులకీ వుంది.

అందుచేత... యీ అవినీతి అవిచ్ఛిన్నంగా సాగిపోతూనే ఉంది...

కాని... కానీ...

అందరూ యిలాగే ఉంటున్నారా! నీతి కోసం, క్రమశిక్షణకోసం పాటుపడే అధికారులే లేరా? జీతాలు తీసుకుంటున్నందుకు తమ వృత్తికి న్యాయం చెయ్యాలనే తపన ఉన్న ఉపాధ్యాయులు లేరా?!

ఉండరని చెప్పడం- ఒక నాణేనికి బొరుసు మాత్రమే ఉంటుందని మాయమాటలు చెప్పి మోసగించడం... బొరుసే తప్ప బొమ్మ ఉండదని మభ్యపెట్టాలని చూడడం...

విద్యారంగం భ్రష్టుపట్టిపోయిందని దులపరించుకునేవారికి ముందుగా కనిపించే ముద్దాయి ఉపాధ్యాయుడే!

కాని... అది తప్పేమో... పాక్షిక సత్యమేమో- సాకల్యంగా ఆలోచిస్తే 'కర్ణుడి చావుకి కారణాలారు' అన్నట్టు- దానికి జవాబుదారీ ఒక్క ఉపాధ్యాయుడు మాత్రమే కాదని అర్థమవుతుందేమో...

విద్యాసాగర్ ఆలోచనలు పరిపరివిధాల సాగుతున్నాయి.

"సత్యం... చింతలగూడెం టీచరు... అతన్ని కలవాలి" అనుకున్నాడు తనలో-

ఎందుకో అతనిప్పుడు చప్పున గుర్తొచ్చేడు.

ఎందుకంటే

నాణేనికి అతడు బొమ్మ!

కనుక తప్పకుండా అతన్ని కలవాల్సిందే.

"ఏమిటి విద్యా! నిద్రలేస్తూనే ఆలోచనల్లో పడ్డట్టున్నావే" నవ్వుతూ అడుగుతున్న జానకేశ్వరరావు మాటలతో ఆలోచనలనుంచి బయటపడ్డాడు విద్యాసాగర్.

అతను లేచి ముఖం కడుక్కునేసరికి- ఒక వ్యక్తి యిడ్లీలు, టీ పట్టుకొచ్చేడు. టిఫిన్ చేసి టీ తాగేరు. ఇంతలో ఆ వచ్చిన మనిషి పాక వెనుక ఖాళీ జాగాలో మూడు రాళ్ళు పేర్చి పెద్ద సిల్వరుపాత్రలో వాళ్ళ స్నానాలకోసం వేడినీళ్ళు కాచి సిద్ధంచేశాడు.

స్నానాలు పూర్తిచేసి, బట్టలు వేసుకునేసరికి పది దాటింది. ఈలోగా జానకేశ్వరరావు చెప్పి పంపించేడు కాబోలు ఆ మనిషి ప్రెసిడెంటు యింటికి వెళ్ళి ఒక చిన్న రేకు డబ్బాతో కిరసనాయలు తెచ్చియిచ్చేడు. ఆ తర్వాత అక్కడ తనకింక చేయాల్సిన పనేమీ లేదని తెలిసి వెళ్ళొస్తానని చెప్పి వెళ్ళిపోయేడు.

"అరె! మజ్జిగ దొరుకుతుందేమో అడగడం మరిచిపోయేను" అతను వెళ్ళిపోయేక గుర్తొచ్చి అన్నాడు విద్యాసాగర్.

"ఉహూఁ..." తల అడ్డంగా వూపి నవ్వుతూ "సాయంత్రం ఎక్కడినుంచయినా పాలు తెప్పిద్దాం... మజ్జిగతో భోజనం రేపటి మాటే! అసలు నీకు తెలుసా! ఈ కొండజాతి ప్రజలు పశువుల పాలు పితకడానికి ఒప్పుకోరు... తల్లి పాలన్నీ దూడ తాగాల్సిందే... ఇప్పుడిపుడే మన టౌనువాళ్ళ వాసన వీళ్ళకీ కొద్దిగా సోకుతోంది... గవర్నమెంటు గేదెలూ అవీ యిచ్చి వీళ్ళలో ఆ దృక్పథం కాస్త వెనకంజ వేసేలా చేసింది... ఇప్పుడిపుడే పాలు పితకడం... పట్టుకెళ్ళి అమ్మడం చేస్తున్నారు" అని చెప్పేడు.

విన్నుపోతూ, అతను చెప్పింది విన్నాక తన వెంట తెచ్చుకున్న స్టౌలో కిరసనాయలు పోసేడు. 'ఇవాళో రేపో చింతలగూడెంనుంచి ఐదారు లీటర్లయినా కిరసనాయలు తెప్పించుకోవాలి' అనుకున్నాడు తనలో.

ఓ అయిదు కేజీల బియ్యం... కాసిన్ని బంగాళా దుంపలూ, పోపు సామానూ, సీసాతో వంటకి నూనె, అలాగే కొద్దికొద్దిగా వంటకి సామానూ, దినుసులూ తనవెంట ముందు చూపుతో తెచ్చాడతను. సీసాతో నూనె సామాన్లతో పాటు సర్దడానికి ముందు పార్వతమ్మగారు ఒప్పుకోలేదు. "శుభమా అని మొదటిసారిగా బయల్దేరుతూ వెంట తైలం తీసుకెళ్ళకూడదు నాయనా" అని వారించింది.

వెళ్తూనే అన్నింటికీ తడుముకోవాల్సి

వస్తుందని తనే పెట్టమన్నాడు నాలుగు రోజులు యిక్కడ పరిస్థితి అర్థమయ్యేక ఏం చెయ్యాలో తర్వాత చూసుకోవచ్చని ఆవిడకి నచ్చచెప్పేడు.

"ఆ కొండల్లో ఏం వండుకుంటావో, ఏం తింటావో" అని ఊరికే ఆందోళనపడిపోయేరు అమ్మా నాన్నానూ. తను కూడా కొంచెం భయపడిన మాట వాస్తవం. మరింక ఆ బెంగలేదు. చింతలగూడెంలో అన్నీ దొరుకుతాయని ప్రెసిడెంటు చెప్పినపుడు. అందుకే తన ఆనందానికి అవధుల్లేకపోయేయి...

అతను స్టౌలో కిరసనాయిలు పోసి సిద్ధంచేసేక, "మనం ఊళ్లోకెళ్ళి అలా తిరిగొచ్చేక వంట మొదలు పెడదాం, ఇప్పుడు తొందరేం లేదుగా!" అన్నాడు జానకేశ్వరరావు.

"సరే... అలాగే చేద్దాం" అంగీకారంగా తల వూపేడు విద్యాసాగర్.

ఆ తర్వాత పాకకి తలుపులు వేసి, గొళ్ళెంపెట్టి ఊళ్ళోకి బయలుదేరారిద్దరూ.

తలుపుకి తాళం వేయాలని యిద్దరిలో ఎవరికీ కూడా అనిపించలేదు. ఆ విషయం వాళ్ళకి తట్టకపోవడం యాదృచ్ఛికమే అయినా- అది ఆ కొండగ్రామపు నైర్మల్యానికీ, స్నిగ్ధత్వానికీ నిదర్శనం.

ఊరంతా ఓసారి చుట్టిరావడానికి పదినిముషాలు కూడా పట్టలేదు వారికి.

అన్ని పాకలూ ఒక మోస్తరుగానే ఉన్నాయి. చూర్లు బాగా కిందికి దిగిపోయి, తరాలనాటి వినయశీలతని కాపాడుకుంటున్నట్టుగా ఉన్నాయి. ఒక్క ప్రెసిడెంటుది మాత్రమే మిద్దె యిల్లు.

ఊరికి ఆపక్క దట్టంగా పెరిగిన చింతచెట్ల తోపు. దానిపక్క కొండవాగు కాబోలు సన్నగా ప్రవహిస్తోంది.

ఆవేపు చదునుగా వున్నస్థలంలో అడ్డాకుల కట్టలూ, పొగాకు ఆరబెట్టడానికి వేసిన పందిళ్ళూ కనిపిస్తున్నాయి. తర్వాత అంతా చెట్లమయం... అడవి మళ్లీ అక్కడ మొదలవుతుంది కాబోలు. ఈ ఉదయం పదిగంటల కాలంలో ఆ ఊరు అంత నిశ్శబ్దంగా ఉండడం వింతగా తోచింది విద్యాసాగర్‌కి. అందరూ పనులమీద వెళ్ళిపోయినట్టున్నారు.

ఇద్దరూ మాట్లాడుకుంటూ బడి ఉన్న స్థలంలోకి వచ్చేరు.

పడిపోయిన ఆ పాక దిక్కులేని ఆడదానిలా వుంది. ఎవరూ పట్టించుకోకుండా కనిపారేసిన అనాధ శిశువులా వుంది. ఆ బడి ఉన్న తీరు చూసి, విచారంగా నిట్టూర్చేడు విద్యాసాగర్.

రెండు క్షణాలు ఆగి జానకేశ్వరరావుని ప్రశ్నించేడు. "ఈ పాక నిలబెట్టడానికీ, బాగుచేయించడానికీ ప్రెసిడెంటు మనుమల్ని వంపించలేదేం?" అని.

అతను నవ్వేడు. నవ్వి, "అంతవేగిరం బాగుచేయిస్తాడనుకోను... ముందతనికి విశ్వాసం కుదరాలి... నువ్వు అందరి మేష్టర్ల లాగా ఈ వాతావరణంలో యిమడలేక బెదిరిపోయి పారిపోవనీ- ఇక్కడే ఉండి పిల్లలకి పాఠాలు చెప్పుకుంటావనీ నీమీద నమ్మకం కుదరాలి" అన్నాడు.

మరింక చేసేదేంలేక విద్యాసాగర్ ఆ పాకకి దగ్గరగా వెళ్ళేడు. అక్కడేవో పిచ్చి మొక్కలు దట్టంగా పెరిగిపోయి ఉన్నాయి.,

చేతికందిన పిచ్చి మొక్కల్నిమౌనంగా పీకి పారెయ్యడం మొదలుపెట్టాడతను. జానకేశ్వరరావు ఆ పనిలో తనూ ఓ చెయ్యి వేశాడు!

ఆ మధ్యాహ్నం ఇద్దరూ యింటికొచ్చి, కబుర్లు చెప్పుకుంటూ వంటచేశారు. విద్యాసాగర్‌కి వంట బాగానే వచ్చు. చదువుకునే రోజుల్లో ఒక్కడూ గది తీసుకుని వంట చేసుకు తింటూ డిగ్రీదాకా అలాగే చదివేడు.

అన్నం వండి తర్వాత చారు తయారుచేసేడు. బంగాళా దుంపల వేపుడుకూర చేసేడు. కబుర్లు చెప్తూ అతనికి వంటలో సాయంచేశాడు జానకేశ్వరరావు.

ఒంటిగంట ప్రాంతంలో అన్నాలు పెట్టుకుని తిని, ముందురోజు రాత్రి తినగా మిగిలిన అరటిపళ్లు రెండేసి తిన్నారు. ఆ తర్వాత మంచాలు వాల్చుకుని కాస్సేపు కునుకుతీశారు.

నిద్రలేచేసరికి నాలుగయింది. ముఖాలు కడుక్కుని బట్టలు వేసుకుని మళ్ళీ ఊర్లోకి




బయలుదేరేరు.

అప్పటికే వాతావరణం చల్లబడిపోవడం మొదలయింది. రొజ్జగాలి కొద్దికొద్దిగా మొదలయింది.

ఆ సాయంకాలపు నీరెండలో పులిపుట్టు గ్రామం- ప్రకృతిమాత ఒళ్ళో అమాయకంగా నిద్రపోతున్న పసి బిడ్డలా వుంది. నిజంలాగా నిర్మలంగానూ, నమ్మకంలాగా తేటగానూ కనిపించింది విద్యాసాగర్ కళ్ళకి.

"అలా చింతల తోపువరకూ నడిచి వొద్దామా" అడిగేడు జానకేశ్వరరావు.

"వద్దు... బడిదగ్గరకెళ్దాం పద"

అతని చూపుల్లో కొత్తకాంతీ, ఏదో సాధించాలన్న పట్టుదలా చూసి మరేం మాట్లాడలేదు జానకేశ్వరరావు.

అలా వాళ్ళిద్దరూ ఉదయంలాగే మళ్ళీ బడి దగ్గరకొచ్చేసరికి పావు తక్కువ అయిదయింది.

పాక చుట్టూ పెరిగిన పిచ్చిమొక్కల ఏరివేత కార్యక్రమం మళ్ళీ మొదలయింది.

కాస్సేపట్లో ఆ పక్కగా వెళ్తూ, వాళ్ళు చేస్తున్న పనిని కొంతసేపు వింతగా చూస్తూ నిల్చుండి పోయేరు నలుగురయిదుగురు పిల్లలూ, ఒకరిద్దరు పెద్దలూ...

"మీలో బడికి ఎవరు మేష్టు?" ఒకతను అడిగేడు.

జానకేశ్వరరావు తన మిత్రుడ్ని వాళ్ళకి చూపించేడు.

"బడి మల్ల తీస్తవన్నమాట"

"అవును" తలూపేడు విద్యాసాగర్.

ఆ తర్వాత అక్కడ వింత చూస్తూ నిల్చున్న పిల్లలూ, అటొచ్చిన కొందరు పెద్దవాళ్ళూ కూడా ఆ పనికోసం నడుం వంచేరు.

★ ★ ★

రాత్రి భోజనాలకోసం వంటచేస్తూ వుంటే ప్రెసిడెంటూ, అతనితోపాటు ఇంకా చాలా మంది వ్యక్తులూవచ్చేరు.

దాదాపు అందరూ తప్పతాగి ఉన్నారని తెలుస్తూనే వుంది.

అయినా ఎవరూ ఒక్క అసందర్భపు మాట కూడా మాట్లాడకపోవటం చూసి ఆశ్చర్యపోయేడు విద్యాసాగర్.

చాలాసేపు అవీ ఇవీ మాట్లాడి వెళ్లిపోయారు. వాళ్లు వెళ్లిపోయేముందు విద్యాసాగర్ స్కూలు రికార్డుల గురించి ప్రెసిడెంటునడిగేరు.

ఆ రికార్డులేవీ తన వద్ద లేవని చెప్పాడు అతను.

"బహుశా ఈ నీలకంఠం వాటిని తన ఇంట్లో పెట్టుకునివుంటాడు. వాటికేం తొందర లేదు. చెప్పానుగా? సెంటర్ క్లాసు మీటింగుకి వెళ్లినప్పుడు ఎలాగూ ఛార్జి ఇస్తాడు. అప్పుడే రికార్డులు స్వాధీనం చేసుకోవచ్చు" చెప్పాడు జానకేశ్వరరావు.

"స్కూలు పాక బాగుచేయిస్తే..." ప్రెసిడెంటువేపు చూస్తూ జనాంతికంగా అన్నాడు విద్యాసాగర్.

"చూద్దాంలే..." అనేసి వెళ్లిపోయేడు ప్రెసిడెంటు. మిగతావారు అతన్ని అనుసరించేరు.

ఆ తర్వాత ఇద్దరూ భోజనాలకి కూర్చున్నారు. లాంతరు వెలుగులో భోజనం చేస్తూ జానకేశ్వరరావు రికార్డుల గురించి విపులంగా వివరించి చెప్పసాగేడు. "ముందీ విషయం జాగ్రత్తగా విను. మనం మెయింటైన్ చేయాల్సిన రికార్డుల్లో కొన్ని ముఖ్యమైనవి ఉన్నాయి. పిల్లల అడ్మిషన్ రిజిష్టర్లు, పే బిల్ రిజిష్టరూ వాటితోపాటు హాజరుపట్టీలు... ప్రమోషన్ లిస్టులూ తప్పనిసరిగా ఉండాలి. ప్రతినెలా జీతం బిల్లులు మనమే తయారుచేసి ఎమ్.యీ.వోకి అందించాలి. జీతం బిల్లు పంపించడానికి ముందు ఎమ్.ఆర్.పి. సబ్మిట్ చెయ్యక తప్పదు..."

"ఎమ్.ఆర్.పీనా! అంటే?"

"అంటే మంత్లీ రిటర్న్ పర్టిక్యులర్స్ అని. అసలు కాకుల లెక్క దీంతోనే మొదలవుతుంది!" నవ్వేడు జానకేశ్వరరావు.

"అంటే?" అర్థం కానట్టు ముఖం పెట్టేడు విద్యాసాగర్. అతనికిప్పుడు ఎంచేతో ఒంట్లో కొంచెం నలతగా ఉన్నట్టనిపిస్తోంది. వంట్లో ఏదో చికాగ్గా వుంది. అయినా ఆ సంగతి

బయటపెట్టడం ఇష్టం లేకపోయిందతనికి. ఇబ్బందిగా అనిపిస్తున్నా అతని మాటలు వినసాగేడు.

"అంటే మరేంకాదులే. ఊళ్లో చదువుకున్న వాళ్లెంతమంది? చదువురాని వారెందరు? అందులో ఆడవాళ్లెందరు? మగవాళ్లెందరు? చదువుకునే వయసువచ్చిన వాళ్లెందరు? చదువుకునే వయసు వచ్చినా బడికిరాని వారెందరు? మళ్లీ అందులో ఆడపిల్లలెంత మంది? అబ్బాయిలెందరు..."

"ఆపావు! చాలు... ఏవిటీ లెక్కలు?"

"చెప్పేనుకదా, కాకుల లెక్కలని!"

"అబ్బ! చంపక ఇదంతా ఎందుకో కాస్త అర్థమయ్యేలా చెప్పా" విసుగ్గా అడిగేడు విద్యాసాగర్.

"నిజానికి ఈ ఎమ్.ఆర్.పి.లు పంపించాలనే నిబంధనలు విద్యాశాఖాధికారులు, ప్రభుత్వం చాలా జాగ్రత్తగా ఆలోచించే పెట్టేరు. వాటివల్ల విద్యావిషయకంగా గ్రామపరిస్థితి, అక్షరాస్యతను పెంచడానికి తీసుకోవలసిన చర్యలు గురించి ఒక అంచనాకీ, అవగాహనకీ రావడానికి ఆ మంత్లీ రిటర్న్లు చాలా దోహదం చేస్తాయి"

"మరిందాక ఏదో కాకుల లెక్కన్నావు?"

"చెప్తాను. సదుద్దేశంతో ప్రవేశపెట్టబడే ఏ ప్రణాళికలనయినా నీరుకార్పించెయ్యడమూ, ఆచరణలో పక్కతోవ పట్టించడమూ అంతటా జరుగుతోంది. అదే మన దౌర్భాగ్యం. అలా చేసేపనికి ఏవో అవకతవక సమర్థింపులు, కుంటిసాకులు చెప్పుకోవడం చాలామందికి అలవాటు. ఇందులో నాక్కూడా ఏమీ మినహాయింపులేదు"

చెప్పదలుచుకున్నది సూటిగా చెప్పే ఆ గుణమే జానకేశ్వరరావులో తనని ఆకర్షించింది. మెచ్చుకోలుగా అతనివేపు చూశాడు విద్యాసాగర్.

"ఇక్కడా అంతే జరుగుతోంది. ఏ ఉద్దేశాలతో ప్రతినెలా అలాంటి రికార్డు సబ్మిట్ చేయాలని ఆదేశించేరో, ఆ ఉద్దేశాలు నెరవేర్చాలన్న చిత్తశుద్ధి ఇటు చాలామంది ఉపాధ్యాయుల్లోనూ ఉండదు. అటు అచ్యుతరావు లాంటి అధికారుల్లోనూ వుండదు. ప్రతినెలా ఎమ్.ఆర్.పి.లను వీళ్లు ఏవో కాకుల లెక్కలతో నింపి పంపించెయ్యడం- ఎలా పంపించినా పైవాళ్ళకి ఏమీ పట్టకపోవడం- ఒక్కసారి కూడా సరిగా, పనిచేయాల్సిన స్కూళ్లు ఉన్న గ్రామాలకి రానివారు కూడా ఆ రికార్డు ఠంచనుగా నింపి పంపించేస్తున్నారంటే అది కాకుల లెక్క కాదంటావా? ఉదాహరణకి నేను ఇవాళ్టివరకూ కూడా కొండంగి గ్రామం ముఖం చూసెరుగను. నెలనెలా జీతాలు మాత్రం తీసుకుంటున్నాను. నేను ఎమ్.ఆర్.పి.లను ఎలా పంపగలుగుతున్నానో ఒక్కసారి ఊహించు..."

మరొకదశలో అయితే జానకేశ్వరరావు ఇలాంటి మాటలంటున్నందుకు చెప్పలేని ఆగ్రహం కలిగేది విద్యాసాగర్కి. ఇప్పుడతనితో మరింత చనువు కూడా ఏర్పడింది కనుక తిట్లతో దులిపి వదిలిపెట్టేవాడు.

కాని- బడి ముఖం చూడనైనా చూడకుండా జీతాలు తీసుకుంటున్నానని అతను చెప్పడంలో- తన అవినీతిని నిజాయితీగా ఒప్పేసుకుంటున్న అతిశయం ఏదీ కనిపించడంలేదు. ఉన్న విషయాన్ని సూటిగా చెప్పే మనస్తత్వం మాత్రమే కనిపిస్తోంది.

"జానకేశ్వర్... నిన్ను... నిన్ను... చాలా రిపేర్ చేయాలయ్యా... ముఖ్యంగా నీ మెదడుని!" నవ్వుతూ అన్నాడు విద్యాసాగర్.

అతని మాటలతో పకపకా నవ్వాడు జానకేశ్వరరావు. ముద్ద నోట్లోనే వుండగా నవ్వడం ప్రారంభించేడేమో పొలమారింది. కళ్లంట నీళ్లుతిరిగాయి. తమాయించుకోడానికి తబ్బిబ్బు అయిపోయేడు. మంచినీళ్లు గడగడా తాగి, ఓ క్షణం తర్వాత కుదుటపడ్డాడు.

ఆ తర్వాత అన్నాడు. "ఇవాళ ఉదయం, సాయంత్రం కూడా బడిదగ్గర నువ్వు గడ్డిమొక్కలు పీకడం ప్రారంభించినప్పుడే అనుకున్నానులే- నీ బుర్రలో ఇలాంటి రిపేర్లు చేసే ఆలోచన ఏదో ఉందని! అయితే నీ రిపేరింగ్ వర్క్ ముందు నాతోనే ప్రారంభించదలిచేవన్న మాట"

"అంతేకదూ మరి!" నవ్వుతూ అనేసి చెయ్యి కడుక్కున్నాడు విద్యాసాగర్.

మాటల ధ్యానలోపడి అతను సరిగా




భోజనం చెయ్యలేదనీ, ఏవో నాలుగుమెతుకులు తిని అంతసేపూ అన్నం కెలుకుతూ కూర్చున్నాడనీ జానకేశ్వరరావు గమనించనేలేదు.

భోజనాలయ్యేక పడుకోబోయేముందు "అయితే మరి... నేను రేపు ఉదయాన్నే మన ఊరు బయల్దేరి వెళ్లిపోతాను. ఇక్కడ నీకంతా సదుపాయంగా ఉన్నట్టేకదా?"

"ఊఁ..." జవాబుగా అని, అంతలోనే నిద్రలోకి జారిపోయాడు విద్యాసాగర్.

నిద్రపోతున్న స్నేహితునివేపు ఆపేక్షగా చూస్తూ మరి కాసేపటికి తనూ నిద్రకి ఉపక్రమించేడు జానకేశ్వరరావు.

★ ★ ★

మర్నాడు ఉదయం జానకేశ్వరరావు ఊరెళ్లిపోయాడు.

ఒంటరితనం ఆవహించినట్టయింది విద్యాసాగర్ని. ఇప్పటివరకూ తనవెంటే వుండి నవ్వుతూ నవ్విస్తూ ఏవేవో కబుర్లు చెప్తూవుండే జానకేశ్వరరావు ఇక్కడ లేనిలోటు స్పష్టంగా తెలుస్తోంది.

ఇక తనీ ఊళ్లో వంటరిగా గడపాలి. చదువుకోడానికి పుస్తకాలు కూడా తన దగ్గర ఏవీలేవు. 'ఈసారి ఊరెళ్లినప్పుడు తెచ్చుకోవాలి' అనుకున్నాడు.

మరో మూడురోజులు గడిచేయి.

ప్రెసిడెంటూ, అతని మనుమలూ వచ్చిపోతున్నారు. వాళ్లు తనతో ఉన్నంతసేపూ ఏదోరకంగా ఓ మోస్తరు కాలక్షేపం జరిగిపోతోంది. ఆ తర్వాత మళ్లీ మామూలే. అంతా శూన్యంగా కనిపిస్తుంది. ఒంటరితనం నీడలా వెంబడిస్తున్నట్టు వుంటుంది. కనీసం తనతోపాటు ఓ రేడియో కూడా తెచ్చుకోలేకపోయాడు, తను.

వండుకోడం, తినడం, కాసేపు అలా బడివేపు వెళ్లిరావడం అంతే.

స్కూలు విషయమే ఆందోళనగా ఉంది విద్యాసాగర్కి. పాక నిలబెట్టి స్కూలు బాగుచేయించే ఆలోచనే ప్రెసిడెంటకి ఇంకా రావడంలేదు. తను ఆ ప్రస్తావన తెచ్చినప్పుడల్లా ఏదో చెప్పి మాట దాటించేస్తున్నాడు.

కనీసం హాజరు పట్టీలయినా తన దగ్గర లేకపోవడంవల్ల ఎవరి పిల్లలు చదువుతున్నారో, ఏ పిల్లలు ఏ తరగతిలో ఉన్నారో కూడా తెలీని పరిస్థితి. అంతా అగమ్యగోచరంగా ఉంది.

నీలకంఠం మేష్టార్ని కలిసి రికార్డు తెచ్చుకోనిదే ఈ సమస్య ఒక కొలిక్కి రాదు. ఒకవేళ తెచ్చుకున్నా అతను రాసిన హాజరుపట్టీలలో పేర్లు సరైనవే అయివుంటాయన్న నమ్మకం కూడా లేదు.

జానకేశ్వరరావు చెప్పినట్టు ఒకవేళ అవన్నీ కేవలం కాకుల లెక్కలేనేమో! చేతికొచ్చిన పేర్లు ఆయన రాసిపారేసేడేమో!

ఈ సమస్య ఎలా పరిష్కరించడం. ఎప్పుడూ బడిముఖం ఎరగని పిల్లల్ని బడికి వచ్చేలా చెయ్యడం ఎలాగా? ఈ ఊరికి చెందిన వాళ్ళ పిల్లలు కొందరు ట్రయబల్స్ కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన రెసిడెన్షియల్ పాఠశాలలో చదువుకుంటున్నారుట. వాళ్లు అయిదో తరగతివరకూ చింతలగూడెంలో సత్యం మేష్టారి దగ్గర చదువుకున్నారుట. తమ ఊళ్లో ఎలిమెంటరీ స్కూలు ఉంచుకుని కూడా పిల్లల్ని చింతలగూడెం పంపించి చదివించడం వాళ్ళకి అసహజమనిపించలేదు కాబోలు.

అయితే తమ ఊళ్లో బడి ఎప్పుడూ ఎందుకు మూసివుంటుందో ఏ మేష్టారూ వచ్చి ఎందుకు బడి తెరవడో వాళ్లు ఎప్పుడూ ఆలోచించినట్టులేదు.

ఆలోచించగలిగేవాళ్లకి ఆ విషయం పట్టదు.

విద్యాసాగర్ ఆలోచనలు మళ్లీ బడిచుట్టూ పరిభ్రమించసాగాయి. బడిని ఎలా బాగుచెయ్యడం! ఆ పని చెయ్యడానికి ప్రెసెడెంటునీ, వాళ్లనీ ఎలా సమాయత్తం చేయడం?

జానకేశ్వరరావు చెప్పిన మాటలు గుర్తొచ్చేయతనికి. నమ్మకం. వాళ్లలో ముందు నమ్మకం కలిగించాలి. అంతవరకూ వాళ్లు బడిపాక నిలబెట్టడంలో ఎలాంటి సాయం చెయ్యరన్న సంగతి స్పష్టమైపోతూనేవుంది.

ఒకసారి చింతలగూడెం వెళ్లి సత్యం మేష్టార్ని కలవాలి. అతని సలహాలు తీసుకోవాలి

అనిపించింది. ఈ మూడురోజులూ వెళ్లడానికి వీలుకాలేదు. ఏవో ఆలోచనలతోనే గడిపేశాడు. ఎవరి తోడయినా తీసుకుని రేపే అక్కడకి వెళ్లాలని నిశ్చయించుకున్నాడు విద్యాసాగర్.

ఈ మూడురోజులుగా అతని దినచర్య ఒక్కలాగే సాగిపోతోంది. ఉదయం లేవడం... వంట పూర్తిచేయడం బడి దగ్గరకెళ్లి ఆ పరిసరాలని తనకు చేతనయినంతలో శుభ్రం చెయ్యడం. పడిపోయిన పాక కర్రల్నీ, తాటి కమ్మల్నీ తీసి ఓ పక్కగా పెట్టడం.

ఇప్పుడీపనిలో పిల్లలు మరింత ఎక్కువ మంది అతనికి సాయం చెయ్యసాగారు. వాళ్లకీ పని వింతగా లేకపోయినా, ఉత్సాహంగా ఉన్నట్టుంది. 'బడి చెప్పే పంతులు'తో కలిసి పనిచెయ్యడం వాళ్ళకి సంతోషాన్ని కలిగిస్తోంది.

పని చేస్తున్నంతసేపూ అతను చదువుతున్న పద్యాలూ, పాడుతున్న పాటలూ వాళ్లకెంతో నచ్చుతున్నాయి. ఇప్పుడు వాళ్లలో చాలా మంది విద్యాసాగర్ దగ్గర చనువుగా ఉండగలుగుతున్నారు.

వాళ్ళతనికి ఎంత దగ్గరయ్యేరంటే- వాళ్లలో పొడుగ్గా ఉన్న కుర్రాడు విద్యాసాగర్ కోసం తాగడానికి 'విప్పకల్లు' కూడా తెచ్చిపెట్టాడు.

విద్యాసాగర్ ముందు బిత్తరపోయి, తర్వాత వద్దని సున్నితంగా తిరస్కరించేడు. తనకి అలవాటు లేదని వాళ్లకి అర్థమయ్యేలా వివరించి చెప్పాడు. అది ఆ పిల్లలకి మరింత ఆశ్చర్య జనకమయింది. అతనిపట్ల శ్రద్ధాసక్తులు పెరగడానికి మరింత తోడ్పడింది. ఇప్పుడు విద్యాసాగర్‌కి ఆ పిల్లలు మాట్లాడే భాషలోని యాస కొంచెం బాగానే అర్థమవుతోంది.

ఎవర్నో అడిగి గడ్డపార తెప్పించేడు. దాంతో అతని పని కొంచెం సులువయింది. పాక చుట్టూ ఉన్న పరిసరాలని పిచ్చిమొక్కల్లేకుండా చదును చేసేపని పూర్తయింది.

కొత్తగా పాకవేసి నిలబెట్టడానికి పెద్దవాళ్ల సహాయం లేందే జరగనివని.

కానీ, ఇంత జరుగుతున్నా ఎవరో ఒకరిద్దరు వ్యక్తులు తప్ప, మిగతావాళ్లు- ముఖ్యంగా ప్రెసిడెంటూ, అతని మనుమలూ ఆ ఛాయలకే రాకపోవడం అతనికి కష్టం కలిగిస్తోంది.

తిండీ తిప్పలకి ఏ లోటూలేదు. ఏదో ఇంత వుడకేసుకుని తింటున్నాడు. పిల్లలూ, చుట్టుపక్కల పెద్దలూ తన కోసం వేరుసెనక్కాయలూ, చెరుకుగడలూ, అరటిపళ్లూ ఇలాంటివే ఏవో తెచ్చిపెడుతున్నారు. వద్దని ఎంత చెప్తున్నా వాళ్లు వినడంలేదు.

కానీ తిండికోసమే కాదుకదా తనిక్కడకి వొచ్చింది. విద్యాసాగర్‌కి బడి గురించిన ఆలోచనలతో తల వేడెక్కిపోతోంది ఒక్కోసారి.

మూడోరోజు రాత్రి ప్రెసిడెంటు అతని పాకకి వచ్చి "బడి బాగుసేస్తున్నావుట? బిడ్డలు నీ గురించి చెప్పేరులే. సరే బడిపాక రేపు బాగు చేయిస్తాను. తాటికమ్మలూ, కర్రలూ కొట్టుకురమ్మని రేపు పెందిల మనుమల్ని తోల్తాను. రేపు మద్దేనేనికల్లా ఆళ్లు బడికడతారు. బడి బాగా సెప్పాల. తెల్సిందా!" అన్నాడు.

అతని మాటలు విని ఆనందంతో పొంగిపోయాడు విద్యాసాగర్. సంతోషంతో తలూపాడు.

జానకేశ్వరరావు తనతో రెండ్రోజులు గడిపి వెళ్లిపోయాక ఈ మూడురోజుల్లోనూ తను నిండుగా, హాయిగా నవ్వగలిగింది ఇప్పుడే!

మర్నాడు రూపుదిద్దుకోబోయే బడిపాక గురించే ఆలోచిస్తూ అతనికి ఆ రాత్రి తిండి సరిగా సహించలేదు. కానీ అలా తిండి సహించకపోవడానికి మరో కారణం కూడా వుందని అతనికి ఆ రాత్రి చాలాసేపటికిగాని అవగతం కాలేదు.

జానకేశ్వరరావు బయల్దేరి వెళ్లిపోవడానికి ముందురోజు రాత్రి ఒంట్లో ఎలాగయితే నలతగా వున్నట్టు అనిపించిందో, ఇవాళ కూడా అలాగే ఒంట్లో ఏదో చికాగ్గా ఉన్నట్టనిపిస్తోంది. అయితే అప్పుడు నిద్రలో తగ్గిపోయింది. ఇప్పుడు రానురాను ఎక్కువ అవుతోంది. జ్వరం వస్తున్నట్టుగా అనిపించింది.

లాంతరు వత్తి తగ్గించి దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. కళ్లు మంటగా భారంగా మూతలు పడుతున్నాయి. అలా ఎంతసేపు పడుకున్నాడో ఒక రాత్రివేళ అతనిలో విపరీతమయిన చలి వణుకు మొదలయ్యాయి. మనిషిని ఎవరో కుదిపి కుదిపి వదిలేస్తున్నట్టుగా

భరించలేనంత చలితో వణికిపోసాగేడు.

అర్ధరాత్రి దాటేవేళకి ఆ జ్వరతీవ్రత తట్టుకోడానికి వీల్లేనంతగా పెరిగిపోయింది.

మనిషి స్పృహ కోల్పోయాడు.



మర్నాడు సాయంత్రం ఏడుగంటల ప్రాంతంలో కానీ విద్యాసాగర్ స్పృహలోకి రాలేకపోయాడు. ఒళ్లు చితక్కొట్టినట్టుగా నొప్పులుగా వుంది. మగత ఇంకా పూర్తిగా వదల్లేదు. ముందురోజు రాత్రి జ్వరం రావడం- శరీరంలో చలి మొదలై క్రమేపీ వంట్లో వణుకు ఎక్కువై ఒకదశలో విపరీతంగా వణికిపోవడం మాత్రమే అతనికి లీలగా గుర్తుంది. ఆ తర్వాత ఏం జరిగిందో అతనికి తెలిసిరాలేదు. ఇంత తీవ్రమయిన చలీ, జ్వరం లోగడ ఎప్పుడూ తెలీదతనికి. ఒక్కరోజులో మనిషి సగానికి సగం నీరసించిపోయాడు.

మగతగా రెప్పలు పైకి లేవడంలేదు. ప్రయత్నం మీద కళ్లు తెరవగలిగేడు.

అతను కళ్లు విప్పి చూసేసరికి కనిపించిన దృశ్యం అతనిని అంతులేని ఆశ్చర్యంలో ముంచెత్తివేసింది.

పులిపుట్టులో తన పాకలో లేడు.

అయోమయంగా చుట్టూ చూసి, తనిప్పుడు వెదుళ్ళవలస ప్రెసిడెంటు కామయ్యగారింట్లో ముందుగదిలో ఉన్నట్టు అర్థం చేసుకోగలిగేడు.

తనిక్కడికి ఎలా వచ్చేడనలు! ఎవరు తీసుకుని వచ్చేరు? అతనికి అంతా వింతగా అనిపిస్తోంది. ఏమీ అర్థం కావడంలేదు.

మగతగా మళ్లీ ఓ క్షణం నిద్రలోకి జారిపోయి మెళకువ తెచ్చుకుని చూస్తే తనవేపే ముఖంలోకి చూస్తూ కనిపించేడు ఓ యువకుడు.

అతను తెల్లషరాయి, లాల్చీ వేసుకుని ఉన్నాడు. చామనఛాయలో ఒకింత పొడుగ్గా ఉన్నాడు. ఇంతకుముందెప్పుడూ అతనితో తనకి పరిచయంలేదు. ఎవరో మరి!

ఆ పక్క గదిగుమ్మం దగ్గర నుంచుని కబుర్లు చెప్పుకుంటున్న కామయ్యా, సన్యాసమ్మలు విద్యాసాగర్‌కి మెలుకువ రావడం గమనించి ఆతృతగా అతను పడుకున్న మంచం దగ్గరకి వచ్చేరు.

"నేను... నేను ఈ ఊరెలా వచ్చేను?" ఎక్కడో అగాధంలోంచి మాట్లాడుతున్నట్టుంది విద్యాసాగర్ గొంతు.

ప్రెసిడెంటు కామయ్యా చెప్పిన వివరాలన్నీ విన్నాక ఆశ్చర్యపోయాడు. కొన్ని క్షణాలసేపు అతని నోరు మరి పెగల్లేదు.

జ్వరతీవ్రతతో ఒంటిమీద తెలివితప్పి పడి వున్న తనని పులిపుట్టు ప్రెసిడెంటు తన మనుషులచేత వైద్యంకోసం ఇక్కడికి చేర్పించేడుట! ఆ మనుషులు తను పడుకుని వున్న మంచానికి రెండువేపులా బలమైన కర్రలు కట్టి డోలీలాగా అవలీలగా కొండదిగి ఇన్ని మైళ్ల దూరమూ తీసుకొచ్చేసారుట. అడవి జంతువుల వాతబడి గాయపడ్డవాళ్ళనీ, జబ్బుతో కదల్లేనిస్థితిలో వున్న వాళ్లనీ అలా తీసుకరావడం వాళ్ళకి కొత్తేమీ కాదుట!

విద్యాసాగర్ గుండె పులిపుట్టు ప్రజలమీద కృతజ్ఞతాభావంతో బరువెక్కిపోయింది. గుండెలోనుంచి దుఃఖం తన్నుకొచ్చింది. వెచ్చటి కన్నీళ్లు చెంపలమీద ధారగా కారసాగేయి.

ఆ తర్వాత కామయ్యా విద్యాసాగర్‌కి- ఆ పక్కన తనవేపే చూస్తూ నిల్చున్న యువకుడ్ని పరిచయం చేశాడు.

"అతను సత్యం... సత్యం మాష్టారు! చింతలగూడెం స్కూల్లో టీచరు."

"మీరా!" ఆశ్చర్యంతో చేతులు జోడించి నమస్కరించడానికి ప్రయత్నిస్తూ అన్నాడు విద్యాసాగర్.




"నా పేరు సత్యం... సత్యమూర్తి. చింతలగూడెంలో రెండేళ్ళుగా పనిచేస్తున్నాను. పులిపుట్టు స్కూల్లో మిమ్మల్ని వేసేరనీ, జాయనయ్యేందుకిక్కడికి వొచ్చేరని ఎవరో చెప్తే తెలిసింది. వచ్చి కలుద్దామనుకున్నాను. కానీ ఇవాళ ఉదయంవరకూ వీలుకాలేదు. పనుండి సెలవు పెట్టి మా ఊరికి వెళ్తూ దారిలో మిమ్మల్ని కలిసివెళ్దామని పులిపుట్టు వచ్చేను. తీరా అక్కడికొచ్చేసరికి మీ పరిస్థితి దారుణంగా వుంది. జ్వరంలో ఒళ్లెరక్కుండా పడుకునివున్నారు. అప్పటికే పులిపుట్టు ప్రెసిడెంటు శివన్నదొర మిమ్మల్ని ఈ ఊరికి పంపించే ఏర్పాట్లలో ఉన్నాడు. మిమ్మల్ని మంచంమీదవేసి వాళ్లిక్కడికి తీసుకొచ్చేరు. సుమారు పదిమంది మనుషులొచ్చేరు మిమ్మల్ని తీసుకుని. ఒళ్లెరగనిస్థితిలో మిమ్మల్ని చూసి నాకూ కంగారు కలిగింది. వాళ్ళతోపాటే నేనూ వచ్చేను. ఇప్పుడు మీ ఒంట్లో ఎలా వుంది? జ్వరం దిగజారిందికదూ?"

అతను చెప్పిన సంగతులు విని చలించిపోయాడు విద్యాసాగర్. అంత దూరంనుంచి వాళ్లు తననిక్కడికి తీసుకురావడం కూడా తనకి తెలియలేదంటే ఆశ్చర్యం వేస్తోంది. తనకోసం అంతగా శ్రమించిన ఆ వ్యక్తులను తలుచుకుంటూ అతను విచలితుడవుతున్నాడు.

అతను తిరిగి చెప్పడం ప్రారంభించేడు. "ఇక్కడికి తీసుకొచ్చేక మీ వాళ్లకి కబురుపెట్టడం జరిగింది. మీ నాన్నగారు గాభరాపడుతూ వచ్చేశారు. ఈ విషయం తెలిసి మీ అమ్మగారు ఒకటే ఏడుపుట- ఆమెని ఓదార్చి, ధైర్యం చెప్పి వచ్చేసరికి చాలా కష్టమైపోయిందిట. అన్నట్టు మీ నాన్నగారితోపాటు జానకేశ్వరరావు అని కొండంగి స్కూలు టీచరుట. అతనూ వచ్చేడు. అతను మీతోపాటు పులిపుట్టు వచ్చి రెండ్రోజులుండి వెళ్లేడుటకదా! వాళ్ళ కంగారు చెప్పలేను! కామయ్యగారు డాక్టర్ని పిలిపించి ఇంజక్షన్లు చేయించేరు. మీకిప్పుడు నిమ్మళంగా ఉందికదా! డాక్టరు ధైర్యం చెప్పేక మీ నాన్నగారూ, జానకేశ్వరరావు మీ ఊరెళ్లారు. మళ్లీ ఈ రాత్రి ఆఖరి బస్సులో వస్తామని చెప్పి వెళ్లేరు. మీకు స్వస్థత ఏమాత్రం చిక్కినా రేపు ఉదయం ఇంటికి తీసికెళ్తామని అన్నారు"

అతని మాటలు విని దుఃఖంతో కుమిలిపోయాడు విద్యాసాగర్. అందర్నీ ఎంత కంగారు పెట్టేశాడు తను!

"మీ... మీ అందరి రుణం ఎలా తీర్చుకోగలను?" అతనికి ఏడుపు ఆగడంలేదు.

"ఛ! ఊరుకోండి విద్యాసాగర్... ఇప్పుడేమయిందని మరీ అంత సున్నితంగా ఆలోచిస్తే కష్టం..."

ఆ తర్వాత అతని స్కూలు గురించీ, అతని గురించీ ఎన్నో వివరాలు అడగాలనుకున్నాడు విద్యాసాగర్. కానీ ఒంట్లో నీరసం అతన్ని అట్టేసేపు మాట్లాడనివ్వలేదు.

ఈలోగా సన్యాసమ్మ హార్లిక్స్ కలిపి తీసుకొచ్చింది. కామయ్య మంచం దగ్గరకొచ్చి అతని శరీర పరిస్థితిని గురించి అడిగేడు.

"ఈవిడ మీకు ఉదయంనుంచీ చేసిన సపర్యలను మాటల్లో చెప్పడం కష్టం. మీ గురించి ఒకటే ఆందోళన పడిపోయారు" సన్యాసమ్మని ఉద్దేశించి విద్యాసాగర్‌తో అన్నాడు సత్యం.

విద్యాసాగర్ ఆవిడవేపు కృతజ్ఞతాసూచకంగా చూశాడు. చేతులెత్తి నమస్కరించబోయాడు.

ఆవిడ వారిస్తూ- "మంచేడివే- నేనేటి సేసినాను. లచ్చింవోరం పెందిల కనిపించి ఎల్లినోడివి, మల్లజెరంతో వొల్లెరక్కుండా- ఆల్లు నిన్నిక్కడకి తీసుకొస్తే వొచ్చినావు. మాయదారి జెరం ఎలపింటోడివి ఎలగమైపోయేవో సూడు! మీ అమ్మయితే సెయ్యాదా! ఆయమ్మ నీకోసం ఎంత బెగిలిపోతోందో యేటో... ఆడికి ఎల్లొద్దని సెప్తే ఇనుకోనేదుటగదా..." అందామె.

ఆవిడ అందించిన హార్లిక్స్ అతికష్టంమీద తాగి గ్లాసు తిరిగి అందించేడు.

తర్వాత అవీ ఇవీ మాట్లాడి మళ్లీ కలుస్తానని చెప్పి సత్యం వెళ్లిపోయాడు. కాసేపు కునుకు తీయమని చెప్పి ప్రెసిడెంటు కూడా ఏదో పనిమీద వీధిలోకెళ్లాడు.

విద్యాసాగర్ కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు. జ్వరతీవ్రత బాగా తగ్గింది. ఇప్పుడు టెంపరేచరు లేనట్టేవుంది. నీరసం మాత్రం చాలా అధికంగా వుంది. శరీరం ఇంకా స్వాధీనంలోకి రావడంలేదు. జ్వరంవల్ల నోరంతా అరుచిగా వుంది. తల భారంగా వుంది.

ఈ సమయంలో తనకి ఇలా జ్వరం ముంచుకురావడం అతనికి విచారంగా వుంది.

ఎవరెన్నివిధాల చెప్పినా వినకుండా పట్టుదలగా అక్కడికెళ్ళేడు తను. అక్కడి ప్రజల ఆదరణ తనని ముగ్ధుణ్ని చేసింది.

'పల్లెప్రజలు ఒకపట్టాన నమ్మరు. నమ్మితే మరింక వదిలిపెట్టరు. అవసరమయితే ఎంత సహాయం చెయ్యడానికయినా సంకోచించరు.

ఉన్నట్టుండి అతనికి తన చిన్ననాటి సంఘటన ఒకటి గుర్తొచ్చింది.

అప్పటికింకా తన తండ్రికి కోర్టులో ఉద్యోగం రాలేదు. ఏవో చిల్లర మల్లర ఉద్యోగాలు చేస్తుండేవారు. అప్పటికి తనూ అక్కయ్యా చిన్నవాళ్లం... శాంతీ, వెంకూ ఇంకా పుట్టలేదు. తను నాలుగోతరగతి చదువుతూ ఉండేవాడు. రోజులు గడవడం కూడా కష్టంగా ఉండేది. తనకొచ్చే వందా, యాభయ్‌తో సంసారం గడవడం సాధ్యంకాక అమ్మతోపాటు తననీ, అక్కనీ సీతారాంపురంలో అచ్యుతాంబ అత్తయ్యగారింటికి పంపించేశారు నాన్న. అప్పుడప్పుడు ఆయన వచ్చిపోతూండేవారు. సీతారాంపురం చాలా చిన్న పల్లెటూరు. మేనత్త అచ్యుతాంబగారి భర్త అక్కడే వ్యవసాయం చేసుకుంటూ వుండేవారు. పొలం ఏమంత ఎక్కువగా లేకపోయినా, తిండిగింజలకి లోటు లేకుండా ఉండేది. ఇంతలో ఆయన జబ్బుచేసి, అర్ధాంతరంగా చనిపోవడం జరిగింది. అచ్యుతాంబగారు మరోచోటుకి ఎక్కడకీ వెళ్లడానికి సుతరామూ ఇష్టపడలేదు. ఆ పల్లెటూరులోనే వ్యవసాయంమీద వచ్చే కొద్దిపాటి ఫలసాయంతో అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించుకున్నారు. టౌనులో ఖర్చులకి తట్టుకోలేక మరో దారి ఏది కనిపించక ఆమె కూడా అక్కడికి చేరుకోక తప్పలేదు. ఓ రెండేళ్లు ఆ ఊళ్లోనే గడపాల్సివచ్చింది.

మొదట్లో కొన్నిరోజులు ఆవిడ బాగానే చూసుకునేది. వచ్చినప్పుడల్లా తన తండ్రి ఎంతో కొంత డబ్బు తెచ్చి ఆవిడ చేతిలో పెట్టేవారు. ఆవిడ వద్దనకుండా తీసుకునేది.

ఆ రోజుల్లోనే ఒకరోజు సాయంత్రం పెరట్లో తులసిమొక్క దగ్గర తల్లీ తండ్రీ మాట్లాడుకోవడం తన చెవినపడింది. ఆ సమయంలో మేనత్త గుడిలో ఎవరో పురాణం చెప్తున్నారంటే వినడానికి వెళ్లింది.

ఆ సంజచీకట్ల వెలుగులో అమ్మా నాన్నా మాట్లాడుకున్న ఆ దృశ్యం- ఎన్ని సంవత్సరాలు గడిచినా తన మనసుమీద బలంగా ముద్ర వేసి చెరిగిపోలేదు.

"మా అక్కయ్య నిన్నూ పిల్లలనీ సరిగా చూసుకుంటోంది కదూ?" అడిగేరు నాన్న.

"ఊ... ఆవిడ బాగానే చూసుకుంటున్నారండీ..."

"నీకిక్కడ మరేమీ ఇబ్బంది లేదుకదా?"

"లేదండీ. మీరు మనసు ఊరికే పాడుచేసుకోకండి. మాకిక్కడ బాగానే ఉంది."

కాస్సేపు మౌనం తర్వాత నాన్న అన్నారు, "ఏమిటో పార్వతీ! నిన్నూ పిల్లలనీ ఇక్కడ పెట్టవలసిరావడం నాకు చాలా బాధగా ఉంది. కాని ఏం చెయ్యడం నాకింకా సరైన ఉద్యోగమేదీ కుదరలేదు. ఈ వచ్చే జీతంతో మనం ఊళ్లో గడపడం కష్టం... పిల్లల చదువులు చెడిపోతున్నాయి. మన పరిస్థితులు ఎప్పటికి చక్కబడతాయో ఒకపట్టాన అంతుచిక్కడంలేదు..."

ఆ చీకట్లో తను గమనించలేకపోయినా, నాన్న కళ్లంట నీళ్లు తిరిగేయని తనకెంచేతో అనిపించింది. నాన్న గొంతులో వినిపించిన దైన్యం తనకలా అనిపించడానికి దోహదంచేసిఉంటుంది.

తనకి ఏడుపొచ్చింది. దుఃఖం తన్నుకొచ్చింది. ఇదీ అని తెలియని బెంగ ఏదో తన చిన్న మనసుని చీకటిలా అలుముకుంది.

వెంటనే పరిగెత్తుకుని వెళ్లి అమ్మా నాన్నలను పట్టుకుని వాటేసుకుని తనివితీరా ఏడ్వాలనిపించింది. ఎందుకో అలా చెయ్యలేక




పోయాడు. తనక్కడ ఉన్నట్టు వాళ్లకి తెలీదు. తెలిస్తే అసలా సంభాషణ అలా వుండేది కాదేమో.

''మీరు వచ్చినప్పుడల్లా ఎంతో కొంత మీ అక్కగారి చేతిలో పెడుతున్నారు. అది తప్పని అనను. మమ్మల్ని ఇక్కడ ఉంచినందుకు ఎంతో కొంత యివ్వాల్సిందే. పాపం, ఆవిడ కూడా ఏమంత కలిగినావిడ కాదుకదా. కాని మీకొచ్చే కొద్దిపాటి సంపాదనలో మీరక్కడ ఏం తింటున్నారో, ఎలా ఉంటున్నారో, డబ్బు మిగిల్చి ఎలా తెచ్చి ఇవ్వగలుగుతున్నారో అన్నదే నా బెంగ. మా కోసం మీరక్కడ ఎన్ని ఇబ్బందులు పడుతున్నారో తెలియదు. అది తలుచుకుంటేనే భయం వేస్తోంది'' అమ్మ గొంతులో వేదన ధ్వనించింది.

అమ్మ మాటలు తనమీద చెప్పలేని ప్రభావాన్ని చూపించేయి.

ఆ చిన్నవయసులోనే తనకి దారిద్ర్యం తాలూకు విరాడ్రూపం కనిపించింది. లేమిలోని కాఠిన్యం బోధపడింది.

అన్నం తినకుండా నాన్న టౌన్లో పస్తులు పడుకున్న దృశ్యాలేవో ఊహకి వచ్చి కళ్ల ముందు కదలాడినట్లయింది. ఆ ఆలోచనే భరించలేకపోయాడు.

''ఛ... అదేమిటి పార్వతీ! ఎందుకలా అనుకుంటున్నావు? నాకేం ఫరవాలేదు. ఏ ఇబ్బందీ లేదు. అక్కడ నాకు సరిపోగా మిగిలిందే తెచ్చి మీకోసం అక్క చేతిలో పెడుతున్నాను. నువ్వు ఏవేవో ఊహించుకుని బాధపడకు'' నాన్న అమ్మని ఓదారుస్తూ చెప్పేరు.

అమ్మ నాన్నతో ఆవేళ అబద్ధమే చెప్పిందని తనకి తెలుసు. అయితే నాన్న మాటలు కూడా అబద్ధమే అయివుంటాయి.

ఎందుకంటే- మేనత్త తమనీ అమ్మనీ సరిగ్గా చూస్తోందనడం అబద్ధం. మొదటి కొద్దిరోజులూ ఏం చూసిందో అంతే! ఈమధ్య ఆవిడ తననీ, అక్కనీ ఊరికే ఆడిపోసుకొంటోంది. అమ్మని ఏదో కారణంతో తిట్టిపోస్తోంది.

అమ్మ నాన్నతో ఇవేమీ చెప్పదేం! తనకా వయసులో అమ్మ ఎందుకా బాధలన్నీ చెప్పుకోలేదో అర్థం కాలేదు- కాని అవన్నీ చెప్తే నాన్న మరింత ఏడుస్తారనీ- టౌన్లో పచ్చి మంచినీళ్లు సైతం ముట్టుకోకుండా పస్తులుండి తమకోసం మరింత డబ్బు తెచ్చి ఇస్తారనీ- అందుకే చెప్పలేదని తను అనుకున్నాడప్పుడు.

మర్నాడు నాన్న వెళ్లిపోయారు. నాన్న ఊరెళ్లిపోయాక ఆయనిచ్చి వెళ్లిన డబ్బు గురించే మేనత్త ఇంట్లో పెద్ద గొడవ చేసింది. ఎందుకూ చాలదని అరుస్తూ తిట్టింది.

ఆ డబ్బు అమ్మ ముఖాన కొట్టడం తనకింకా బాగా గుర్తుంది. గుర్తొచ్చినప్పుడల్లా ఆ దృశ్యం ములుకులా తనని వేధిస్తూ ఉంటుంది.

అమ్మ ఏం మాట్లాడలేదు. ఆవిడ తిట్లన్నీ మౌనంగా భరించింది.

రోజులు గడిచేకొద్దీ ఆ ఇంట్లో తాము ఉండడం దుర్భరమైపోయింది. ఏదో విషయమై మేనత్త ఘర్షణకి దిగుతూనే ఉండేది.

అమ్మ కొండంత సహనం చూపించేది. ఆ స్థితిలో అమ్మని చూస్తే తనకీ అక్కకీ ఏడుపు ఆగేది కాదు.

రానురాను పరిస్థితులు ఎంతగా దిగజారిపోయేయంటే- ఒకరోజు రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో అమ్మ తమ యిద్దర్నీ తీసుకుని ఆ యింట్లోంచి బయటపడవలసి వచ్చింది.

ఆరోజు మేనత్త శివాలెత్తిపోడానికి కారణం తనే!

రాత్రిపూట వేడివేడి అన్నంకోసం వాచిపోయే తనకి చద్దన్నం పెట్టింది. ఒక కూరలేదు, పచ్చడిలేదు. కనీసం ఆవకాయ ముక్కయినా వెయ్యమని తను గోలపెట్టేడు, ఏడ్చి గీపెట్టాడు. కంచం విసిరి కొట్టేడు. మేనత్త విచక్షణ లేకుండా తనమీద చెయ్యి చేసుకుంది. గొడ్డుని బాదినట్టు బాదింది.

అప్పుడు మొదటిసారిగా అమ్మనోరువిప్పి మాట్లాడింది. ''పిల్లాడు నోరు తెరిచి ఏం అడిగేడని అలా బాదుతారు. ఆవకాయ ముక్క కోసం వాడి జిహ్వ ఎంత తహతహలాడుతోందో!'' అంది.

అంతే! మేనత్త చేతిలోని గిన్నెను నేలకేసి విసిరి కొట్టింది. పెద్దగా అరుస్తూ చిందులు

తొక్కడం ప్రారంభించింది. ఆవిడ కేకలు ఆ పల్లెటూర్లో మారుమ్రోగిపోయేయి. అందరూ యింటి ముందుకొచ్చి పోగయేరు.

"నా అన్నదమ్ములనుంచి నా ఖర్మానికి ఒక నాడూ ఓ మంచి గుడ్డముక్క అందుకుని ఎరుగను... ఓ పెట్టుపోతలు లేవు... బికారి వెధవల్లాగా నామీద లేనిపోని భారం పెట్టేవాళ్ళే తప్ప- ఓ అచ్చటా ముచ్చటా అని! నా బతుకులో పసుపు కుంకుమలు ఉన్ననాడే లేవు. మొగుడు చచ్చి నా ఏడుపేదో నేను ఏడుస్తూ ఉంటే ఇంటికి తీసికెళ్ళి ఆదరించాల్సింది పోయి- నీ మొగుడు యీ తద్దినమంతా పెట్టేడు. నా తమ్ముడికి లేకపోతే నీకయినా సిగ్గూ శరం ఉండాలి- అంత తాహతులేనివాడు పెళ్ళెందుకు చేసుకోవాలి. పిల్లల్నెందుకు కనాలి... చవటపీనుగ!"

అమ్మ తనని ఏం అన్నా సహించగలిగేదేమో కానీ, తనభర్త గురించి అంత అసహ్యకరంగా మాట్లాడుతూ ఉంటే మరింక భరించలేకపోయింది.

అక్కనీ తననీ వెంటబెట్టుకుని ఆ క్షణాన్నే ఆ గడపదాటి బయటికొచ్చేసింది.

ఆ రాత్రి వేళ- అనాథల్లా బయటపడిన తమను ఆ ఊరే ఆదుకుంది. ఎవరో ఆ రాత్రికి తమకి ఆశ్రయమిచ్చేరు. తినడానికి తిండి పెట్టేరు. అమ్మ కుమిలికుమిలి ఏడుస్తూ వుంటే స్వంత మనుమల్లా ఓదార్చేరు.

అప్పుడు...

జీవితంలో- అంత చిన్న వయసులోనే పల్లె ప్రజల ఆదరణలోని మాధుర్యాన్ని తొలిసారిగా చవిచూసేడు తను!

ఆరోజుల్లోనే జరిగిన మరో సంఘటన కూడా ప్రత్యేకించి ఉపాధ్యాయ వృత్తిపట్ల తను ఆకర్షితుడు కావడానికి బీజం వేసింది...

మేనత్త యింట్లోంచి వచ్చేసేక తాము ఆ గ్రామంలోనే ఉన్నారు. అమ్మ చిన్న పిల్లలకి ట్యూషన్లు చెప్పేది. అప్పు తెచ్చిన డబ్బుతో మిషను కొని బట్టలు కుట్టేది. అమ్మ సంపాదన నాన్న తెచ్చియిచ్చే డబ్బుకి వేణ్ణీళ్ళకి చన్నీళ్ళలా ఉండేది.

"తింటే తింటాం... లేదా పస్తులుందాం... పద అందరం అక్కడే ఉందాం" అని నాన్న తమని తన వెంట తీసుకుపోదామని నిశ్చయించుకుని అమ్మతో అన్నారు చాలాసార్లు.

కాని, అమ్మ ఒప్పుకోలేదు. "మీకు స్థిరమయిన ఉద్యోగం వచ్చేక అలాగే చేద్దాం... మంచికో చెడుకో యీ వూరొచ్చేం... ఇక్కడి మనుష్యులు ఎంతో ఔదార్యం చూపిస్తున్నారు. ఉండడానికి ఉచితంగా యిల్లు యిచ్చేరు... కష్టంలోనూ సుఖంలోనూ సాయం చేస్తున్నారు... కొన్నాళ్ళు పిల్లలతో యిక్కడే ఉంటాను" అంది.

అమ్మనీ, తమనీ తీసుకెళ్ళిపోడానికి గ్రామస్థులూ అంగీకరించలేదు. "ఆయమ్మ చదువుల తల్లిలా మా పిల్లలకి నాలుగక్షరాలు వచ్చేలా చేస్తోంది. వాళ్ళకి మంచీ మన్ననా నేర్పుతోంది... ఇక్కడే ఉండనివ్వండి... ఆ తల్లికీ, మీ పిల్లలకీ మేం ఏ లోటూ రానివ్వం" అని హామీయిచ్చేరు.

అలా ఆ ఊళ్ళో సుమారు రెండేళ్ళపాటు ఉండిపోయేరు.

అప్పట్లో తను... మేనత్తని చంపేద్దామా అన్నంత కసితో వేగిపోయేవాడు. అమ్మ రహస్యంగా పెట్టుకునే కన్నీళ్ళు పెనుఉప్పెనలా తనని ముంచెత్తివేస్తున్నట్టు విలవిలలాడిపోయేవాడు. ఏమీ చెయ్యలేని అశక్తతతో దహించుకుపోయేవాడు.

ఆ కోపం తను యింటికి ట్యూషనుకొచ్చిన పిల్లలమీద చూపించే వాడు. అమ్మ నోరు నొప్పిపెట్టేలా వాళ్ళకి పాఠాలు చెప్పవలసి రావడానికి కారణం మేనత్తే కదా అని తన పసిమనసుకి అనిపించేది. మేనత్తమీద ద్వేషం అమ్మ కష్టపడేలా చేస్తున్నారని ఆ పిల్లలమీదకి తిరిగేది.

అకారణంగా వాళ్ళతో ఏవో తగువులు తెచ్చుకునేవాడు. వాళ్ళు "అ...అమ్మ ఆ... ఆవు" అని చదువుతూ ఉంటే పెంకితనానికి అలా చదవ కూడదని అమ్మ అక్కడ లేకుండా చూసి- వాళ్ళతో వాదన పెట్టుకునేవాడు.

అ... అంటే అన్నం, ఆ... అంటే ఆకలి అని ఓ సారి... అ... అచ్యుతాంబ... ఆ అంటే ఆడదెయ్యం... పిశాచం... రాక్షసి... అంటూ అలా చదవమని వాళ్ళని వేధిస్తూ ఉండేవాడు తను.





వాళ్ళు తలలు అడ్డంగా వూపి తను చెప్పినట్టు చదవడానికి నిరాకరించే వాళ్ళు. "మేం చదవం... మాష్టారమ్మ చెప్పిందే రైటు అలాగే చదువుతాం" అనేవాళ్ళు.

తనకి తిక్కరేగేది. పిచ్చి ఉద్రేకమేదో కట్టలు తెంచుకునేది. వాళ్ళతో ఘర్షణకిదిగేవాడు.

ఆ తగువులు అలా ముదిరిముదిరి ఓరోజు వాళ్ళతో యుద్ధానికి దిగేడు. వాళ్ళతో కలబడి అందిన వాళ్ళని కొట్టడం ప్రారంభించేడు. వాళ్ళు గోలగోలగా ఏడుస్తూ ఉంటే అమ్మ లోపలినుంచి పరిగెత్తుకొచ్చింది. తమని విడదీసి సంగతంతా తెలుసుకుంది.

ఫలితంగా ఆరోజు తనవీపు విమానంమోత మోగిపోయింది ఒక్కసారి కూడా తన వొంటి మీద చెయ్యి చేసుకోని అమ్మ ఆ వేళ తనని పిచ్చికోపంతో బాదేసింది. జుత్తుపట్టుకుని వంచేసి చెంపలు ఎడాపెడా వాయించేసింది. వీపు వగలకొట్టింది.

అమ్మలో అంత ఉద్రేకం అంతకుముందెప్పుడూ తను చూడలేదు... దెబ్బలకన్నా, నిప్పులు కురిపిస్తున్న ఆమె కళ్ళని చూసే, తను విపరీతంగా భయపడిపోయేడు. తన మొండితనానికి, తెలివితక్కువ ప్రవర్తనకి ఆ వేళ తగిన శిక్ష పడింది.

ఆ తర్వాత పిల్లలకి నచ్చచెప్పి యిళ్ళకి పంపించేసింది. ఆరోజు రాత్రి అన్నం తిననని అలిగేడు తను. మూతి బిగించుకుని కూచున్నాడు. అమ్మ పిలిస్తే పలక్కుండా మొరాయించేడు.

అప్పుడు అమ్మ లాలనగా తనని బుజ్జగిస్తూ చెప్పిన మాటలు తనకి తెలియకుండానే తన భావిజీవితం నిర్దేశింపబడేలా గొప్ప ప్రభావాన్ని చూపించేయి...

"అలా ఎందుకు చెప్పేవు వాళ్ళతో?" అమ్మ అడిగింది.

"అవును... అ... అంటే అత్తయ్యే... అచ్యుతాంబ అత్తయ్య... ఆ అంటే ఆడదెయ్యం... అదే..." అన్నాడు మొండిగా.

"అలా అనకూడదురా విద్యా!"





"అనొచ్చు... అదంతే"

"మరి నువ్వు అలా అనమంటే పిల్లలు ఎందుకు అనలేదు? నేను చెప్పిందే కరెక్టని ఎందుకన్నారు?"

అమ్మ ప్రశ్న విని తెల్లబోయేడు. ఆ చిన్న వయసులో ఆ ప్రశ్నకి జవాబు తనకెలా తెలుస్తుంది?

అమ్మే చెప్పింది. "ఎందుకంటే- వాళ్ళకి నేను గురువుని. గురువంటే దైవం... గురువు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపం... నేను వాళ్ళకి చదువు చెప్పే గురువుని... నేను చెప్పేది ఏదయినా వాళ్ళు శ్రద్ధగా వింటారు... నువ్వు వాళ్ళ టీచరువి కావు కదా! అంచేత నువ్వు చెప్పేది ఒకవేళ నిజమే అయినా కూడా వాళ్ళు నీ మాట వినరు... నువ్వు పెద్దయ్యేక స్కూలు మేష్టరు ఉద్యోగం సంపాదించుకో. అప్పుడు కూడా నీకు అ అంటే మీ అచ్యుతాంబ అత్తయ్యేననీ, ఆ అంటే ఆడదెయ్యమేననీ అనిపిస్తే- నీ శిష్యులకి అలాగే చెప్పు... కాదనకుండా అమాయకంగా నీ మాటలే నిజమనుకుంటారు... నువ్వు చెప్పిందే వేదమనుకుంటారు" అంది అమ్మ నవ్వుతూ...

పెద్దయేక ఉపాధ్యాయ వృత్తినే ఎన్నుకోవాలనే ఆలోచనకు బీజం తనలో పడింది అప్పుడే. అన్నీ సజావుగా జరిగి అదృష్టవశాత్తూ తనకి ఆ వృత్తే లభించింది...

ఏదో చప్పుడు కావడంతో విద్యాసాగర్ ఆలోచనలకి తెరపడింది.

నీరసంగా నవ్వుకున్నాడు తనలో.

ఇప్పుడు తను మేష్టరుగా ఉద్యోగంలో ప్రవేశించేడు ఎంతోమంది పిల్లలు తన చేతిమీదుగా తయారుకాబోతున్నారు...

వాళ్ళకి తను ప్రత్యక్షదైవం!

ఇప్పుడలా చెప్పగలడా తను!

అంత నీరసంలోనూ తెరలు తెరలుగా నవ్వొస్తోందతనికి.

అ... అంటే అనుభవం..

ఆ... అంటే ఆడది.

నగటు ఆడది. భర్తపోయి, జీవితంలో అన్ని సుఖాలు పోగొట్టుకున్న నగటు ఆడదానిగా అచ్యుతాంబ అత్తయ్య అప్పుడలా ప్రవర్తించగలగడాన్ని కూడా తనిప్పుడు జీవితానుభవాలు

నేర్పిన పాఠంతో క్షమించగలడు.

అత్తయ్య ఆరోజున క్రూరంగా ప్రవర్తించిన మాట నిజమే.

అత్తయ్యలాంటి ఆడవాళ్ళు ఆ స్థితిలో అంతకన్న ఉన్నతంగా ప్రవర్తించలేరు.

విద్యాసాగర్ ఆలోచనలు మళ్ళీ పులిపుట్టు స్కూలుచుట్టూ పరిభ్రమించసాగేయి.

ఈపాటికి స్కూలు పాక తయారయి వుంటుంది. వీలయితే మొక్కలు పెంచడానికి స్కూలు చుట్టూ ఓ ఫెన్సింగులాంటిది తయారుచేయించమని కూడా కోరేడు తను.

అది తన అందమయిన కల... అపురూపమయిన స్వర్గం...

తన దురదృష్టం... ఇంతలోనే తనకిలా జ్వరం వచ్చిపడాలా! బాధగా నిట్టూర్చేడు విద్యాసాగర్.

రాత్రి తొమ్మిది గంటలు దాటేక యింటి ముందు టాక్సీ వచ్చి ఆగింది. అప్పుడే మళ్ళీ మగతగా నిద్రలోకి జారిపోతున్న విద్యాసాగర్‌కి చప్పున మెళుకువ వచ్చింది. కళ్ళు విప్పి చూస్తే అతని కంటికి తండ్రితోపాటు జానకేశ్వరరావు గదిలోకి వస్తూండడం కనిపించింది.

''ఎలా వుంది ఒంట్లో?'' వస్తూనే అడిగేరు.

బాగుందన్నట్టుగా తలూపేడు విద్యాసాగర్. ఆ తర్వాత నారాయణమూర్తిగారు ప్రెసిడెంటు గారితోనూ, నరసమ్మగారితోనూ మాట్లాడేరు. ఈలోగా జానకేశ్వరరావు వెళ్ళి డాక్టర్ని పిలుచుకొచ్చేడు. అతను వచ్చి టెంపరేచరు చూసి ఏదో యింజక్షను చేసేడు.

''ఫరవాలేదు... మీ వాడ్ని మీరింక మీతో తీసుకెళ్ళి పోవొచ్చును'' తన కళ్ళలోకే చూస్తూన్న నారాయణమూర్తిగారితో అన్నాడు డాక్టరు.

అతనికి థాంక్స్ చెప్పి, ఫీజుకింద కొంత డబ్బు నారాయణమూర్తిగారు అతని చేతిలో పెట్టేరు.

''మీరెందుకయ్యా యివ్వడం... నేనిస్తాన్లెండి'' వారించబోయేడు కామయ్య. అతను వినలేదు.

చేతులు జోడించి నమస్కరిస్తూ ''మావాడ్ని అలాంటి పరిస్థితుల్లో కన్నబిడ్డలా ఆదరించేరు... మీకెలా ధన్యవాదాలు చెప్పాలో తెలీడం లేదు... మీ దంపతుల్ని ఎప్పుడూ మరిచిపోలేం... కృతజ్ఞతలు'' అన్నారు నారాయణమూర్తిగారు. అతని గొంతు గాద్గద్యంతో వణుకుతోంది.

''పెద్దోళ్ళు... సదువుకున్నోళ్ళు... మీరు మాకు దండవెడతారేంటి? మాం సేసిందేపాటి కనుక... ఆ పులిపుట్టువోల్లు అబ్బాయిని జేగర్తగా యిక్కడికి తీసుకొచ్చేరు... మా సొంత బిడ్డకి మావు సెయ్యవా!'' అంది సన్యాసమ్మ.

''నిజమే! వాళ్ళ మేలు కూడా ఎప్పటికీ మరిచిపోలేం... ఆ ప్రెసిడెంటు కనిపిస్తే మా తరపున ధన్యవాదాలు చెప్పండి''

మరోసారి అందరికీ ధన్యవాదాలు చెప్పి, కొడుకుని నడిపిస్తూ టాక్సీదగ్గర కొచ్చేరు నారాయణమూర్తిగారు. జానకేశ్వరరావు రెండో జబ్బ పట్టుకుని ఆసరాయిచ్చేడు.

టాక్సీ బయలుదేరేముందు సన్యాసమ్మ విద్యాసాగర్‌కి వినబడేలా మెల్లగా అంది, ''బాబూ... మేష్టుబాబు... ఆ పులిపుట్టువోల్లు నీ గురించి నాతో ఎంతో చెప్పేరు... అల్లకి నువ్వంటే ఎంతో గురి కుదిరింది. నువ్వు మంచోడివని... నీవల్ల అల్లపిల్లకాయలు బాగుపడతారని ఎంత సర్దాపడుతున్నారో... నీ వొళ్ళు పూర్తిగా బాగుపడ్డాక- అక్కడికెళ్ళడం మానీకు... ఏం...'' అని.

ఆ దయాపూరితమయిన మాటలకి విద్యాసాగర్ కళ్ళు చెమరించాయి. తన శరీరవీణలో నరాల తీగెల్ని సుతారంగా మీటినట్లయింది.

'తప్పకుండా! తప్పకుండా వెళ్తానమ్మ... నా ఉద్యోగధర్మంలో ఏలోటూ చెయ్యను' అతని మాటలు గొంతులోనే ఉండిపోయేయి.

చేతులెత్తి నమస్కరిస్తూ తలూపేడు.

టాక్సీ బయలు దేరింది.

★ ★ ★

ఆ తర్వాత విద్యాసాగర్ ఆలోచనలతో ఎలాంటి ప్రమేయంలేకుండానే రోజులు వడివడిగా గడిచిపోయేయి.

తగ్గినట్టే తగ్గి మళ్ళీమళ్ళీ జ్వరం రావడం ప్రారంభించింది. మనిషి చిక్కిశల్యమైపోయేడు. ఆ జ్వరం సుమారుగా ఇరవై, ఇరవై అయిదురోజులపాటు దాదాపు రోజూ అతన్ని

బాధించింది. నిమ్మళించినట్టే వుండి మళ్ళీ జ్వరం తిరగబెట్టేది. ఖరీదయిన వైద్యం జరిగింది.

ఎలాగయితేనేం అతను పూర్తిగా కోలుకునే సరికి పాతిక రోజులుపైనే పట్టింది.

ఈమధ్యలో జరిగిన పరిణామాలు అతనిని తీవ్రంగా కలిచివేశాయి. మానసిక వ్యధతో అతను నలిగిపోయేడు. తప్పనిసరి పరిస్థితులలో తప్పుచెయ్యాల్సి వచ్చినందుకు అతని మనసు క్షోభపడింది...

ఈ ఇరవై రోజులలోనే జానకేశ్వరరావు చాలా తతంగం జరిపించేడు. అతనూ, తండ్రీ బలవంతపెట్టడంతో తనూ కాదనలేకపోయేడు.

ఆ పని చేస్తూ ఉంటే ఒక్కొక్క మెట్టూ దిగజారి అధఃపాతాళానికి కుంచించుకుపోతున్నట్టనిపించేది విద్యాసాగర్‌కి. ఆ పరిస్థితుల్లో అలా చెయ్యడం తప్ప మరో గత్యంతరం లేదని తనని తాను సమాధానపర్చుకోవాలని ప్రయత్నించేవాడు... మనసు ఎదురు తిరిగేది.

తను... తను కూడా అందరిలాగే అడ్డదారిలో ప్రయాణానికి సిద్ధమవుతున్నాడా! తను చేసిందానికి ఏవో సంజాయిషీలూ, సమాధానాలకోసం వెతుక్కుంటున్నాడా!

తన ఆదర్శం అబద్ధమేమో! తన నిజాయితీ గడ్డిపరక విలువ చెయ్యనిదేమో...

తన అంతరంగంలో ఎక్కడో ఒక వెనులుబాటు వుంది. ఎక్కడో ఒక అపనమ్మకం వుంది... జానకేశ్వరరావులాగే తన వ్యక్తిత్వంలో కూడా ఏదో తెలీని 'మెలిక' వుంది...

ఆ ఆలోచన రాగానే దుఃఖం ముంచుకొచ్చేది విద్యాసాగర్‌కి. ఆకులా వణికిపోయేవాడు...

ఓరోజు జానకేశ్వరరావు నీలకంఠం మేష్టార్ని తీసుకొని యింటికొచ్చేడు. అప్పటికి తనకింకా జ్వరం వస్తూ తగ్గుతూవుంది. లేవడానికి కూడా వొంట్లో శక్తి చాలేది కాదు.

నీలకంఠం తనవెంట పులిపుట్టు స్కూలు రికార్డులు తీసుకొచ్చేడు. జానకేశ్వరరావు, తండ్రి చెప్పింది విన్నాక అతను మరి కాదనలేకపోయేడు.

"నువ్వు జాయినింగు రిపోర్టు పంపించేవు. కనుక ఉద్యోగంలో చేరిపోయినట్టే. ఆ తర్వాత యింతవరకూ నువ్వు బడికి జ్వరంవల్ల వెళ్ళలేకపోయేవు... కొత్తగా చేరిన నీకు సెలవేం ఉంటుంది. అంచేత... నువ్వు జాయినింగ్ రిపోర్టు పంపించిన తేదీ నుండి యివాల్టివరకూ యిందులో సంతకాలు పెట్టు... మరేం ఆలోచించకు... ఏరిస్కూ లేదు... నువ్విప్పుడిందులో సంతకాలు చెయ్యకపోతేనే రిస్కులో పడతావు... ఇదంతా మామూలే... అందరికీ తెలిసిందే... నేను అచ్యుతరావుగారితో మాట్లాడేను... పులిపుట్టు ప్రెసిడెంటు నీ గైరుహాజరు గురించి ఎవరికీ రిపోర్టు చెయ్యడు... అదంతా నేనూ, ఎమ్.యి.ఓ. చూసుకుంటాం... సంకోచించకుండా సంతకాలు చెయ్యి" అని సంతకాల రిజిష్టరు అందించేడు జానకేశ్వరరావు.

నీలకంఠం వెకిలిగా నవ్వి అతని మాటలకు వత్తాసు పలికేడు. ఎటూ చెప్పలేని నిస్సహాయస్థితిలో దీనంగా చూసే తండ్రి చూపులు విచలితుడ్ని చేసాయి విద్యాసాగర్‌ని.

వైరుధ్యాల పడవ గాలివాటుకి ఒకప్రక్కగా ఒరిగిపోయింది. తెలీని భయసంకోచాల సమరంలో నిరాయుధిడిగా మిగిలిపోయినట్టయింది విద్యాసాగర్‌కి.

మరింకేం మాట్లాడలేకపోయేడు. మాట్లాడే శక్తీ ఓపికా కూడా అతనిలో లేవు.

ఆ రిజిష్టరు అందుకుని, మారు మాట్లాకుండా అతను చూపించిన చోటల్లా సంతకాలు పెట్టేసాడు. సంతకాలు పెడుతూ ఉంటే చెయ్యి సన్నగా వణుకుతూండడం అతనికే తెలుస్తోంది.

ఆ తర్వాత నీలకంఠంనుంచి యితర రికార్డులు, ఛార్జి తీసుకోవడం జరిగింది.

"రేపో ఎల్లుండో ఓసారి వెళ్ళి అచ్యుతరావుగారికి కనిపించివద్దాం. నువ్వు రెష్టుతీసుకో" అని చెప్పి, జానకేశ్వరరావు నీలకంఠాన్ని వెంటబెట్టుకుని వెళ్ళిపోయేడు.

అనుకున్నట్టుగా ఆ తర్వాత ఎమ్.యి.వో.గారిని వెంటనే కలవడానికి వీలు కుదరలేదు. విద్యాసాగర్‌కి అమర్నాధ్డూ, తర్వాతా కూడా మళ్ళీ ఒళ్ళు వెచ్చచేసింది.




ఈలోగా జానకేశ్వరరావు విద్యాసాగర్‌కోసం జీతం బిల్లు ప్రిపేర్ చేసి పెట్టి, దానిమీదా, బిల్లుకి జతచేయాల్సిన మిగతాపేపర్లమీదా సంతకాలు చేయించి పట్టుకెళ్ళాడు.

జీతాల రోజున విద్యాసాగర్ యింటికి జానకేశ్వరరావు, సత్యం, కాక మరో ముగ్గురు టీచర్లు వచ్చేరు. వాళ్ళు బేంక్‌లో జీతాల చెక్కు మార్చుకుని, లెదర్ బ్యాగ్‌లో డబ్బు తీసుకుని వచ్చేరు.

సాధారణంగా జీతాల బిల్లులు పాస్‌చేశాక-నాలుగయిదు చిన్న స్కూళ్ళకి కలిపి సాల భ్యంకోసం ఎవరో ఒక హెడ్మాష్టరు పేరుమీద చెక్కు యిస్తూంటారు. బిల్లులు పాస్ చేసి, చెక్కులు ఎమ్.యీ.వో. ప్రిపేర్ చేస్తే ఎమ్.డి.వో. దానిమీద సంతకాలు చేస్తాడు. ఇలా జీతాల చెక్కులు ఏయే స్కూళ్ళవి టేగ్ చేశారో టీచర్లకి ముందుగానే తెలుస్తుంది. సాధారణంగా సింగిల్ టీచర్లున్న స్కూళ్ళ జీతాలు మరొకళ్ళ జీతాల చెక్కుతో కలిపి యిస్తుంటారు. జీతాలరోజున అందరూ బ్యాంక్ దగ్గర కలుసుకొని అక్కడే సంతకాలుపెట్టి జీతాలు అందుకుంటూ ఉంటారు.

విద్యాసాగర్ పరిస్థితి ఆరోజు చెక్కుమార్చిన టీచరుకి వివరించి, అందరికీ నచ్చచెప్పి జీతాల బట్వాడాకోసం వాళ్ళని అక్కడికి జానకేశ్వరరావు తీసుకొచ్చేడు.

విద్యాసాగర్‌కి మిగతావారిని పరిచయం చేశాడు జానకేశ్వరరావు.

''ఇప్పుడు మీ ఒంట్లో ఎలా వుంది... బాగా విక్కిపోయేరు సుమా!'' సత్యం అడిగేడు.

అతనివేపు చూస్తూ జీవంలేని నవ్వొకటి నవ్వేడు విద్యాసాగర్.

ఉద్యోగజీవితంలో మొదటి నెల జీతం యీ పరిస్థితిలో యిలా అందుకోవలసి రావడం అతనికి బాధ కలిగిస్తోంది. తప్పుచేస్తున్న భావన అతని కళ్ళలో వ్యక్తమవుతోంది.

మిగతావాళ్ళు జీతాలు తీసుకోవడం పూర్తయేక, విద్యాసాగర్‌కి రావలసిన జీతం లెక్కపెట్టి అతని చేతిలో పెట్టేరు.

పుస్తకంలో సంతకం చేస్తూవుంటే విద్యాసాగర్‌కి ముచ్చెమటలు పోసేయి. ఎర్రని రెవెన్యూ స్టాంపు రక్తపు చుక్కలా తోచింది. చెయ్యి వణుకుతూ ఉండగా ఎలాగో అతికష్టంమీద సంతకం చేశాడు.

తర్వాత కాస్సేపు అవీ యివీ మాట్లాడి వచ్చిన వాళ్ళంతా వెళ్ళిపోయేరు. చేతిలో డబ్బు దొంతర అతడ్ని భయకంపితుడ్ని చేస్తోంది. అదొక పాముల పుట్టలా తోచింది. ఆ డబ్బు తననీ, తన చర్యలనీ వెక్కిరిస్తున్నట్టు నిలదీసి గుచ్చిగుచ్చి ఏవో అడుగుతున్నట్టు అనిపించిందతనికి.

నిస్త్రాణగా మంచంమీద కూలబడిపోయేడు.

వెళ్ళిపోయేముందు చింతలగూడెం మేష్టారు సత్యం... గుమ్మం వరకూ వెళ్ళిన వాడల్లా తిరిగి తన దగ్గరకి వచ్చి నెమ్మదిగా, అయినా స్ఫుటంగానే అన్న మాటలు అతని చెవుల్లో గింగుర్లు తిరుగుతున్నాయి...

''విద్యా! మీరున్న ప్రస్తుత పరిస్థితిని నేను అర్థంచేసుకోగలను... మీ మనసులో తుఫాన్ భీభత్సం మీ కళ్ళలో చూసి నేను పోల్చుకోగలుగుతున్నాను... అధైర్యపడకండి... అపరాధ భావన మనిషిని దహించి వేస్తుంది. ఏవో కుంటిసాకులతో, సమర్థింపుల్తో ఆ భావనని తుడిచిపెట్టే ప్రయత్నం చేస్తే మనిషి యింకా యింకా పతనమైపోతాడు... నిజమయిన పశ్చాత్తాపంతో దహించబడిననాడే మనిషి మనిషిగా నిలదొక్కుకోగలుగుతాడు... అతని వ్యక్తిత్వం వికసించగలుగుతుంది... వైరుధ్యాలని అధిగమించగలగడంలోనే వ్యక్తి వికాసం జరుగుతుంది... మరోసారి తీరికగా మిమ్మల్ని కలుస్తాను సెలవ్'' అని వెళ్ళిపోయేడతను.

విద్యాసాగర్ చేతిలో నోట్లు అరచేతిలో పట్టిన చెమటకి తడిసిపోతున్నాయి.

వాళ్ళందరూ వెళ్ళిపోయేక తను పడుకున్న మంచం దగ్గరకొచ్చిన తల్లి చేతిలో మౌనంగా ఆ డబ్బు పెట్టేడు.

ఆవిడ కొడుకు మొదటి జీతాన్ని ఆనందంగా అందుకున్నారు.

''అమ్మా... ఇదిగో! ఇది నా మొదటి జీతం...'' అని తన తొలి సంపాదన గర్వంగా తల్లి చేతిలో పెట్టాలని ఎన్నేళ్ళుగానో కలలు

కన్న విద్యాసాగర్ కలలు నెరవేరలేదు.

సిగ్గుగా, సంకోచంగా, దొంగతనం చేసి తెచ్చిన డబ్బులాగా మౌనంగా ఆ డబ్బు ఆమె చేతిలో వుంచి ముఖం మరో పక్కకి తిప్పుకుని తనలో తనే కుమిలిపోసాగేడు విద్యాసాగర్.

పార్వతమ్మ ఆ విషయం గమనించలేదు. డబ్బు లెక్కపెట్టుకోవడంలో మునిగిపోయింది.

కొడుకు మనస్సులో చెలరేగుతున్న భావ సంచలనాన్ని అర్థంచేసుకునే పరిజ్ఞానం ఆ తల్లికి లేదు.



విద్యాసాగర్‌కి మరి జ్వరం రావడంలేదు. ఏవో బలానికీ వాటికీ డాక్టరు రాసిచ్చిన మందులు వాడుతున్నాడు. నీరసం దాదాపు తగ్గిపోయింది. చాలావరకూ ఆరోగ్యం కుదుటపడి, మనిషి పూర్వంలాగే తయారయ్యేడు.

ఈలోగా ఒకసారి అచ్యుతరావుగారిని కలవమని జానకేశ్వరరావు పదేపదే చెప్పేడు.

ఇష్టం ఉన్నా లేకపోయినా, అతన్ని కలుసుకోడానికి వెళ్ళక తప్పలేదు విద్యాసాగర్‌కి. జానకేశ్వరరావుతోపాటు ఒకటి రెండుసార్లు అతని కోసం ఆఫీసుకెళ్తే అక్కడతను దొరకలేదు. అతను బసచేస్తూఉండే లాడ్జిలో ఎంక్వయిరీ చేస్తే ఇప్పుడతను ఆ లాడ్జిగదిలో ఉండటం లేదని తెలిసింది.

ఆరోజు ఉదయాన్నే ఎక్కడికో వెళ్తూ వచ్చి చెప్పేడు జానకేశ్వరరావు- ''నిన్న సాయంత్రమే తెలిసింది... అచ్యుతరావుగారు యిక్కడకి కుటుంబాన్ని తీసుకొచ్చేసారుట. ఒంటరిగా ఉండడంవల్ల అతను తాగుడికీ వ్యసనాలకీ మరింత బానిసైపోయి ఆరోగ్యం చెడగొట్టుకుంటున్నాడనీ- కుటుంబాన్ని పెడితే కొంచెం అతన్ని కంట్రోలు చెయ్యొచ్చనీ ఎవరో టీచరు వాళ్ళఊరు వెళ్ళి మరీ అక్కడ అతని అత్తమామలతోనూ, భార్యతోనూ చెప్పి వచ్చేడుట... అచ్యుత్‌రావుగారి భార్య అతను కాదంటున్నా వినకుండా పంతంపట్టి మరీ యిక్కడ యిల్లు తీసుకుని కాపురం పెట్టేరుట. తన మీద యింట్లో వాళ్ళకి ఆ మాటలు చెప్పిన టీచరు ఎవరో తెలుసుకోవాలని అచ్యుతరావుగారు ప్రయత్నిస్తున్నారు. ఆ తెలీని వ్యక్తిమీద కోపంతో రెచ్చిపోతున్నారు. అన్నట్టు... నీ గురించి యీ మధ్య చాలా సార్లు వాకబు చేశారట... ఓసారి యింటికయినా వెళ్ళి కలువ్... అతని సంగతి నీకు తెలీదు... నీమీద కోపం పెంచుకున్నాడంటే నిన్ను నానా యిబ్బందులూ పెట్టగలడు... ఒట్టి జిత్తుల మారి... ఒక్క కలం పోటుతో టీచర్లని నానాయాతనలూ పెట్టగల సమర్థుడు''

''ఏ వీధిలో యిల్లు తీసుకున్నారు?'' అయిష్టంగానే అడిగేడు విద్యాసాగర్.

జానకేశ్వరరావు ఆ యింటి అడ్రస్ చెప్పి, మళ్ళీ వస్తానని వెళ్ళిపోయేడు.

ఆ సాయంత్రం మనస్సు పూర్తిగా వ్యతిరేకిస్తున్నా విధిలేక అడ్రసు వెతుక్కుంటూ అచ్యుతరావుగారి యింటికి వెళ్ళాడు.

అలా వెళ్ళడం- అతని జీవితం ఒక ముఖ్యమయిన మలుపు తిరగడానికి కారణమయింది.

★ ★ ★

ఆ యిల్లు చేరేసరికి ఆరు గంటలు దాటింది. చీకటి పడుతోంది. వీధి దీపాలు వెలిగించేరు. అచ్యుతరావుగారు యిలాంటి సమయంలో ఏ పరిస్థితిలో ఉంటారో అని సందేహిస్తూనే ఆ యింటి గడపలో అడుగుపెట్టాడు విద్యాసాగర్. లాడ్జిలో ఆరోజు సాయంత్రం ఎదురయిన సన్నివేశం అతన్నింకా వెంటాడుతూనే వుంది. అందుకే సంశయిస్తూనే అక్కడకి వెళ్ళేడు.

అక్కడికతను వెళ్ళేసరికి పరిస్థితి మరోరకంగా ఉంది. అచ్యుతరావుగారు యింట్లోలేరు.




ఎక్కడికో కేంప్‌కి వెళ్ళేరుట. అచ్యుతరావుగారి ఆఖరబ్బాయి కడుపునొప్పితో చుట్టుకుపోతున్నాడు. అతని భార్య ఏం చెయ్యడానికీ తోచక ఆందోళన పడుతోంది. ఎవర్ని సహాయం అడగాలన్నా ఆ ఊళ్ళో ఎవరితోనూ పరిచయాలు కాలేదింకా.

"అచ్యుతరావుగారున్నారా?" అంటూ ఆ యింట్లో అడుగుపెట్టిన విద్యాసాగర్‌కి కనిపించిన దృశ్యం యిది.

"అరెరే! ఏమిటి... ఏమయింది?" అంటూ ఆతృతగా ఆ అబ్బాయి పడుకున్న మంచం దగ్గరికెళ్ళాడు.

"కడుపునొప్పితో చుట్టుకుపోతున్నాడు బాబూ... ఆయన యింట్లో లేరు... ఉన్నా ఆ మనిషి లేనట్టేలెఖ్ఖ... సమయానికి మా పెద్దమ్మాయి పద్మ కూడా యింట్లో లేదు..." కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ దాదాపు ఏడుపు గొంతుతో చెప్పిందావిడ.

విద్యాసాగర్ మరి ఆలోచించలేదు. ఆవిడకి ధైర్యం చెప్పి "రెండు వీధులవతల ఓ డాక్టరున్నారు. మీరు కంగారుపడకండి. చూపించి తీసుకొస్తాను" అంటూ ఆ అబ్బాయిని భుజంమీద వేసుకుని బయల్దేరాడు.

గుమ్మం దిగబోతూంటే ఆవిడ అడిగింది. "దేవుడిలా వచ్చేవు బాబూ... నువ్వు... నువ్వు... నీ పేరు" అర్థోక్తిగా ఆపేసిందామె.

"నా పేరు విద్యాసాగర్. స్కూలు మేష్టర్ని" సమాధానం చెప్పి గబగబా నడిచేడు.

గబగబా వీధిలో కొచ్చినాలుగడుగులు వేశాక ఖాళీ రిక్షా కనిపిస్తే ఆ అబ్బాయిని అందులో చేర్చి తనూ ఎక్కాడు. రిక్షా వేగంగా కదిలి హాస్పిటలు దగ్గర ఆగింది. బేరం ఆడకుండా రిక్షాకి డబ్బులిచ్చేసి ఆ అబ్బాయిని భుజం మీద వేసుకుని హాస్పిటల్‌లోకి దౌడుతీశాడు విద్యాసాగర్.

డాక్టరు వెంటనే అటెండయాడు. ఏదో యింజక్షను చేసి ఆ అబ్బాయి చేత మాత్రలు మింగించేడు. మరి కొన్ని మాత్రలు కొనమని చీటి రాసి విద్యాసాగర్ చేతిలో పెట్టాడు.

"కాస్సేపు యిక్కడే ఉండనివ్వండి... మరేం ఫరవాలేదు. తగ్గిపోతుంది. కాస్త రిలీఫ్ కనబడ్డాక యింటికి తీసుకెళ్ళొచ్చుగాని... ముందు ఆ మాత్రలు కొని తెచ్చి నాకు చూపించండి" అన్నాడు డాక్టరు.

'అలాగే' అని తలూపి, మందులు కొనుక్కుని రావడానికి వెళ్ళేడు విద్యాసాగర్. మందులు కొనుక్కొని హాస్పిటల్‌లో అడుగుపెట్టిన విద్యాసాగర్ కళ్ళకి ఓ రూంలోంచి జానకేశ్వరరావు బయటకి వస్తూండటం కనిపించింది.

"నువ్వేమిటి యిక్కడున్నావ్!" అడిగేడు ఆశ్చర్యపోతూ.

"మా అమ్మ... మా అమ్మనిక్కడ జాయన్ చేశాను"

ఛెళ్ళున చెర్నాకోలాతో కొట్టినట్టయింది విద్యాసాగర్‌కి. జానకేశ్వరరావుతో పరిచయం కలిగేక అతనెంతో సన్నిహితంగా వచ్చేడు తనకి. అయినా ఒక్కసారి కూడా అతని కుటుంబ వివరాల జోలికిపోలేదు తను! ఎంతసేపూ స్కూలు గురించీ, ఉద్యోగం గురించీ అతన్తో మాట్లాడుతూ గడిపేశాడు. తర్వాత తన అనారోగ్యం. రోజులు ఊహించనంత వేగంగా తిరిగిపోయేయి. ఇంతవరకూ అతని గురించి తెలుసుకోనందుకు సిగ్గుతో కుంచించుకుపోయేడు విద్యాసాగర్.

"నువ్వేమిటి యిలా వచ్చేవు?"

"అచ్యుతరావుగారిని కలుద్దామని ఆయనింటికి వెళ్ళేను. వాళ్ళ ఆఖరబ్బాయి కడుపునొప్పితో చుట్టుకుపోతున్నాడు. ఇంట్లో అతని భార్య ఒక్కర్తీ దిక్కుతోచక ఆందోళనపడుతుంటే ఆ అబ్బాయిని యిక్కడకి తీసుకొచ్చేను"

"అరె! ఎమ్.యీ.వో.గారబ్బాయికా...పద... ఎలా వుంది వాడికిప్పుడు"

"నో వర్రీ... తగ్గింది. కాస్సేపు వుంచి యింటికి తీసుకెళ్ళొచ్చునని డాక్టరు చెప్పేడు... ముందు మీ అమ్మగార్ని చూద్దాం, పద" అంటూ అతని భుజంమీద చెయ్యివేశాడు విద్యాసాగర్.

ఇద్దరూ ఆవిడ వున్న గదిలోకి వెళ్ళారు.

జానకేశ్వరరావు తల్లిని ఆ స్థితిలో చూసి స్థాణువులా నోటమాటరాక అలా వుండిపోయే

డు విద్యాసాగర్. శల్యావశిష్ఠలా ఆవిడ మంచానికి అతుక్కుపోయివుంది. ముది వగ్గు. ఎముకలపోగులా కనిపిస్తోంది. ముక్కులోంచి గొట్టాలు పెట్టి ఆహారమో, మందో- ఆ గొట్టాలద్వారా పంపిస్తున్నారు.

"మీ అమ్మగారి పరిస్థితి గురించి నువ్వు ఒక్కసారికూడా నాతో చెప్పలేదు" అతనినలా నిష్ఠూరమాడటంలో ఔచిత్యంలేదని తెలిసీ అనకుండా ఉండలేకపోయేడు విద్యాసాగర్.

జానకేశ్వరరావు ముఖంమీద చిరునవ్వు మెదిలి అంతలోనే 'మటుమాయమైంది.

అదే నవ్వు! లోతు తెలియనివ్వని నవ్వు...

ఆ తర్వాత నెమ్మదిగా అన్నాడు. ఇవాళో రేపో అని డాక్టరు చెప్పేడు. ట్రీట్‌మెంట్ ఆపుచేసేస్తానన్నాడు. నేనే ఆశ చావక ట్రీట్‌మెంట్ కంటిన్యూ చెయ్యమని అడిగేను. ఇప్పుడా ఆశ కూడా లేదు. మధ్యాహ్నంనుంచీ అమ్మ పరిస్థితి మరింత దిగజారిపోయింది".

ఆ పరిస్థితిలో కూడా అతనంత నిబ్బరంగా మాట్లాడటం ఆశ్చర్యం కలిగించింది విద్యాసాగర్‌కి. "మీ వాళ్ళు మరెవరూ రాలేదా?" అడిగేడు బాధగా.

"లేదు... ఎవరూ లేరు... నేనూ, అమ్మా... అంతే"

ఒక్షణం యిద్దరిమధ్యా మాటలే కరువయ్యేయి. తర్వాత విద్యాసాగర్ భుజంమీద చెయ్యివేసి "పద... ఆ అబ్బాయిని చూసొద్దాం" అన్నాడు జానకేశ్వరరావు.

ఇద్దరూ అచ్యుతరావుగారి అబ్బాయిని పడుకోబెట్టిన చోటికి వచ్చేసరికి అక్కడొక అమ్మాయి నిల్చుని వుంది. ఆ అబ్బాయి తల నిమురుతూ నిల్చుని వుందామె.

ఆ అమ్మాయికి సుమారు ఇరవైయేళ్ళుంటాయి. నాజూగ్గా వుంది. పొడవైన జడ. తెల్లని శరీరచ్ఛాయ. చురుకైన కళ్ళు. సభ్యత వుట్టిపడేలా అలంకరించుకుని వుంది.

"మీరు అచ్యుతరావుగారి అమ్మాయి కదూ?" అడిగేడు విద్యాసాగర్ ఆమెని సమీపిస్తూనే.

"అవును... నా పేరు పద్మ... మా తమ్ముడ్ని యిక్కడికి తీసుకొచ్చింది మీరే కదూ!"

"అవును... నా పేరు విద్యాసాగర్. స్కూలు టీచర్ని... ఇతను జానకేశ్వరరావు... యితనూ టీచరే... ఎమ్.యి.వో.గార్ని కలుద్దామని మీ యింటి కొచ్చేను... అప్పటికే ఈ అబ్బాయి పరిస్థితి చూసి మీ అమ్మగారు బెంబేలుపడిపోతున్నారు. ఆవిడకి ధైర్యం చెప్పి మీ తమ్ముడ్ని యిక్కడికి తీసుకొచ్చేను... ఇప్పుడెలా వుంది మీ తమ్ముడికి... నొప్పి తగ్గిందా?" అనడిగేడు ఆ అబ్బాయి వేపు చూస్తూ.

"నొప్పి తగ్గింది" ఆ అబ్బాయి చెప్పేడు.

"చాలా థేంక్సండీ... మీరు చేసిన ఉపకారానికి విలువ కట్టలేం.. నేను యింటికి రాగానే అమ్మ వీధిగుమ్మందగ్గరే నిల్చుని సంగతంతా చెప్పింది. ఆత్రుతగా యిక్కడకి రిక్షాలో వచ్చేను. వీడికి నొప్పి తగ్గింది. డాక్టరు నా వివరాలు అడిగి తమ్ముడ్ని యింటికి తీసుకుపోవచ్చునన్నారు. మీకోసమే చూస్తున్నాను... ధన్యవాదాలు మీకూ, మీ స్నేహితునికీ" అంటూ చేతులు జోడించిందామె.

తర్వాత తమ్ముడ్ని తీసుకుని ఆమె రిక్షాలో యింటికి వెళ్ళిపోయింది.

"ఈసరికి ఎమ్.యి.వోగారు యింటికి వచ్చివుంటారేమో. వెళ్ళి కలుసుకో' చెప్పేడు జానకేశ్వరరావు.

"లేదు... ఈ రాత్రికి నీతో యిక్కడే ఉంటాను... తెలిసిన వాళ్ళెవరయినా కనిపిస్తే యింటికి కబురు చేస్తాను"

జానకేశ్వరరావు అతని చెయ్యి అందుకుని ఆప్యాయంగా నొక్కి వదిలేడు.

రాత్రి రెండు గంటల సమయంలో జానకేశ్వరరావు తల్లి చనిపోయింది. తల్లి శవాన్ని చూస్తూ నిర్వికారంగా ఉండిపోయేడతను. కళ్ళలో మరింక కన్నీళ్ళు యింకిపోయినట్టుగా నిర్లిప్తంగా ఉన్నాయి.

విద్యాసాగర్ చేతులు రెండూ పట్టుకుని కొద్దిసేపు ఆ అరచేతుల్లో ముఖం కప్పుకుంటూ అన్నాడు. "అమ్మ... అమ్మ నన్ను వదిలి వెళ్ళిపోయింది విద్యా" అతని గొంతులో దుఃఖపు జీర. అతన్ని ఎలా ఓదార్చాలో తెలియలేదు విద్యాసాగర్‌కి. రాత్రికి రాత్రే శవాన్ని యింటికి




తెచ్చేరు.

విషయం తెలిసి విద్యాసాగర్ తండ్రి జానకేశ్వరరావు యింటికి వచ్చేరు. జానకేశ్వరరావుకి ధైర్యం చెప్పి దహనసంస్కారానికి తనే దగ్గరుండి అన్ని యేర్పాట్లూ చేశారు. మర్నాడు మరీ పొద్దెక్కకుండానే శవదహనం పూర్తయింది. ఆ తర్వాత స్నానానికి యింటికి వెళ్ళిపోయేరు నారాయణమూర్తిగారు. విషయం తెలిసి వచ్చిన కొందరు టీచర్లు కూడా కాస్సేపు ఉండి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయేరు.

ఆరోజంతా విద్యాసాగర్ అతనితోనే ఉండిపోయేడు. ఇరుగు పొరుగు ఆడవాళ్లెవరో ఆ పూటకి భోజనం ఏర్పాట్లుచేశారు. వాళ్ళ బలవంతంమీద ఎలాగో నాలుగు మెతుకులు తిన్నారు.

★ ★ ★

ఆ తర్వాత వరుసగా రోజూ జానకేశ్వరరావు యింటికి వెళ్ళి అతనికి కంపెనీ యిస్తూనే ఉన్నాడు విద్యాసాగర్.

ఒకరోజు అలాగే జానకేశ్వరరావుని కలిసి యింటికొచ్చేసరికి ముందుగదిలో పద్మ తన రాకకోసం ఎదురుచూస్తూ కనిపించింది. తన వెంట తమ్ముడ్ని తీసుకొచ్చింది. ఆమె రాక ఆశ్చర్యాన్ని కలిగించింది విద్యాసాగర్‌కి.

ఆమె అతన్ని చూసి లేచి నమస్కరించింది. తను వెళ్ళి ఆమె ఎదురుగా కుర్చీలో కూచుని, ఆమెని కూచోమని చెయ్యి చూపిస్తూ "ఎంతసేపయింది మీరొచ్చి?" అని పలకరించేడు.

"ఇప్పుడే... మీరు వీధిలో కెళ్ళారని... వచ్చేస్తారు కూచోమని మీ అమ్మగారు చెప్తే మీకోసం చూస్తూ కూర్చున్నాం"

"మీ తమ్ముడికెలా వుంది... ఆ రోజు తర్వాత మరేమీ నొప్పి రాలేదు కదా?"

"లేదండీ... మీకు చాలా థేంక్స్" అన్నాడు ఆ అబ్బాయి.

"గుడ్... నీ పేరేమిటి? ఏం చదువుతున్నావు?"

ఒకటో తరగతి"

"పేరు చెప్పలేదేం?"

"రవి... రవి కుమార్ అండీ" అన్నాడా అబ్బాయి సిగ్గుపడుతూ.

ఇంతలో విద్యాసాగర్ తల్లి కాఫీలు తెచ్చి వాళ్ళకిచ్చింది. ఓరెండు మూడు మాటలు మాట్లాడి ఆమె లోపలకి వెళ్ళిపోయింది.

కాఫీలు తాగడం పూర్తయేక "ఆరోజునుంచీ ఎప్పటికప్పుడు వచ్చి మిమ్మల్ని కలుద్దామనుకుంటూనే ఉన్నానండీ... వీలుకాలేదు... ఏవో పనులు. ఎంత ప్రయత్నించినా రాలేకపోయేను. అమ్మ ఆరోగ్యం అంతబాగుండదు. ఇంటి పనీ, వంట పనీ కూడా నేనే చూసుకోవాలి... నిన్న మీరు మా యింటికొచ్చి మా నాన్నగారితో మాట్లాడడం చూసేను... మీమధ్య సంభాషణ అంతా విన్నాను... నాన్న మీపట్ల చాలా దురుసుగా ప్రవర్తించేరు... అతని మాటలు మిమ్మల్ని గాయపరచి ఉంటాయి... ఆయన తరపున క్షమాపణలు నేను వేడుకుంటున్నాను... అది చెప్పడానికే వచ్చేను" అంది పద్మ తలొంచుకుని.

"అప్పుడు... అప్పుడు మీరు యింట్లోనే ఉన్నారా!" ఆశ్చర్యంగా అడిగేడు విద్యాసాగర్.

"అవును... నాన్నగారు టీచర్లతో ప్రవర్తించే తీరు ఏమీ బాగుండదు... ఆ సంగతి యింట్లో అందరికీ తెలుసు... అందుకే వచ్చింది మీరే అని గమనించినా వచ్చి పలకరించలేకపోయేను. మన్నించండి" అంది బాధగా.

అచ్యుతరావుగారిని కలుసుకోడానికి ముందురోజు తను వెళ్ళడం... అతని నిర్లక్ష్యవైఖరి... అన్నీ గుర్తొచ్చేయి విద్యాసాగర్‌కి...

"నమస్కారం... కబురు పెట్టారుట, రమ్మని" అన్నాడు వినయంగా నమస్కరిస్తూ.

ఏదో ఫైలు చూస్తున్న అచ్యుతరావుగారు తలెత్తి చూసేడు. కూచోమని కూడా అనలేదు.

"నిన్నెక్కడో చూసినట్టే వుందే" అన్నారు కళ్ళజోడు సవరించుకుంటూ.

ఎక్కడ చూసేరో కావాలనే చెప్పలేదు విద్యాసాగర్.

"నేను పులిపుట్టు సింగిల్ టీచర్ని... నా పేరు... విద్యాసాగర్" తనని తను పరిచయం చేసుకున్నాడు.

అతనికి గుర్తొచ్చినట్టుంది. కనుబొమ్మలు ముడివేస్తూ "ఓహో! నువ్వేనన్నమాట... అక్కడ జాయినయింది... పదిసార్లు కబుర్లు పెట్టినా దొరగారికి తీరిక చిక్కలేదన్న మాట" వెటకారంగా అన్నాడతను.

"సారీ అండీ... ఈమధ్య ఒంట్లో బాగాలేదు..." నసిగేడు.

"జీతాలందుకున్నావా?"

నీరసంగా అవునన్నట్టు తలూపేడు.

"అదీ... డబ్బులందుకున్నాక మేం మరి కనబడమన్న మాట... నువ్వేదో సిన్సియారిటీ ముద్దవని అంటున్నారు. అక్కడికెళ్లి వచ్చేవుట..."

"వెళ్లేనండీ" తన గొంతు తడారిపోతోంది.

"వెళ్లి ఓ నాల్రోజులుండి వచ్చేసేవు... జీతం మాత్రం మహారాజులా క్లైమ్ చేసేవు... అవునా?"

ఏం బదులు పలకాలో తెలియలేదు తనకి. "జానకేశ్వరరావు... కొండంగి మేష్టరు... నా గురించి మిమ్మల్ని కలుస్తానని చెప్పేడు..." అన్నాడు సగం మాటలు మింగేస్తూ.

"చెప్పేడయ్యా... అందుకేగదా నీ జీతం బిల్లు పాస్ చేశాను. నువ్వొచ్చి ఓసారి కలుసుకోవాలని తెలీదూ? నువ్వేదో పొడిచేస్తావనీ, ఇలాంటి వాటికి అతీతుడివనీ నీలుగుతున్నట్టున్నావ్... ఇలా మిడిసిపడబట్టేచింతలగూడెం మేష్టరు సత్యం జీతం రాళ్లు తప్ప మరేమీ కానకుండా అఘోరిస్తున్నాడు..."

సత్యం పేరెత్తి అతన్ని దుర్భాషలాడ్డం తనకి కోపం తెప్పించింది.

"ఆ పని తప్ప మీరు మరింకేం చెయ్యగలరులెండి" అనేశాడు అనుకోకుండా.

తనా మాట ఎలా అనగలిగేడో ఇప్పటికీ ఆశ్చర్యకరమే.

అంతే... ఆ మాటలతో అతను గంగ వెర్రులెత్తిపోయేడు.. అవినీతిని వేలెత్తి చూపిస్తే కలిగే ఉక్రోషం అది. ఆ తర్వాత కోపంలో అతను రెచ్చిపోయి తనమీద ఎగిరిపోయేడు. నోటికొచ్చినట్టల్లా అన్నాడు.




అక్కడనుంచి నేరుగా వెళ్లి జానకేశ్వరరావుని కలిసేడు తను. జరిగిందంతా అతనితో చెప్పేడు.

"అతను నిన్నేమీ చెయ్యలేడు... మహా అయితే నీకు ముందు ముందు రావల్సిన రాయితీలూ, ఎరియర్లూ ఏవో కుంటిసాకులు చూపించి తొక్కిపెడతాడు... మరేం చెయ్యలేడు. అతను నిలువెల్లా అవినీతి ఊబిలో కూరుకుపోయి ఉన్నాడు. అలాంటి వ్యక్తి నిన్నేం చెయ్యగలడు?" అని ధైర్యం చెప్పాడు జానకేశ్వరరావు.

ఆ విషయాలన్నీ గుర్తొచ్చి బాధగా నిట్టూర్చేడు విద్యాసాగర్.

"మీ నాన్నగారిని నేను కూడా అలా రెచ్చగొట్టకుండా ఉండవలసిందేమో" అన్నాడు.

"లేదు... మీరు సరైన పనే చేసేరు. ఆ పాటి ధైర్యం మీ మేష్టర్లెవరికీ లేకపోయింది. అదీకాక నాన్నగారితో సత్సంబంధాలు కలిగి ఉండడంవల్ల వాళ్ల ప్రయోజనాలు వాళ్లకీ ఉంటాయి..."

ఆ తర్వాత మరి కాస్సేపు మాట్లాడి, మరోసారి తండ్రి ప్రవర్తనకి సారీ చెప్పుకుని తమ్ముడ్ని తీసుకుని వెళ్లిపోయింది పద్మ.

అలా పరిచయమైన తరువాత వాళ్లిద్దరూ తరచుగా కలుసుకోవడం ప్రారంభించేరు. ఎక్కడో ఒకచోట కలుసుకుని మనసులు విప్పి మాట్లాడుకునేవారు. రానురాను ఆమె వ్యక్తిత్వం విద్యాసాగర్‌ని ఆకర్షించసాగింది. రోజుకి ఒకసారయినా ఆమెని కలుసుకోకుండా ఉండలేకపోయేవాడు.

రోజులు గడిచిపోతున్నాయి. రెండో నెల జీతం కూడా బ్యాంక్ దగ్గరే తీసుకున్నాడు విద్యాసాగర్. అప్పుడప్పుడు... సత్యం తనతో అన్న మాటలు గుర్తుకొచ్చేవి.

తన ప్రవర్తనలో, ఆలోచనా ధోరణిలో ఇలాంటి మార్పు ఎలా వచ్చిందో అతనికి బోధపడడం లేదు. పద్మతో పరిచయమయేక ఆ ఆకర్షణలోపడి తన ఉద్యోగ బాధ్యత విస్మరిస్తున్నాడా!

తను తెలీని అగాధాల అంచులలోకి జారిపోతున్నట్టు ఒక్కోసారి అనిపిస్తూ ఉంటుంది. మిగతా కొందరిలాగ తను కూడా తన చర్యలకి సిగ్గుపడే స్థితిని దాటిపోయేడా? తండ్రికానీ,

తల్లిగానీ ఎప్పుడూ నోరు విప్పి అడిగేవారుకాదు. తనక్కడికి ఒక్కసారి వెళ్లి, జ్వరం తెచ్చుకుని చాలారోజులపాటు మంచాన పడటం వాళ్లు మరిచిపోలేకపోతున్నారు.

తమ్ముడూ, చెల్లీ మాత్రం ''స్కూలు కెళ్లవేం అన్నయ్యా?'' అని ఒక్కోసారి అడిగినప్పుడు మాత్రం శరీరాన్ని కనిపించని కత్తితో కోస్తున్నట్లుంటుంది. వాళ్లకి ఏం జవాబు చెప్పగలడు?

ఒక సాయంత్రం పద్మతోపాటు వంతెన వేపు షికారుకి వెళ్లినప్పుడు ఆమెతో తన మనసులోని బాధ అంతటినీ వెళ్లబోసుకున్నాడు.

పద్మ ఒక క్షణంసేపు ఏమీ మాట్లాడకుండా ఉండిపోయింది. ఆ తర్వాత అంది ''ఈ విషయమే నేనూ మీతో ప్రస్తావించాలని కొద్దిరోజులుగా అనుకుంటున్నాను... మీరేమనుకుంటారో అని సంకోచిస్తూ వచ్చేను. జ్వరం తగ్గి, స్వస్థత చేకూరినా కూడా స్కూలుకి మీరెందుకు వెళ్లడం లేదు?''

నోరు పెగిల్చి ఏదో చెప్పబోయేడు విద్యాసాగర్.

''క్షమించండి... ఏదో విధంగా మిమ్మల్ని మీరు సమర్థించుకోడానికి చూడకండి. వృత్తిపట్ల గౌరవం లేని వాళ్లంటే నాకు నచ్చదు. ఏవో భయాలకీ, మరేవో ప్రలోభాలకీ లోనై పవిత్రమయిన ఉపాధ్యాయ వృత్తికి ద్రోహం చెయ్యడం మంచిది కాదు.

మీరు చిత్తశుద్ధితో ఒక దీపాన్ని వెలిగించండి. అది మరిన్ని దీపాలని వెలిగిస్తుంది. పులిపుట్టు ప్రజలు మీ పట్ల చూపించిన ఆదరం గురించి మీరే చెప్పారు. వాళ్ల అమాయకత్వాన్నీ మీమీద ఉంచిన విశ్వాసాన్నీ వమ్ము చేయకండి. అందరూ మా నాన్నలాగే ఈ చెడుని ప్రోత్సహించే అధికారులే ఉండరు. ఏ బెదిరింపులకీ లొంగిపోనవసరం లేదు.

మీకు తెలీదనుకుంటాను. ఇంతకుముందు మన జిల్లాలో పనిచేసిన డియ్యీవో, పి.ఓ ఇద్దరూ చాలా స్ట్రిక్ట్‌గా వుండేవారు. అప్పుడు స్కూళ్లు ఠంచనుగా పనిచేసేవి. అధికారులని బట్టి మన ప్రవర్తనని మార్చుకోవడం మన బలహీనతకి దౌర్భాగ్యానికి నిదర్శనం...''

పద్మ అలా మాట్లాడుతుందని విద్యాసాగర్ ఊహించలేదు.

''ఆ మారుమూల గ్రామాల్లో పనిచెయ్యడంలో ఎన్ని ఇబ్బందులు ఉన్నాయో మీకు తెలీదు'' ఈ మాట తను పద్మతో అనకుండా ఉండాల్సిందని ఆ తర్వాత చాలాసార్లు అనుకున్నాడు విద్యాసాగర్.

పద్మ నవ్వింది.

''తెలును. కనీసం ఊహించుకోగలను... కానీ... ప్రాజెక్టుల కోసం, రోడ్లు, రైలు మార్గాల నిర్మాణం కోసం అడవుల్లో, కొండల్లో యేళ్ల తరబడి పనిచేసే మేధావులూ, కార్మికులూ లేరా? వాళ్ల శ్రమ ఫలితాన్ని ఇవాళ మనం అనుభవించడం లేదూ? మీలాంటి యువకులు కూడా ఇలా మాట్లాడ్డం ధర్మం కాదు''

ఛ! ఏమైంది తనకు? ఆఖరి మెట్టు కూడ దిగి పోయేడాతను! అతని ముఖం సిగ్గుతో, అవమాన భారంతో పాలిపోయింది.

''మారుమూల స్కూళ్ళు సరిగా పనిచేయడం లేదనీ... అర్బన్ ఏరియాలో చక్కగా పనిచేస్తున్నాయనీ నేను చెప్పడం లేదు. అది వ్యక్తుల బలహీనతల మీద, లేదా వ్యక్తిగత సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది

ఏడాది పొడుగునా ఏదో కాలక్షేపం చేసేవాళ్లూ ఉంటారు. కష్టపడి శ్రద్ధతో పనిచేసేవాళ్లు ఉన్నారు

మీకు తెలిసే ఉంటుంది. ఎలిమెంటరీ స్కూళ్లలో అక్షరాలయినా ఒంటబట్టని వాళ్లని హైస్కూళ్లకి పంపేస్తున్నారని హైస్కూలు టీచర్లు, ఇక్కడ వీళ్లు సరిగా చెప్పకపోడంతో అక్షరాలు రానివాళ్లు కాలేజీలకి వస్తున్నారని లెక్చరర్లు ఒకరిమీద ఒకరు నేరాన్ని ఆరోపించడం చూడటం లేదూ?''

విద్యాసాగర్ ఆ మాటలు వింటూ అలా ఉండిపోయేడు.

''మరో విషయం... భారీ ఫీజులు చెల్లించి కాన్వెంట్లలోనూ, ప్రైవేటు స్కూళ్లలోనూ పిల్లల్ని చదివించుకోగలుగుతున్న వారి శాతం ఎంత ఉంటుందో ఆలోచించండి. చాలా కొంచెం మాత్రమే. మిగతా పిల్లలంతా ఇలాంటి చోట్ల చదవాల్సిందే. వాళ్లకి సరైన న్యాయం జరుగుతోందనే చెప్పగలరా? ఇందుకు బాధ్యత ఎవరిదేనా కావొచ్చు. ప్రభుత్వ పాఠశాలల పనితీరువ

ట్ల అందరికీ చిన్నచూపు ఏర్పడడానికి కారణాలు అందరూ నిష్పక్షపాతంగా వెతుక్కోగలగాలి. తాము కోల్పోతున్న ప్రతిష్టని మళ్లీ సంపాదించుకోవలసిన బాధ్యత అందరి మీదా ఉంది. కాదంటారా?''

పద్మ అలా మాట్లాడుతూ వుంటే ఆ చర్చని మరింత పొడిగించాలనిపించింది విద్యాసాగర్ కి.

''అయితే బాధ్యత అంతా ఒక్క ఉపాధ్యాయుల మీదే ఉందంటారా?'' అనడిగేడు.

''ఎలా అనగలను? చదువు కొనుగోలు వస్తువై ప్రైవేటు కాన్వెంట్ల పేరిటా, విద్యా సంస్థల పేరిటా ఇవాళ ఒక వికృతమయిన భారీ వ్యాపారం జరుగుతోంది. పేదవర్గాల వారికీ, సామాన్య ఉద్యోగులకీ అందరానిదై వాళ్లు తమ పిల్లల భవిష్యత్తు మామూలు ప్రభుత్వ పాఠశాలలకి అప్పగించి నిరాశా నిస్పృహలకు లోనవుతున్నారు. ఇక్కడ చదివే వాళ్లలో ఏ కొద్దిమందో మాత్రమే ఎందుకు ప్రతిభావంతులవుతున్నారు? ఎందుకు ప్రతీయేటా వేలాదిమంది విద్యార్థులు కనీస మార్కులు కూడా తెచ్చుకోలేక పరీక్షలు తప్పుతున్నారు?''

''ఆ పిల్లల తల్లిదండ్రులు వారి చదువు మీద చూపించే శ్రద్ధ మీద ఆధారపడే విషయం అది''

''కూలీనాలీ చేసుకుంటూ కనీస అక్షరాస్యతకి కూడా నోచుకోని ఆ తల్లిదండ్రులనుంచి అది మనం ఆశించలేం. మీరు చెప్పిందీ నిజమే. కానీ అదొక్కటే కారణం కాదు. లోపభూయిష్టమయిన పరీక్షా విధానం, ఉపాధ్యాయుల కొరత, కనీస సౌకర్యాలు లేకపోవడం, అటెండెన్సు శాతంతో ఉత్తీర్ణతను సాధించే సులభమార్గం, ఉపాధ్యాయుల అలసత్వం ఇలాంటివే ఎన్నో కారణాలు. ఒక్క ఉపాధ్యాయులే దీనికి జవాబుదారీ కానక్కరలేదు. అయితే చీకటిని తిడుతూ కూచోడంకన్నా చిరుదీపం వెలిగించడం మంచిది. ఎన్ని అభ్యంతరాలు, మరెన్ని అడ్డంకులు, ఇంకెన్ని అసంతృప్తులు ఉన్నా ఈ పరిస్థితిని ఎదుర్కోవలసిందీ ఎదుర్కోగలిగేదీ ఒక్క ఉపాధ్యాయులు మాత్రమే. కాదంటారా?'' పద్మ ఆవేశంగా చెప్పుకుపోతోంది.

ఆ చర్చ సంపూర్ణం కాకపోవొచ్చు. సమగ్రం కూడా కాకపోవచ్చు. కానీ పద్మ విశ్లేషిస్తున్న తీరు మాత్రం అతనికినచ్చింది.

అతనిలో విరుద్ధభావాల దారాలు ఒక్కొక్కటీ తెగిపోతున్నట్టనిపించింది. ఊగిసలాట ఒక కొలిక్కి వచ్చినట్లయింది.

చీకటి పడుతూండగా ఇళ్లకు బయలుదేరారు ఇద్దరూ.

★ ★ ★

పద్మ మాటల్తో కోల్పోతున్న మనోబలాన్ని మళ్లీ కూడగట్టుకో గలిగేడు విద్యాసాగర్. ఎవరెన్ని చెప్పినా తనింక ఈ వంచనా భారాన్ని భరించలేడు. పులిపుట్టు వెళ్లాలి. తన ఊపిరి ఎక్కడ స్తంభించిపోయిందో తిరిగి అక్కడే కొత్త ఊపిరి పోసుకోవాలి. తన చైతన్యం ఎక్కడ గడ్డకట్టుకు పోయిందో తిరిగి అక్కడే దాన్ని రగిలించాలి. ఎవరు చెప్పినా వినదల్చుకోలేద తడు.

అతని నిర్ణయానికి మరింత పరిపూర్ణత్వాన్ని పుష్టినీ చేకూర్చే సన్నివేశం అతనికి జానకేశ్వర్ ఇంటి దగ్గర తటస్థించింది.

పద్మతో జరిగిన సంభాషణనే మననం చేసుకుంటూ అక్కడకి వెళ్లిన విద్యాసాగర్‌కి జానకేశ్వరరావు ప్రయాణ సన్నాహాలతో హడావిడిగా వుండడం కనిపించింది.

ఇంట్లో ఉన్న పెద్దపెద్ద బీరువాలూ, బల్లలూ ఏవీ ఇప్పుడక్కడ లేవు. అయినకాడికి వాటిని అమ్మేసినట్లు అతను చెప్పేడు.

''ఏం?'' ఆశ్చర్యంగా అడిగేడు విద్యాసాగర్.

''అమ్మ అస్థికలు కలపడం కోసం ఇవాళే రాజమండ్రి వెళ్తున్నాను. వచ్చిన వెంటనే ఈ ఇల్లు ఖాళీ చేసి కొండంగి వెళ్లిపోతాను''

''స్కూలుకా!''

''అవును... అమ్మ వెళ్లిపోయింది. నేనింక ఎవరికోసం కనిపెట్టుకుని ఇక్కడ ఉండాలి చెప్పు? ఎప్పటికీ స్కూలుకెళ్లడం మానేసి ఇక్కడే గడిపేస్తూ నెలనెలా జీతం అందుకుంటూ నన్ను నేనింక వంచించుకోలేను. మనస్సులో ఇంక ఈ సంఘర్షణని నేను తట్టుకోలేను. అమ్మ మరణంతో నా ఇన్నాళ్ల దొంగ బతుక్కి ఆ అవసరం తీరిపోయింది. కొండంగి వెళ్లిపోదా




మనుకుంటున్నాను'' అన్నాడు.

అతని గొంతులో అపరాధ భావన తొణికిసలాడుతోంది.

విద్యాసాగర్ కంటికి గంగాజలంతో శుద్ధి చేసుకున్న మనిషిలా కనిపిస్తున్నాడు జానకేశ్వరరావు.

ఇంతకాలం ఆ ముసలి తల్లిని ఒంటరిగా ఇక్కడ విడిచిపెట్టనూ లేక, ఆ జవసత్వాలుడిగిన ముదివగ్గుని ఏజెన్సీ కొండ ప్రాంతంలోకి తనతోపాటు తీసికెళ్లనూ లేక అతను ఎంత సతమతమైపోయేడో.

వైయక్తిక కష్టనష్టాలను కూడా పరిగణించకుండా తమ విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చగలిగే మనోనిబ్బరం ఏకొద్దిమంది మనీషులకో కాని సాధ్యపడదు. జానకేశ్వరరావు మనీషి కాడు... మనిషి. మామూలు మనిషి. గత్యంతరం లేని స్థితిలో కూడా అవకాశాలు వినియోగించుకోకుండా ఉండగలిగేటంత మహోన్నతుడేమీ కాకపోవచ్చు. రాగవిరాగాలూ, స్వార్థచింతనలూ, అనురక్తులూ, అనుకంపనలూ... అన్నీ వున్న మామూలు మనిషి.

కానీ, పశ్చాత్తాపాగ్నిలో తన పాపచింతనని దహింపచేసుకోవాలని తపన పడే మనిషి అతను. అతనిప్పుడు పులుకడిగిన ముత్యంలా వున్నాడు.

"మరో విషయం విద్యా... అమ్మకోసం ఆవిడ మంచాన పడివుంటే చూడడం కోసం ఇన్నాళ్లూ నేను నా ఉపాధ్యాయ వృత్తికి ద్రోహం చేశాను. ఎంత వ్యధని అనుభవించేనో చెప్పలేను. అవినీతికి కాపు కాసే అచ్యుతరావులాంటి వ్యక్తివల్ల నా ఉద్యోగం నిలిచింది. లేకపోతే ఎప్పుడో వూడిపోయేది. ఇప్పుడు నిజాన్ని ఒప్పుకోగలిగినా, ఉద్యోగం వదులుకోగలిగే ధైర్యం నాకెలాగూ లేదు. అందుకే నా తప్పు దిద్దుకోడానికి నా సేవింగ్స్‌లోంచి వీలయినంత పెద్ద మొత్తం విత్‌డ్రా చేసి ఒక పనిచేద్దామనే నిర్ణయానికొచ్చేను'' ఉద్వేగంతో అతనలా చెప్తూవుంటే నిశ్చేష్టుడై ఉండిపోయేడు విద్యాసాగర్.

"అంటే... అంటే ఏం చెయ్యదలుచుకున్నావు?'' అనడిగేడు కాస్సేపటికి గొంతు పెగుల్చుకుని.

"నేను పనిచేసే స్కూలు అభివృద్ధికే ఖర్చు చేద్దామని అనుకుంటున్నాను. పిల్లలకు కావాల్సినవీ, ప్రభుత్వం ఇవ్వనివీ అనేకం ఉంటాయి''

విభ్రమంగా అతని వేపు చూస్తూ, ఆనందాతిరేకంతో అతని చెయ్యి పట్టుకుని బలంగా వూపేశాడు విద్యాసాగర్.

"నీ అంత ఉన్నతంగా ఎందరుండగలరయ్యా!''

జానకేశ్వరరావు మనోహరంగా నవ్వేడు. మళ్లీ అదే నవ్వు! లోతు తెలియనివ్వని నవ్వు.

"ఇలాగే చెయ్యమనీ, చెయ్యాలనీ అందరికీ నేను సూచించడం లేదు కానీ కనీసం ఏదో ఒక దశలోనయినా ఒక్కసారి వెనక్కి తిరిగి చూడాలనీ, వృత్తికి న్యాయం చేయాలనీ కోరుకుంటున్నాను'' అన్నాడు జానకేశ్వరరావు.

కొద్ది రోజులుగా గుండె పొరల్లో నిండిపోయిన వ్యాకులత అంతా ఎలాంటి బాధా తెలియనివ్వకుండా చేత్తో తీసేసినట్టయింది. మనసు తేలిక పడింది విద్యాసాగర్‌కి.

తన మార్గం సుగమమయింది. తన గమ్యం నిర్దేశించబడింది.

స్నేహితుని వేపు ధన్యవాదాలు తెలుపుతున్నట్టుగా చూస్తూ... "నేను కూడా రేపే బయలుదేరుతున్నాను... పులిపుట్టుకి'' అన్నాడు విద్యాసాగర్.

★ ★ ★

పులిపుట్టు వెళ్తూనే స్కూలు ఉండే చోటుకి వెళ్లేడు విద్యాసాగర్.

స్కూలు... అప్పుడెలా వుందో ఇప్పుడూ అలాగే వుంది. పడిపోయిన ఆ పాకని బాగుచేయించే ప్రయత్నం ఏదీ జరగలేదు. తాము శుభ్రం చేసిన ఆ స్థలంలో మళ్లీ పిచ్చి మొక్కలేవో దట్టంగా మొలిచేయి.

ఆ స్కూలునీ, స్కూలు పరిసరాలనీ చూస్తూ గాఢంగా నిట్టూర్పు విడిచేడు విద్యాసాగర్.

ఆ తర్వాత అతను ఇది వరకు ప్రెసిడెంటు తన బస కోసం కేటాయించిన పాకకి వెళ్లాడు. అదిప్పుడు ఖాళీగా లేదు. ఎవరో కాపురం వుంటున్నారు. విద్యాసాగర్ మనసు బాధగా మూలిగింది.

అతని రాకను గమనించిన ఒకరిద్దరు మామూలుగా పలకరించి వెళ్ళిపోయేరు. పిల్లలు కూడా ఇప్పుడతని చుట్టూ మూగడం లేదు. ప్రెసిడెంటు కోసం ప్రయత్నిస్తే అతను దొరక లేదు. చేసేది లేక మళ్ళీ స్కూలు దగ్గరకి వెళ్ళాడు విద్యాసాగర్.

సాయంత్రం వరకూ ఒక్కడే ఆ పరిసరాలని శుభ్రం చేసే పనిలో మునిగిపోయేడు. కలత చెందిన మనసు అతనికి ఆకలిని గుర్తు చెయ్యనివ్వలేదు.

సాయంత్రం ప్రెసిడెంటు వచ్చేడు. అతని మనుమలూ వచ్చేరు. వస్తూనే విద్యాసాగర్‌ని అతని ఆరోగ్య పరిస్థితి గురించి అడిగేడు ప్రెసిడెంటు.

"తగ్గింది... ఇప్పుడు మరేం లేదు. ఆ జ్వరం చాలా రోజుల వరకూ వదల్లేదు. మీరు చేసిన సహాయానికి ఎప్పటికీ రుణపడివుంటాను" అన్నాడు విద్యాసాగర్.

ప్రెసిడెంటుకానీ ఆ గ్రామ ప్రజల్లో మరో వ్యక్తికానీ తనని మరొక్క మాట కూడా అనక పోవడం అతనికి బాధగా ఉంది. వాళ్ళు తనని నిలదీసి వుంటే ఈ బాధ తగ్గుతుందేమో.

ఆ తర్వాత ప్రెసిడెంటు విద్యాసాగర్ ఉండడానికి చోటు చూపించి మళ్ళీ పూర్వంలాగే కావలసిన ఏర్పాట్లన్నీ చేయించేడు.

ప్రెసిడెంటు ఆ ఏర్పాట్ల కోసం మనుమల్ని పురమాయిస్తూ వుంటే అతనికి దగ్గరగా వెళ్ళి "స్కూలు... స్కూలు పాక ఇంకా అలాగే వుంది. బాగు చేయించలేదు. రేపటి నుండి బడి చెప్పుకుందామనుకుంటున్నాను" అన్నాడు మెల్లగా.

అతనేం మాట్లాడలేదు. చూద్దాంలే అన్నట్టు మాట దాటేశాడు. ఏర్పాట్లు పూర్తయేక అతను తన మనుమలతో వెళ్ళిపోయేడు.

విద్యాసాగర్ మనసు విలవిలలాడిపోయింది. ఆ రాత్రి కూడా అతను మరింక ఏం వండుకోలేదు. అభోజనంగా పడుకున్నాడు.

ఆ మర్నాడు అతన్నెవరూ కలవలేదు. తనని వాళ్ళందరూ వనిగట్టుకుని శిక్షిస్తున్నట్టుగా అనిపించి అతని మనసు వికలమైపోయింది. ఈ శూన్యాన్ని అతను భరించలేకపోతున్నాడు. ఆ రోజు పరధ్యానంగానే వంట అయిందనిపించేడు. అన్నం ముందు కూచుని సయించక ఏదో తిన్నాననిపించుకుని చెయ్యి కడిగేసుకున్నాడు. పగలంతా స్కూలు దగ్గరే ఆ పడిపోయిన పాకని చూస్తూ గడిపేశాడు. సాయంత్రం అవుతున్న కొద్దీ అతనికి మనో నిబ్బరం సడలిపోతున్నట్టనిపించింది. ధైర్యం కోల్పోతున్నట్టనిపించింది.

ఆ రాత్రి తనే వెళ్ళి ప్రెసిడెంటుతోపాటు అందర్నీ పిలిచి ఒక చోట సమావేశపరిచేడు. గుడ్డిదీపాల వెల్తుర్లో అంతా అతను చెప్పదల్చుకున్నది వినడానికి సిద్ధపడుతూ కూచున్నారు.

విద్యాసాగర్ పులిపుట్టు ప్రజలకి చేతులు జోడించి చెప్పడం ప్రారంభించేడు "నేను... నేను బడి తెరుస్తాను... మీ పిల్లలకి సక్రమంగా పాఠాలు చెప్పుకుంటాను... నా మాట నమ్మండి. స్కూలు పాక బాగు చేయించండి. మీ పిల్లల్ని బడికి పంపించండి. చదువురాని పెద్దలందరికీ కూడా వాళ్ళు దయతో నాకు సహకరించగలిగితే ఏదో సమయంలోవాళ్ళకీ నాలుగక్షరాలు వచ్చేలా చేస్తాను. అక్షర దీపం వెలిగిస్తాను. నాకు మరొక్క అవకాశం ఇచ్చి చూడండి. ఈ ఒక్కసారీ నా మాటల మీద నమ్మకముంచండని ప్రతి ఒక్కరినీ కోరుతున్నాను"

అతని గొంతులో ఏ విషాదం ధ్వనించిందో, అంతా విస్తుపోతూ అతనివేపు చూస్తూ వుండిపోయేరు.

అతనికి ప్రత్యుత్తరం ఇవ్వగలిగేందుకు తగిన భాషా సంస్కారం వాళ్ళకి లేదు. సామూహికంగా చేతులెత్తి నమస్కరించేరు.

"మంచోడివే... సర్లే... బడి సెప్పుకుంటానంటావు. అంతేకద?" అన్నాడు ప్రెసిడెంటు.

"అవును బడి పాక బాగుచేయించండి. చదువుకోడానికి దయచేసి మీ పిల్లల్ని పంపించండి"

"అలాగేలే... ఇక నెగండి.. ఎల్దాం" అంటూ లేచాడు ప్రెసిడెంట్.

"ఒక్క నిముషం..." అని ఇంట్లోకి వెళ్ళి మళ్ళీ అక్కడి కొచ్చేడు విద్యాసాగర్.

ప్రెసిడెంటు చేతిలో రెండు పది రూపాయల కట్టలు వుంచుతూ "ఇదుంచండి, మీ




దగ్గర'' అన్నాడు.

''ఎందుకిది?'' ఆశ్చర్యపోతూ అడిగేడు ప్రెసిడెంటు.

''నేనిక్కడ జాయనయ్యేక తీసుకున్న జీతం డబ్బుల్లో కొద్ది మొత్తం ఇది. నా తృప్తికోసం దయచేసి తీసుకోండి. మీరందరూ దయతో తలా చెయ్యీవేసి దీనికి జత చేస్తే ముందు ముందు స్కూలు అభివృద్ధికోసం పనికొస్తుంది''

''మేస్టరుబాబూ!'' ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరవుతున్నాడు ప్రెసిడెంటు... ''వద్దు... వద్దొద్దు...'' అని నిరాకరించబోయేడు.

విద్యాసాగర్ వినలేదు. ''కాదనకండి... ఈ డబ్బు మీరు తీసుకోక తప్పదు... మీరు తీసుకుంటే తప్ప నా మనసు కుదుట పడదు'' అన్నాడు నిశ్చయంగా.

ప్రెసిడెంటు మరేమీ మాట్లాడలేకపోయేడు. చూస్తున్న వాళ్లంతా శిలా ప్రతిమల్లా వుండిపోయేరు.

మూడో రోజుకల్లా స్కూలు పాక తయారయింది. ఈసారి మరింత దృఢంగా ఏ గాలీ, వర్షానికీ పడిపోకుండా గట్టిగా కట్టారు.

విద్యాసాగర్ ఆనందానికి అవధుల్లేవు. పొత్తిళ్లలో బిడ్డలా ఆ పాక అతనికంటికి మనోహరంగా కనిపిస్తోంది. మర్నాటి నుండీ...

''అ... అమ్మ

ఆ... ఆవు...'' విద్యాసాగర్ గొంతు అక్కడ ప్రతిధ్వనిస్తోంది.

తూర్పు కొండల్లో సూర్యోదయమై వెలుగు రేఖలు పొడుచుకొచ్చినట్టు ఆ కుగ్రామంలో కొత్త చైతన్యం వెల్లివిరిసింది.

పిల్లలు కొత్త మేష్టారి గొంతుతో గొంతుకలుపుతూ ఉత్సాహంగా అరుస్తున్నారు.

★ ★ ★

ఈ విషయం ఆనోటా ఈ నోటా ప్రాకి, మండలంలో ఉపాధ్యాయులందరికీ తెలిసిపోయింది.

సహజంగానే విద్యాసాగర్‌కి కొత్త మిత్రులతో పాటు కొందరు ప్రచ్ఛన్న శత్రువులు కూడా తయారయేరు.

విషయం తెలిసి టీచర్లు కొందరు మనస్ఫూర్తిగా అభినందించేరతన్ని.

కొందరు అతని ముఖం మీద వ్యంగ్య బాణాలు కురిపిస్తూ, ముఖం చాటున ఎద్దేవా చేసిన వాళ్లూ ఉన్నారు.

నెలలో జరిగే సెంటర్ క్లాస్ మీటింగుల్లో ఇది చర్చనీయాంశమయింది.

అచ్యుతరావుగారు కోపంతో ఉడికిపోయేరు. విద్యాసాగర్ తనని ఎదిరించి మాట్లాడడం అతను మరిచిపోలేక పోతున్నాడు. ఎలాగయినా దెబ్బతీయాలని మథన పడసాగేడు.

అతని తూటా దెబ్బకి లక్ష్యంగా సత్యం మేష్టారితో పాటు ఇప్పుడు మరొక ఇద్దరు నిలిచారు. ఒకరు విద్యాసాగర్, రెండవ వ్యక్తి జానకేశ్వరరావు.

కానీ, ఈ చిన్న సంఘటన మండల ఉపాధ్యాయుల్లో పెద్ద మార్పు తీసుకొచ్చింది.

ఆ మండల పరిధికి సంబంధించినంత వరకూ ఒక కదలిక ఏర్పడింది.

గ్రామాల్లో ఉండే స్కూళ్లకే కాక పట్టణ ప్రాంతంలో మునిసిపల్ పాఠశాలలనీ, ఇతర స్కూళ్లనీ కూడా ఈ ప్రకంపనాలు తాకాయి.

నెలకోసారి జరిగే సెంటర్‌క్లాస్ మీటింగుల్లో పూర్వపు ధోరణి తగ్గి ఉపాధ్యాయుల చర్చలు ఆరోగ్యవంతమయిన మరో మార్గం పట్టేయి. అలసత్వాన్ని వదల లేకపోయేవాళ్లూ, వెటకారాలు చేయడమే ధ్యేయంగా కలిగినవాళ్లూ కొందరింకా లేకపోలేదు.

సాధారణంగా సెంటర్ క్లాసు మీటింగులు ఏ ప్రయోజనాన్ని ఉద్దేశించి పెట్టబడుతాయో ఆ ప్రయోజనాలు నెరవేరకుండా అర్థరహితంగా ముగిసిపోతూ వుంటాయి.

మండలంలో పనిచేసే అన్ని పాఠశాలలకు చెందిన ఉపాధ్యాయులూ సెంటర్ క్లాస్ మీటింగులకి హాజరు కావాలి. దానికి ఎమ్మియీవో అధ్యక్షత వహిస్తాడు. ఒక్కోసారి సంబంధిత ఇతర విద్యాశాఖాధికారులు కూడా హాజరవుతూ ఉంటారు. అక్కడ విద్యావిషయకమయిన చర్చలూ, బోధనా కార్యక్రమాన్ని గురించిన చర్చలూ సాగాలి. మోడల్ లెసన్స్ ఇవ్వడం



వాటిని విశ్లేషించడం జరగాలి. ఇతర విద్యాసమస్యలు సంస్థాగతమయిన ఇబ్బందులు అక్కడ చర్చింపబడాలి. అధికారులు సూచనలు, సలహాలు ఇవ్వాలి. ఉపాధ్యాయుల బోధనా సామర్థ్యం అక్కడ మరిన్ని మెరుగులు దిద్దుకోవాలి.

కానీ.... అక్కడ ఇవేవీ సాధారణంగా జరగవు. బిల్లులు తయారు చేసుకోవడం, బిల్లులు అధికారులకు అందించడం. అవి ఆమోదింపబడేలా చూసుకోవడం, బదిలీల కోసం పైరవీలు చెయ్యడం, జీతాల గురించీ, పెరిగే డి.ఎ. కిస్తీల గురించీ, రాబోయే పేఫిక్సేషన్ల గురించీ ఊహాగానాలు చెయ్యడం ఇలా గడిపేస్తూ ఉంటారు.

ఇప్పుడా పద్ధతిలో మార్పు వచ్చింది. వాళ్ల ఆలోచనా ధోరణి కొత్తపుంతలు తొక్కడం ప్రారంభించింది.



స్తబ్దత వదిలి కదలిక మొదలయింది.

దీనికి ముఖ్య కారకుడు సత్యం. విద్యాసాగర్, జానకేశ్వరరావులు అతన్ని సమర్థిస్తూ మాట్లాడేవారు. చాలామంది ఈ మార్పుని ఆమోదిస్తూ స్వాగతం పలికేరు. దీపం కింద నీడలా ఈ మార్పుని జీర్ణించుకోలేక, దీనికి అనుగుణంగా తమనితాము మలుచుకోలేక మౌనంగా తటస్థ భావం వహించిన వాళ్లూ లేకపోలేదు. అయితే రోజు రోజుకీ వాళ్ల సంఖ్య తగ్గుతోంది.

సెంటర్ క్లాస్ మీటింగుల్లో ఈమధ్య సత్యం మాట్లాడే మాటలు వాళ్లలో ఆలోచనలకు పదును పెడుతున్నాయి.

"సమాజ గతి రోజురోజుకీ మారిపోతోంది. మన ప్రాథమిక విద్య, తర్వాత మాధ్యమిక విద్య విద్యార్థుల భావి జీవిత సౌధాలకి పునాదులని చెప్పవచ్చు. పునాదులు బలంగా లేకపోతే ఎలాంటి భవ్య హర్మ్యాలయినా ఏదో ఒకరోజు కూలిపోక తప్పదు. వాళ్ల భవిష్యత్ సోపానాలకి మనం ఆధారం కావాలి. రేపటి తరం ముందు మనం దోషులుగా తలవంచుకోవలసిన పరిస్థితి రాకూడదు.

"మనకెన్నో సమస్యలుండచ్చు. కాదనను... ఉన్నాయి కూడా! నిధుల సమస్యలు, ఉపాధ్యాయ విద్యార్థుల నిష్పత్తి శాతం, డిటెన్షన్ పద్ధతి రద్దు, రాజకీయ నాయకుల జోక్యం, పరీక్షా విధానం, బదిలీలు... ఇలాంటివే చాలా సమస్యలు మనలో ఒక విధమయిన నిర్లిప్తతనీ, నిరాశా వాదాన్నీ ప్రేరేపిస్తున్నాయి. వీటికి తోడు బోధనేతర బాధ్యతల నిర్వహణ కూడా మనమీదే తరుచుపడుతూ ఉండడం! ఎలక్షన్లొచ్చినా, జనాభా సేకరణ కార్యక్రమం జరిగినా, చివరకి రేషన్ కార్డుల పంపిణీ జరగాలన్నా అన్ని పనులకూ ఉపాధ్యాయుడే హాజరు కావలసి వస్తోంది. దీనివల్ల అమూల్యమయిన మన సమయం వృధా కావడమే కాకుండా, మన ఏకాగ్రత కూడా దెబ్బతినే ప్రమాదం ఉంది.

అయితే సమస్యలనుంచి పారిపోవడం ఎప్పుడూ సమస్యలకి పరిష్కారం కాబోదు. మన వృత్తి ధర్మానికీ, వ్యక్తిగత అసంతృప్తులకీ ముడిపెట్టడం భావ్యంకాదు. మీలో ఉపాధ్యాయ వృత్తిలో తల నెరిసిన వాళ్లూ, ఎన్నో విధాలుగా నాకన్నా మేధాసంపత్తి కలవారూ ఉన్నారు. ఒక్కసారి అందరం కలిసి ఆలోచిద్దాం.

విద్యా వాణిజ్యం కేన్సరు పురుగులా పెరిగి పెరిగి బలిసిపోయి బలీయమైపోవడంలో మన పాత్ర ఎంత వరకూ వుందో సింహావలోకనం చేసుకుందామని అందర్నీ వేడుకుంటున్నాను. సంఘంలో ప్రభుత్వ పాఠశాలల పట్ల చిన్న చూపుని రూపుమాపాలంటే మనం ఏం చెయ్యాలో ఆలోచించమంటున్నాను. ఇక్కడ విద్యాప్రమాణాలు ఇంతగా దిగజారి పోవడానికి మన బాధ్యత ఎంతో గుర్తు చేసుకుందాం. మన బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూనే మన హక్కుల గురించి పోరాడదాం. మన సమస్యలు తీరడానికి ఉద్యమిద్దాం.

మనకింక కాగితాల మీద అంకెల గారడీలు వొద్దు... కాకుల లెక్కలు అసలే వొద్దు.

ఇవాళ రాష్ట్రంలో సారా వ్యతిరేకోద్యమం ఆంధ్రదేశాన్ని కుదిపివేస్తోంది. ఎక్కడో కోస్తా జిల్లాలో ఒక చిన్న గ్రామంలో బయలుదేరిన వ్యతిరేక పవనం ఝంఝామారుతమై ఆంధ్ర దేశాన్ని చుట్టు ముడుతోంది. ఉద్యమాన్ని తెలుగు నేల నలుమూలలా అందరూ అందుకున్నారు. దేశం యావత్తూ మనవేపు చూస్తోంది. ఈ ఉద్యమం ఇక చల్లారే ప్రసక్తిలేదు. సహించి సహించి ఓర్పు నశించిపోయిన స్త్రీజాతి తిరుగుబాటు పథాన్ని చేపట్టింది. ప్రభుత్వం సారాను నిషేధిస్తుందా, నియంత్రిస్తుందా అన్న మీమాంస మనకొద్దు... గ్రామీణ, పట్టణ స్త్రీలలో కలిగిన ఈ భావదీప్తి వాళ్ల బతుకుల్లోంచి సారా పూర్తిగా తొలిగి పోయేవరకూ నిరంతరం వెలుగుతూనే ఉంటుంది.

ఇది వయోజన విద్య, అక్షరజ్యోతి కార్యక్రమాల విజయంగానే భావించాలి. ఇవాళ విద్య ఆ నిరక్షరాస్యులని అమితంగా ప్రభావితం చేస్తోంది. అఆలు నేర్చిన గ్రామీణ స్త్రీలు సారా వ్యతిరేక ఉద్యమం పోరుమార్గంలో పయనిస్తున్నారు.

ఇలాంటి స్థితిలో మనం ఏవో కారణాలని ఏవో సమస్యలని చూపిస్తూ కూచోడం భావ్యం కాదు. సులభంగా దొరికే అడ్డదారుల వెంట నడవటం సమంజసం కాదు. దయచేసి ఆలోచించండి" సుదీర్ఘంగా, ఆవేశంగా మాట్లాడేవాడు సత్యం.

అతని వాగ్ధోరణి చాలామందిని ఆకట్టుకునేది.

అతను తన తొలి అస్త్రాన్ని ఎమ్యీవో మీద ఎక్కుపెట్టాడని వాళ్లు సులువుగానే అర్థం చేసుకున్నారు.

★ ★ ★

తమ ప్రయోజనాలు నెరవేరుతున్నప్పటికీ, అచ్యుతారావు పట్ల ఈమధ్య చాలామంది టీచర్లకి వ్యతిరేకత ఎక్కువ అవుతోంది. స్కూల్ విజిట్‌లూ, ఇన్‌స్పెక్షన్ల పేరుతోనూ బదిలీల బూచిని చూపించీ, తనడిగినంత చెల్లించనిదే బిల్లులు పాస్ కాకుండా తొక్కివుంచుతున్నాడు. ఇలా అతను గుంజుకునే డబ్బుకి అంతూ పొంతూ లేకపోవడం వారికి ఆగ్రహాన్ని కలిగిస్తోంది.

అతని అవినీతి పరాకాష్ఠనందుకుంది. అందుకే చాలామంది మరింక భరించలేకపోయారు. అచ్యుతారావు చర్యలని వ్యతిరేకిస్తూ మొదటినుంచీ ఎదురు తిరిగి నిలుస్తున్న సత్యంలాంటి వ్యక్తుల వెనుక చేరడానికి వారెవరూ సంకోచించలేదు.

ఆ అగ్ని అలా రాజుకుని రాజుకుని సెగలై పొగలై ప్రజ్వరిల్లి- చివరకు పెద్ద విస్ఫోటనానికి కారణమయింది.

దాని ఫలితంగా చివరికి అచ్యుతరావు అవినీతిపనులపై ఆ మండలంలోని ఉపాధ్యాయులందరూ కలిసి జిల్లా అధికారికీ, కలెక్టరుకీ విజ్ఞాపనపత్రం తయారుచేసి పంపించేవరకూ దారితీసింది.

చాలామంది టీచర్లు ఆ కాగితంమీద భయంఉన్నా మనస్ఫూర్తిగానే సంతకాలు చేశారు.

ఈ నిరసన వెల్లువని చూసి అచ్యుతరావు నిర్ఘాంతపోయాడు. కోపంతో దహించుకుపోయాడు. నిస్సహాయంగా వణికిపోయాడు.

టీచర్స్ యూనియన్‌వాళ్లు మండల కార్యాలయంముందు టెంట్‌వేసి అతనికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. పత్రికలవారు అచ్యుతరావు అవినీతిని తూర్పారబడుతూ వార్తలు ప్రచురిస్తున్నారు. ఇవన్నీ చూసి అతను బెంబేలెత్తిపోతున్నాడు.

ఈ పరిణామాలకి జడిసిపోయిన అచ్యుతరావు ఇంటికి కూడా వెళ్లడం మానేశాడు. లాడ్జిలో గదిలోనే విపరీతంగా తాగడం మొదలుపెట్టాడు. అతని త్రాగుడు మునపటికన్నా అధికమయింది.. ఇప్పుడతని చుట్టూ అతికొద్దిమంది మాత్రమే భజనపరులు చేరుతున్నారు. తాగుడు మైకంలో తనమీద పిటిషన్ పెట్టిన టీచర్లందరినీ నోటికొచ్చినట్టు తిడుతున్నాడు. ఈ గొడవేదో చల్లారేక ఆ కాగితంమీద సంతకాలు చేసిన వాళ్ళందరినీ సర్వనాశనం చేసిపారేస్తానంటూ ప్రగల్భాలు పలుకుతున్నాడు.

"నిజమేనయ్యా... నేను లంచగొండినే, తాగుబోతునే. దానిమీద సంతకాలు చేసినవాళ్ళలో ఎంతమంది నాకు లంచాలిచ్చి నాచేత పనులు చేయించుకోలేదు? నాతోపాటు ఇక్కడే తాగి తందనాలాడలేదూ? ఇవాళే వీళ్ళ కళ్లు తెరుచుకున్నాయా?" అంటూ గంగవెర్రులెత్తిపోతున్నాడు.

అది నిజమే! కానీ, జానకేశ్వరరావు అందరితో చెప్పినట్లు, ప్రతీ వ్యక్తికీ ఏదో ఒకదశలో ఆగి వెనక్కి తిరిగి చూసుకునేరోజు ఒకటి రాకతప్పదు.

అలాంటప్పుడేకదా, అచ్యుతరావులాంటివారికి మూడేది.



పులిపుట్టులో స్కూలు ఇప్పుడు కొత్త అందాలు సంతరించుకొంది.

బడికి వచ్చే పిల్లల సంఖ్య క్రమేపీ ఎక్కువ అవుతోంది. విద్యాసాగర్‌కి గ్రామస్థుల సహకారం ఇప్పుడు పూర్తిగా లభిస్తోంది.

బడి చుట్టూ వెదురుబద్దల ఫెన్సింగ్ వెలిసింది. ఆ ఆవరణలో కొబ్బరి, జామలాంటి చెట్లు పెరుగుతున్నాయి. రకరకాల పూలమొక్కలతో ఆ ప్రదేశం కనులవిందువుగా ఉంది. ఫెన్సింగ్‌నుండి బడిపాక ఎదురుద్వారంవరకూ తెల్లసున్నం వేసిన ఇటుకలు దారికి రెండువేపులా అందంగా పేర్చిఉన్నాయి.

విద్యాసాగర్ ఊళ్లో అందరికీ ప్రీతిపాత్రుడ య్యాడు. మంచి సలహా కావాలన్నా, చివరకు మంచిరోజెప్పుడో తెలుసుకోవాలన్నా ఇప్పు డందరూ అతన్నే ఆశ్రయిస్తున్నారు.

వీలు దొరికినప్పుడల్లా అతని దగ్గరకి సత్యం, జానకేశ్వరరావులు వచ్చి వెళ్తున్నారు. వచ్చినప్పుడల్లా జానకేశ్వరరావు తనకు తెలి సిన టౌనువార్తలు అందిస్తూ ఉంటాడు.

ఈమధ్య వచ్చినప్పుడు చాలా విషయాలు చెప్పేడతను. ఆదివారం ఒక్కరోజే అవ డంచేత విద్యాసాగర్ ఇంటికి వెళ్లలేదు. కొండంగి వెళ్లి జానకేశ్వరరావుని కలుద్దామా అనుకుంటున్నంతలో అతనే వచ్చి కలిశాడు.

బడి అభివృద్ధిని చూసి విద్యాసాగర్‌ని అభి నందించేడు.

"మనం ఉదాసీనభావం వెలిబుచ్చితే ఇక్కడ పిచ్చిమొక్కలు మొలుస్తాయి. మనం ఉత్సాహం చూపిస్తే ఇక్కడే పూలమొక్కలు విరబూస్తాయి. నీ బడి ఇప్పుడు పువ్వుల మొక్కలతో చూడ్డానికి చాలా అందంగా వుంది సుమా!" అని మెచ్చుకున్నాడు.

"థాంక్స్... టౌన్ వార్తలేమయినా తెలిశా యా?"

"అచ్యుతరావు మనమీద మండిపడిపోతు న్నారుట. తనమీద వచ్చిన కంప్లయింట్ ఎలా గయినా విత్‌డ్రా చేయించుకోవాలని శాయశ క్తులా కృషిచేస్తున్నారుట. టీచర్లని విడివిడిగా కలుసుకుని, కనీసం ఎంక్వయిరీ జరిగేనాటికి వాళ్లు తనకి అనుకూలంగా తిరిగేలా ప్రయ త్నాలు చేస్తున్నారని విన్నాను"

"సస్పెండ్ చేస్తారేమో అతన్ని. ఆ కుటుంబాన్ని తలుచుకుంటే విచారం కలుగు తోంది"

"అంతవరకూ రాకపోవచ్చు. బహుశా ఇక్క డినుంచి బదిలీ చేయొచ్చుననుకుంటాను"

"ఇంతగా దిగజారిపోయిన ఎమ్.యీ.వో. రాష్ట్రంలోమరొకరు లేరుకదూ?"

"అవినీతి అంతటావుంది. అన్నిరంగాల్లో నూ వుంది. అన్ని స్థాయిల్లోనూ ఉంది.

అయితే అవినీతిని ప్రోత్సహించే వ్యక్తుల సమూహం ఎక్కడ ఎక్కువగా ఉంటుందో అక్కడ అది మరింత విస్తృతరూపం ధరి స్తుంది.

దానికి అవినీతిపరులూ, అవినీతిని ప్రోత్స హించేవాళ్లూ కూడా బాధ్యత వహించక తప్ప దు. పుచ్చుకుంటున్నారని వీళ్లూ, ఇస్తున్నారు కదా అని వాళ్ళూ నెపం ఒకరిమీద ఒకరు నెట్టుకోవడం దివాళాకోరుతనమే అవుతుంది.

అచ్యుతరావు సంగతంటావా? పరిస్థితు లు ఇలా ఉన్నప్పుడు అలాంటి వ్యక్తులు తమ అవినీతి హస్తాలు మరింత దూరం చాస్తారు.

అందరూ అతనిలాగే ఉన్నారనికాదు. మంచివాళ్ళూ, ఉత్సాహంతో చిత్తశుద్ధితో పనిచే సేవాళ్ళూ కూడా చాలామంది లేకపోలేదు. కానీ వాళ్ళ ఉత్సాహం నీరుకార్చేంతగా ఇప్పుడీ రంగం ఇరుకైపోయింది.

అందుకే తరచుగా విమర్శల పాలవు తోంది. దీని పునాదులు మళ్లీ గట్టిపడాలంటే సమూలమైన మార్పులు జరక్క తప్పదు" అంటూ చెప్పుకుపోయాడు జానకేశ్వరరావు.

"పద్మ... పద్మ ఎలా ఉంది?" తటాలున అడిగేడు విద్యాసాగర్.

"పద్మని చూసి చాలారోజులయింది. ఆమ ధ్య బజారులో కాబోలు ఓసారి కలిసింది. బాగా చిక్కిపోయింది. అచ్యుతరావుగారు ఈమధ్య ఇంటిగురించి పట్టించుకోవడం పూర్తిగా మానే శారని విన్నాను"

పద్మ గురించి ఆలోచిస్తూ ఉంటే విద్యాసా గర్ మనసు బాధతో నిండిపోయింది. అచ్యుత రావుమీద కంప్లయింట్‌చేసి తాము తప్పు చే శామా అని ఓ క్షణం అనిపించింది.

జానకేశ్వర్రావు తనతో మాట్లాడి వెళ్లిపోయాక విద్యాసాగర్ మనసు ఇంటిమీదకి మళ్లింది.

చెల్లీ తమ్ముడూ ఎలా చదువుతున్నారో తెలీ దు. శాంతికి పదోతరగతి పరీక్షలు దగ్గరపడు తున్నాయి. ఈమధ్య చాలా రోజులుగా వాళ్ళ చదువుల గురించి పట్టించుకునే వ్యవధి కూడా తనకి చిక్కడంలేదు. వారానికో పదిరోజు లకో ఓసారి ఇంటికి వెళ్తాడన్నమాటే కాని వాళ్ళ గురించి, వాళ్ళ చదువుల గురించి అడిగి తెలుసుకోడానికి తీరికే లేకపోతోంది.




తనకి బియ్యాడీ టీచరుగా ప్రమోషన్ వస్తే ఇలాంటి ప్రాంతంలో పనిచేసే అవసరం వుండదు. కాస్త హైస్కూలు ఉండే చోటులో ఉంటాడు. ప్రమోషన్ వస్తే హైస్కూలులో వేస్తారు. కానీ తనకి ప్రమోషన్ వచ్చేసరికి ఎన్నేళ్లు పడుతుందో తెలీదు.

చెల్లెలు శాంతి బాగానే చదువుతుంది. ఏడో తరగతిలో మంచి మార్కులతోనే పాసయింది. తమ్ముడు మాత్రం ఆట ధ్యాసలోపడి చదువుని కొంచెం నిర్లక్ష్యం చేస్తూవుంటాడు. అయినా వాడు చాలా తెలివైనవాడు. కొంచెం శ్రద్ధపెడితే చాలా బాగా చదువుతాడు.

వాళ్ళ చదువుల గురించి తను పట్టించుకోలేకపోతున్నాడన్న ఆలోచన వచ్చినప్పుడల్లా విద్యాసాగర్‌కి తనకి టౌన్‌కి దగ్గరలో ఉన్న ఏదేనా ఊరికి బదిలీ అయితే బాగుండునని అనిపించేది.

బి.ఎస్సీ, ఎమ్.యి.డీ చేసి కూడా ఇలా కొండప్రాంతంలో ఎలిమెంటరీ స్కూలు టీచరుగా ఉండిపోవలసిరావడం బాధకలిగించేది. ప్రమోషన్ వస్తే కానీ హైస్కూలుకి వెళ్ళే వీలులేదు. తను చదువుకున్న చదువుకి కొంతలో కొంత సార్థకత చేకూరాలంటే ప్రమోషన్ రాకతప్పదు. బియ్యాడీగా తన సర్వీసు రెగ్యులరైజేషన్ అయితే తప్ప ఆ తర్వాత డిపార్టుమెంటు కోటాలో జూనియర్ లెక్చరరుగా కూడా ప్రమోషన్ వచ్చే అవకాశంలేదు.

ముందు తనకి స్కూలు అసిస్టెంటుగా ప్రమోషన్ రావాలి. హైస్కూల్లో పనిచెయ్యాలి.

ఎప్పుడయితే ప్రమోషన్ రావాలనే ఆలోచన అతనిలో వచ్చిందో, అప్పటినుంచీ విద్యాసాగర్ మరింక స్థిమితంగా ఉండలేకపోయాడు. జిల్లా కార్యాలయానికి వెళ్లి తన ప్రమోషన్ అవకాశాలను గురించి వాకబు చేశాడు. మూడు నాలుగేళ్ళలోపు తనకి ప్రమోషను వచ్చే అవకాశం ఎంతమాత్రం లేదని తెలుసుకుని కుంగిపోయాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ అతనిలో ఉత్సాహం తగ్గిపోవడం ప్రారంభించింది. రోజూ బడికెళ్ళడం, పాఠాలు చెప్పడం, ఇంటికి తిరిగొచ్చేక వండుకు తినడం. తన జీవితంలో ఏదో స్తబ్దత ఏర్పడినట్లు అతనికి తోచింది. పులిపుట్టులో తనకి ఎలాంటి ఇబ్బందీ లేదు. అక్కడి ప్రజలు అతన్ని ఆదరంగా చూసుకుంటున్నారు. అయినా ఆ ఎలిమెంటరీ స్కూలు పిల్లలకి అఆలు మాత్రమే చెప్పుకోవడంతో అతను సమాధానపడలేకపోతున్నాడు. సెలవులకి ఇంటికొచ్చినప్పుడు పులిపుట్టు నిశ్శబ్ద వాతావరణంలోంచి ఇక్కడి జనచైతన్యంలోకి వచ్చినప్పుడు అతనిలో ఏదో బాధ లోపల లోపల బయలుదేరేది.

తనేదో కోల్పోతున్న భావన విద్యాసాగర్‌ని తొలిచివేయడం ప్రారంభించిన సమయంలోనే నాలుగురోజులు వరసగా సెలవులు కలిసి వస్తే ఇంటికొచ్చేడతను.

వచ్చిన సాయంత్రమే పద్మని కలవడానికి అచ్యుతరావుగారి ఇంటికెళ్ళేడు. పద్మ అతన్ని చూస్తూనే నవ్వుతూ ఆహ్వానించింది.

"ఎలా ఉంది? మీ ఉద్యోగం?"

"బాగుంది. జీతం తీసుకుంటున్నందుకు నా డ్యూటీ సక్రమంగానే చెయ్యగలుగుతున్నందుకు తృప్తిగా ఉంది"

"నాన్నగారిమీద డి.య్యావోగారు ఎంక్వయిరీ జరిపించేరు"

పద్మ ఆ మాటలన్నాక విద్యాసాగర్ ముఖంలో విచారరేఖలు గోచరించాయి.

"క్షమించండి. ఆ పరిస్థితుల్లో అచ్యుతరావుగారిమీద అలా కంప్లయింట్ చెయ్యక తప్పలేదు"

పద్మ నవ్వి అంది... "మేష్టార్లు చేసిన దాంట్లో తప్పేమీలేదే. ఒకరోజు కాకపోతే మరో రోజు ఇలాంటి పరిస్థితిని నాన్నగారు ఎదుర్కోక తప్పదని నాకు తెలుసు. ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒకచోట దానికి తెరపడవలసిందే. నేనూ మీలాగే టీచర్నయిఉంటే ఆ పిటిషన్‌మీద మొదటి సంతకం నేనే చేసివుండేదాన్నేమో"

విద్యాసాగర్ ఆమెవేపు వింతగా చూశాడు.

"ఎంక్వయిరీ ఎలా జరిగింది?"

"బాగానే జరిగింది. డియ్యావోగారు చాలా నిక్కచ్చి మనిషి. అతని దృష్టికి అవకతవకలు వస్తే సహించరు. నాన్నగారికి గట్టిగా వార్నింగ్ ఇచ్చి వెళ్లేరు. సస్పెండ్ చేస్తామని బెదిరించే

రు. నేను వెళ్లి డియ్యీవోగార్ని కలుసుకుని మా ఇంటి పరిస్థితి వివరించి ప్రార్థించేక అతని కోపం తగ్గింది. బదిలీ చెయ్యడంతో సరిపెడతా రనుకుంటున్నాను''

''మీరు డియ్యీవోగారిని కలిశారా?'' ఆశ్చ ర్యంగా అడిగేడు విద్యాసాగర్.

''వెళ్లక తప్పలేదు. లేకపోతే మా కుటుంబం వీధిన పడిపోతుంది''

ఆమె మాటలు బాధకల్గించేయి విద్యాసా గర్‌కి. వీళ్ళ మాటలు విని అచ్యుతరావుగారి భార్య లోపలినుంచి వచ్చి ఓసారి అయి ష్టంగానే విద్యాసాగర్‌ని పలకరించి మళ్లీ లోప లకి వెళ్లిపోయింది.

''నాన్నగారిమీద కంప్లయింట్ చేశారని మీ మేష్టార్లమీద అమ్మకి కోపం'' నవ్వుతూ అంది పద్మ.

''నాన్నగారు ఊళ్లో లేరా?''

''లేరు. కేంప్ వెళ్లేరు. ఉంటే మీరిలా రావడం చూసి ఊరుకునే వాళ్ళా! అసలే మీమీద గొప్ప కోపంగా వుంది ఆయనకి''

వాళ్లలా మాట్లాడుకుంటూ ఉంటే బయట చీకటిపడింది. రవి ఆటనుంచి ఇంటికి వచ్చి విద్యాసాగర్‌ని చూసి పలకరింపుగా నవ్వేసి ఇంట్లోకి వెళ్లిపోయాడు.

''ఇక వస్తాను'' లేచి నిలబడ్డాడు విద్యాసా గర్.

''పదండి. నేనూ వస్తాను. బజారులో కొంచెం పనుంది'' అని తల్లితో చెప్పి తనూ బయలుదేరింది పద్మ.

దారిలో తను డియ్యీవోగారిని కలుసుకున్న విషయం, అతన్తో మాట్లాడిన సంగతులు అన్నీ విపులంగా చెప్పింది పద్మ.

★ ★ ★

''నాకూ తమ్ముడికీ వయసులో చాలా అంతరం వున్న సంగతి మీరు చూశారుకదూ... మధ్యలో పిల్లలు పుట్టకపోలేదు. నా తర్వాత ఇద్దరు పుట్టి చనిపోయారు. ఒక ఆడపిల్ల, ఒక మగపిల్లాడు. చెల్లి ఏడాది తిరక్కుండానే జ్వరం వచ్చి చచ్చిపోయింది. తమ్ముడు మాత్రం గాదాపు పదేళ్ళవరకూ బతికాడు'' నడుస్తూనే చెబుతోంది పద్మ.

మౌనంగా వింటున్నాడు విద్యాసాగర్.

''వాడి పేరు కీర్తి. పుడుతూనే అంగవైక ల్యంతో పుట్టేడు. చేతులు వంకర్లుపోయి, కాళ్లు చచ్చుబడిపోయి ఎప్పుడూ మంచాన పడి వుండేవాడు. అమ్మా నాన్నల దుఃఖానికి అంతూ పొంతూ వుండేదికాదు. వాడ్ని చూసి నాన్న తట్టుకోలేకపోయేవారు. అప్పుడు నాన్న స్కూల్ అసిస్టెంటుగానే పనిచేసేవారు. బాగానే వుండేవారు. ఎప్పుడోగాని తాగడం ఒక వ్యసనంగా వుండేదికాదు. రోజులు గడుస్తున్నకొ ద్దీ తమ్ముడి పరిస్థితి చూసి నాన్న మాన సికంగా మరింత దిగజారిపోయేరు. అశాంతి ఆయన మనసుని తొలిచివేస్తూ వుండేది. అంతకుముందు లేని కోపం, అసహనం ఆయ నలో ఎక్కువ కాసాగేయి. కదల్లేక మంచంలో పడుండేవాడే కాని తమ్ముడు మామూలుగానే అందరితో మాట్లాడేవాడు. ఏవేవో అడుగుతూ వుండేవాడు. వాడికి పరిచర్యలు చేస్తూ అమ్మ వాడిస్థితికి కుమిలిపోతూనే ఉండేది.

నేనింకా అప్పటికి చిన్నదాన్ని. వాడు లేచి నడవలేకపోవడం నాకు బాధకలిగించేది. కాని ఆ కష్టంలోని తీవ్రతని గుర్తించగలిగేంత వయసుకాదు నాది.

ఒక్కోరోజు నాన్న వాడిమీద చిరాకుపడిపో తూ ఉండేవారు. ఎంతో ఓర్పుతో ప్రవర్తించవల సిన నాన్న తమ్ముడిమీద అలా విరుచుకుపడి పోతూ వుంటే నాకు నోట మాట వచ్చేదికాదు. ఆ విషయంలో అమ్మకీ నాన్నకీ తీవ్ర వాదోపవా దాలు చెలరేగేవి.

ఒకసారి ఏదో కోపంలో మంచంమీద పడు న్నవాడి చెంపలు వాయించేరు నాన్న.

అమ్మ సహించలేకపోయింది. నాన్నగారి చొక్కా పట్టుకుని గుంజేస్తూ ఆయన్ని ఓ పక్కకి తోసేసింది.

''మీకేమీ దెయ్యం పట్టలేదుకదా? వాడు మనం కన్నబిడ్డండీ. మన కడుపున పడ్డందుకు వాడి ఖర్మ ఇలా కాలింది. అవిటి వాడన్న దయ కూడా లేకుండా వాడిమీద ఇలా విరుచుకుపడతారేం'' అంటూ నాన్నని తిట్టిపో సింది.

''అప్పటినుంచీ అమ్మ ఛీత్కారాలని నాన్న భరించలేకపోయేవారు. తమ్ముడంటే నాన్నకీ ఇష్టమే. ఒక్కోరోజు వాడ్ని ఎంతో ఆదరంగా చూసుకునేవారు. వాడు తన అవిటితనం మరిచిపోయేలా ఎంతో ధైర్యాన్ని నూరిపోసేవారు. కాని ఆయనలో ఆ నిబ్బరం, శాంతం ఎంతో సేపు నిలిచేవి కాదు. బాధని తట్టుకోలేకపోయేవారు. ఆ బాధ, వేదన చివరకి కోపంగా పరిణమించేవి. తననితాను మరిచిపోయి పశువులా ప్రవర్తించేవారు. ఆరోజుల్లోనే నాన్నగారిని ఎమ్.యి.వోగా వేశారు. పక్కదార్లో రాబడి అవకాశాలు పెరిగి నాన్నగారికి ఉన్న తాగుడు వ్యసనం ఎక్కువయిపోయింది.

ఇంటి పరిస్థితులు రోజురోజుకీ క్షీణించిపోసాగాయి. నాన్నగారు ఇంటి గురించి పట్టించుకోవడమే మానేశారు. అయాచితంగా వస్తున్న డబ్బుని విచ్చలవిడిగా ఖర్చు చేయడం, ఎప్పుడూ తాగుతూ ఉండడం. ఇంటి పొడగిట్టదు. అమ్మమీద అకారణంగా చెయ్యి చేసుకోవడం కూడా ఎక్కువయింది. పదోఏడు వచ్చేసరికి కీర్తి చచ్చిపోయాడు. వాడి మరణం నాన్నని మరింత దిగజార్చివేసింది. మా పరిస్థితులు మరింత దుర్భరమయిపోయాయి''

చెప్పడం ఆపి పద్మ విద్యాసాగర్ కళ్లలోకి చూస్తూ, ''ఇవన్నీ చెప్తూ మీ మనసు పాడుచేస్తున్నానేమో... ఎందుకో ఇవాళ మీతో ఇదంతా చెప్పాలనిపించింది. గుండెబరువు దించుకోడానికి నాకింతవరకూ మీలాంటి స్నేహితులే కరువయ్యారు...'' అంది.

''లేదు... లేదు. చెప్పండి'' అన్నాడు విద్యాసాగర్ తడబడుతూ.

కిరాణాషాపులో పద్మ తనకు కావలసినవి కొనుక్కున్నాక ఇంటికి తిరుగుముఖం పట్టేరిద్దరూ.

కాస్సేపు మౌనంతర్వాత అంది పద్మ, ''కీర్తి పోయాక చాలా యేళ్ళకి రవి పుట్టేడు. రవిని సరిగా చూసుకుంటారనీ, కీర్తినీ, వాడి మరణాన్ని మరిచిపోయి నాన్న తిరిగి మామూలు మనిషవుతారనీ ఆశించిన మాకు ఆశాభంగమే మిగిలింది. అక్రమార్జనలోపడి, ఆ ధ్యాసలోనే ఉండిపోయిన నాన్నగారు మారడానికి ఏమీ ప్రయత్నించలేదు. ఆయనను ధనదాహం పిశాచంలా పట్టుకుంది. అధికారంతో కూడిన పదవి మరింత పతనానికి బాటలు వేసింది.

''ఊరంతా అప్పులు... నాన్న ఇంటి సంగతి పట్టించుకోరు. బంధువుల సాయం మొదటి నుంచీ లేదు. మా చదువుల కోసం, బట్టల కోసం కూడా అమ్మ నాన్నగారితో పోట్లాడే పరిస్థితి. ఇలాంటి పరిస్థితుల్లో ఎలా డిగ్రీ పూర్తిచేశానో తలుచుకుంటే నాకే ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది. ఇంట్లో ప్రతిరోజూ పూటగడవని పరిస్థితి. నాన్న ఎప్పుడోగాని ఇల్లు చేరరు. ఇంటికి వచ్చినప్పుడల్లా అమ్మని ఏదో మిష మీద గొడ్డుని బాదినట్లు బాదుతూ ఉంటారు.

తిట్టినా, కొట్టినా ఏ కోపంలోనో ఇంత డబ్బు మా ముఖాన విసిరికొడుతూ ఉంటారు. అది చాలక నేను టైపు నేర్చుకుని ఓ లాయరుగారి దగ్గర చేరి నెలకి రెండొందలు తెచ్చుకుంటున్నాను. అయినా అదీ ఏ మూలకీ చాలడంలేదు.

మీరు చెప్పండి. ఇలాంటి పరిస్థితుల్లో నాన్నగారికి ఉద్యోగంపోతే మా గతి ఏమిటి? కనీసం ఆయన సస్పెండ్ అయినా మారోజులు వెళ్లమారేదెలా? అందుకే ధైర్యంచేసి డియ్యీవోగారిని ప్రైవేటుగా కలుసుకున్నాను. మా పరిస్థితులన్నీ ఆయనకి వివరించి చెప్పేను. ఆయన అర్థం చేసుకున్నారు. నాన్నగారికే గట్టిగా వార్నింగ్ ఇచ్చివెళ్లేరు''

ఎప్పుడూ ప్రసన్నంగా నవ్వుతున్నట్లు కనిపించే పద్మ జీవితంలో ఇంత విషాదం గూడుకట్టుకుని ఉందా?

విద్యాసాగర్ చలించిపోయేడు.

ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వారు ఉండిపోయి, అలా నడుస్తూ ఇల్లు చేరేసరికి వీధిగుమ్మంలోనే అచ్యుతరావుగారు ఎదురయ్యేరు.

వాళ్లిద్దరూ కలిసి రావడం చూసి, ఆయన ముఖం రంగులు మారిపోయాయి.

''నమస్కారమండీ'' అంటున్న విద్యాసాగర్ని పట్టించుకోకుండా విసురుగా ఇంట్లోకి వెళ్లిపోయారు.

విద్యాసాగర్ అవాక్కయిపోయాడు. ''సారీ...

నేను తిరిగి ఇక్కడివరకూ రాకుండా ఉండాల్సిందేమో'' అన్నాడు నొచ్చుకుంటూ.

''ఫరవాలేదు. మీరింక ఇంటికెళ్ళండి'' అంటూ ఇంట్లోకి దారితీసింది పద్మ.

ఇంట్లోకి వస్తున్న పద్మని చూస్తూనే ''వాడితో ఎందుకు తిరుగుతున్నావే?'' అంటూ అరికాలి మీద లేచిపోయారు అచ్యుతరావుగారు.

సందుమలుపు తిరిగేవరకూ అతని కేకలు విద్యాసాగర్ చెవినపడుతూనే వున్నాయి.

★ ★ ★

రెండురోజులుండి తిరిగి పులిపుట్టు వెళ్ళాడు విద్యాసాగర్.

అందరూ ఊహించినట్టుగాకాక అచ్యుతరావు సస్పెండ్ అయ్యారు.

పద్మపట్ల, అచ్యుతరావుగారి కుటుంబంపట్ల సానుభూతి ఏర్పడినా డియ్యీవోగారు చేయగలిగింది ఏమీ లేకపోయింది. రికార్డుల్లో అక్రమాలు, అవకతవకలు చేయడంవల్ల అచ్యుతరావు సస్పెండ్ అవడం అనివార్యమయిపోయింది.

ఈ విషయాలు తెలుసుకుని విద్యాసాగర్ బాధపడ్డాడు. అతనికి అచ్యుతరావుగారి కుటుంబం గురించి ఆందోళన ఎక్కువయింది. ఒక్కోసారి అతనిమీద కంప్లయింట్ చేసి తప్పు చేశామా అని కూడా అనిపించేది. తిలా పాపం తలా పిడికెడు అన్నట్టు, అచ్యుతరావుగారి అవినీతిలో చాలామందికి ఎంతో కొంత భాగస్వామ్యం వుంది. తనతోసహా!

ఇప్పుడతని కుటుంబం జరిగేదెలా? పద్మ ఎలా ఉందో? అచ్యుతరావుగారు చేసిన పనికి ఇప్పుడతని కుటుంబంలోని వారందరూ ఫలితం అనుభవించవలసివస్తోంది. అవినీతి చరమస్థితి దాదాపు ఇలాగే ఉంటుంది.

విద్యాసాగర్‌లో ఎందుకో ఇప్పుడు పూర్వపు ఉత్సాహం ఎంత ప్రయత్నించినా వుండడంలేదు. రోజూ స్కూలుకెళ్ళి వస్తున్నాడన్న మాటే కాని పనిలో పూర్తిగా మనసు లగ్నం చెయ్యలేకపోతున్నాడు.

ఒక్కోసారి గదిలో ఒంటరిగా మంచంమీద పడుకుని ఆలోచించుకుంటున్నప్పుడు తనలోని భావవైరుధ్యాలు ఒక్కొక్కటీ బయటపడుతూ ఉంటాయి. ఏదో చెయ్యాలనీ, సాధించాలనీ తనలో పట్టుదల ఎక్కువే. కాని ఆ ఆదర్శాలని చివరివరకూ నిలుపుకొనే తత్వం తనలో లేదేమో. ఏ చిన్న చిరుగాలికయినా చలించిపోయే వ్యక్తిత్వమేమో తనది.

పులిపుట్టు ప్రజలకి స్కూలు కోసం తన డబ్బు డొనేట్ చేశాడు. వాళ్ళలో తను స్కూలు అభివృద్ధి కోసమే నిరంతరం కృషి చెయ్యగలడనే ఆశలు రేకెత్తించాడు. ఇదంతా తాత్కాలిక ఆవేశమేనా?

ఇప్పుడీ గ్రామం తనకి ఇరుకైపోయినట్టు కనిపిస్తోంది. ఇక్కడ, ఈ కుగ్రామంలో ఎలిమెంటరీ స్కూలు పిల్లలకి అఆలు నేర్పుతూ గడిపెయ్యడంతో తనిప్పుడు సంతృప్తి పడలేకపోతున్నాడు. దాదాపు తన వయస్సున్నవాళ్ళే, తన అర్హతలున్నవాళ్లే డైరెక్టుగా బియ్యీడీ పోస్టులు సంపాదించుకుని హైస్కూళ్ళలో పని చేయడం అతనికి ఆవేదన కలిగిస్తోంది.

ఇక్కడ స్కూలు మేష్టారుగా తనకెంతో ఆదరం లభిస్తోంది. పిల్లలు కూడా తనపట్ల ఎంతో భక్తిశ్రద్ధలు కనబరుస్తున్నారు. అయినా తనలో ఏదో అసంతృప్తి రగులుకుంటోంది.

ఈ మారుమూల కుగ్రామంలో ఉండిపోయే నన్న భావం తను తట్టుకోలేకపోతున్నాడు.

ఎన్నో ద్వంద్వాల మధ్య అతని మనసు నలిగిపోతోంది. రోజులు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా గడిచేకొద్దీ విద్యాసాగర్‌లో ఈ అసంతృప్తి పెరుగుతూనే వచ్చింది.

'చాలామంది టీచర్లు ఈ మారుమూల గ్రామానికి రానేరారు. వచ్చి స్కూలు గురించి పట్టించుకోరు. తనలా కాదు. స్కూలు నిలబెట్టేడు, ఇన్నాళ్ళుగా పిల్లలకి పాఠాలు చెప్తూనే ఉన్నాడు. తన డ్యూటీ తను సక్రమంగానే నిర్వహిస్తున్నాడు. కాని ఉద్యోగజీవితంలో ఎదగాలని తను ఆశించడంలో తప్పేమీ లేదు కదా' అని తనని తను సమర్థించుకునేవాడు.

అచ్యుతరావుగారు సస్పెండ్ అయిన తొలిరోజులలో ఓసారి ఊరెళ్ళినప్పుడు పద్మని కలుద్దామని వెళ్ళాడు. ఆ కుటుంబం అక్కడ లేదు. సస్పెండ్ అయ్యాక కొన్నిరోజులు అక్కడే




ఉన్నారట. కాని రోజులు గడవడం కష్టమై ఎక్కడికో దూరపుబంధువుల ఇంటికి తప్పనిసరై వెళ్ళిపోయారుట. అచ్యుతరావుగారి సస్పెన్షను రివోక్‌చేసి మళ్లీ ఉద్యోగం ఇచ్చేరో లేదో ఆ వార్తలేవీ తెలియడంలేదు. అతని కుటుంబం ఇప్పుడెలా వుందో తెలీదు.

విద్యాసాగర్‌కి తను చిన్నప్పుడు మేనత్తగారింట్లో గడిపినరోజులు గుర్తొచ్చేయి. పద్మ కూడా అలాగే దూరపుబంధువుల ఇంట్లో నిరాదరణకీ, నిర్లక్ష్యానికీ గురవుతూ కుమిలిపోతోందా!

పద్మ గుర్తొచ్చినప్పుడల్లా ఒక అపేక్షాభావం అతనిలో కలుగుతూ ఉంటుంది.

తను... తను పద్మని ప్రేమిస్తున్నాడా? అనిపిస్తుంది ఒక్కోసారి.

కాని పద్మపట్ల తన ఇష్టానికి ప్రేమ అని పేరు పెట్టడానికి అతని మనసు ఒప్పుకోదు.

ఆమె తనకి మంచి స్నేహితురాలు.

అంతే!

స్నేహితురాలి కోసం ఏం చెయ్యగలిగేడు తను?

వాళ్ల కుటుంబం వీధినపడితే చూస్తూ నిర్లిప్తంగా ఊరుకోవడం తప్ప తనేమీ చేయలేకపోయాడు.

అచ్యుతరావుగారు సస్పెండ్ అయిన ఏడాది తిరక్కుండానే ఆయన మరణించారన్న వార్త తెలిసి విద్యాసాగర్ నిర్ఘాంతపోయాడు. ఇది ఎవరూ ఊహించనిది. మితిమీరిన వ్యసనం. సస్పెండ్ కావడంవల్ల దిగజారిన పరిస్థితులూ అతని చావుకి దారితీశాయి. అంతకుముందే అతను కడుపులో అల్సర్లతో బాధపడుతున్నాడనీ, చివరకి అది ముదిరి అతను హఠాత్తుగా కన్నుమూసేడనీ తెలిసి విద్యాసాగర్ చలించిపోయాడు. వెళ్లి పద్మను చూసివద్దామని ఎంతగానో ప్రయత్నించేడు. కాని ఆమె అడ్రస్ దొరకలేదు. సత్యంకాని, జానకేశ్వరరావు కాని ఆమె గురించి వివరాలేమీ చెప్పలేకపోయారు.

రోజులు తెలియకుండానే తిరిగిపోయాయి. విద్యాసాగర్‌లో అతనికి తెలీకుండానే ఒక అనూహ్యమయిన మార్పు చోటు చేసుకోవడం మొదలయింది. పూర్వంలాగా సంతోషంగా ఉండలేకపోతున్నాడు. పద్మ అప్పుడప్పుడు గుర్తొస్తూ ఉంటుంది. స్నేహితులని కలుసుకోవడం కూడా తగ్గిపోయింది. ఉద్యోగంలో చేరి ఏడాది దాటుతోంది. అతని మనసు ఇప్పుడు తనకి బియ్యాడీ టీచరుగా ప్రమోషన్ రావాలని తహతహలాడుతోంది. పులిపుట్టులో జీవితం నిస్సారంగా తోస్తోంది.

తన జీవితంలో ఏదో మొనాటనీ బయలుదేరిందని అతను గుర్తించలేకపోయాడు.

ప్రమోషన్ రావాలి. హైస్కూల్లో టీచరుగా పనిచెయ్యాలి. బి.ఎస్సీ, బియ్యాడీతోపాటు ఎమ్.యి.డీ కూడా చేసిన తను ఈ మారుమూల కుగ్రామంలో పిల్లలకి అఆలు నేర్పిస్తూ గడపడం అతనికి కష్టంగా తోచడం మొదలయింది. తన చదువుకి ఇది సార్థకత కాదేమో! తనింకా ఎంతో ఎదగాలి. మొదట స్కూలు అసిస్టెంటుగా, తర్వాత జూనియర్ లెక్చరరుగా ఈ మొనాటనీ ఎంతోకాలం భరించలేడనిపించింది.

ఇక్కడ ఒక అంతంలేని నిశ్శబ్దం. ఎదుగూ బొదుగూలేని జీవితం. ఈ ఆలోచన వచ్చేక, ఆ అసంతృప్తి జ్వాల అతనికి తెలియకుండానే క్రమేపీ పెద్దది కాసాగింది.

పదోతరగతి పరీక్షలో శాంతి తప్పింది. తర్వాత సప్లిమెంటరీ పరీక్షల్లో కూడా ఏదో ఒక సబ్జెక్టులో తప్పుతూనే ఉంది. ఇది అతని మనోబలాన్ని మరింత కుంగదీస్తోంది. వెంకుబాబు బాగా చదువుతాడు. తను వాళ్ళ చదువుల గురించి పట్టించుకోలేకపోతున్నాడేమో అనే బాధ విద్యాసాగర్‌లో తొలిచివేస్తోంది.

ప్రమోషన్ వచ్చితీరాలన్న ఆలోచన అతనిలో మొదట బీజప్రాయంగా ఏర్పడి పెద్దదవడానికి దోహదం చేసిన సంఘటన గుర్తుతెచ్చుకున్నప్పుడల్లా అతనిలో ఒక అలజడి ప్రారంభమవుతూ ఉంటుంది. ఒక న్యూనతాభావమేదో అతన్ని పట్టి పీడిస్తున్నట్టుంటుంది.

శాంతికి రెండోసారి పరీక్షఫీజు కట్టడానికి ఊర్లో హైస్కూలుకి వెళ్లాడు. ఏవో సెలవులు కలిసి వస్తే వచ్చేడతను. రెండురోజుల సెలవులూ అయిపోయాక మరోరోజు క్యాజువల్ లీవు పెట్టి చెల్లెలి ఫీజు కడదామని హైస్కూలుకి

వెళ్ళేడు. అక్కడ టీచర్లలో కొందరితో తనకి ఇంతకుముందే పరిచయం వుంది. వాళ్లలో కొందరు తనలాగే బిఎస్సీ బియ్యీడీతోపాటు ఎమ్.యి.డీ క్వాలిఫికేషన్‌తో పనిచేస్తున్నారు. వాళ్లు జూనియర్ లెక్చరర్లగా ప్రమోషన్ విషయమే మాట్లాడుకుంటున్నారు.

విద్యాసాగర్‌ని చూసి అతనితో బాగా పరిచయం ఉన్న టీచర్, అతని రాకను గురించి అడిగి తెలుసుకున్నాడు. శాంతి ఫీజు కట్టడానికొచ్చినట్లు చెప్పగానే అతను పెదవి విరుస్తూ "అదేమిటండీ... మీరేం చేస్తున్నారు. చదువు తోందో లేదో చూసుకోలేకపోయారా. టీచర్లయి ఉండీ మన పిల్లల పరీక్షలు పోవడం ఏవిటి సార్. ఏదో ఏర్పాటు చెయ్యలేకపోయేరా" అన్నాడు. ఆ మాటల వెనుక అంతరార్థం విద్యాసాగర్‌కి తర్వాత ఎప్పుడోకాని అవగతం కాలేదు.

ఆ తర్వాత సంభాషణ విద్యాసాగర్ పనిచేస్తున్న గ్రామం గురించి, అతని ఉద్యోగం గురించి సాగింది, "మీకేమిటి సార్... అదృష్టవంతులు. మాకన్నా ఎంతలేదన్నా అయిదొందలజీతం ఎక్కువ వస్తుంది. మాలాగా బెల్లుకొడితే క్లాసులకి పరిగెత్తాలన్న బాధలేదు. క్యాజువల్ లీవు దొరుకుతుందా లేదా అన్న బెడదలేదు. సింగిల్ టీచరు ఉద్యోగం... అదీ ఎక్కడో మారుమూల ప్రాంతంలో"

ఆ మాటలు విద్యాసాగర్‌లో ఎక్కడో మారుమూల మనసులో దాగిన అసంతృప్తిని నిద్రలేపాయి. ఏదో కోల్పోతున్న భావం అతనిలో తొలిసారిగా బయలుదేరింది. తను పొందలేకపోతున్నదీ, వాళ్లు పొందుతున్నదీ ఏదో ఉందని అనిపించింది.

ప్రమోషన్ విషయం ఏదో అడగబోయాడు విద్యాసాగర్. "ఏం ప్రమోషనులెద్దురూ మేం ఏం బావుకుంటున్నాం చెప్పండి. వర్క్‌లోడు ఎక్కువ. గాడిదచాకిరీ. ఆపాటి జీతం వస్తే పాఠాలు చెప్పక్కర్లేకుండా బెల్లుకొట్టే అటెండరు పనిచెయ్యడానికయినా సిద్ధమే" ఒకవ్యక్తి నాన్చేసి చెప్పేడు. ఆ తర్వాత సంభాషణ హాస్యంలోకి దిగింది.

"అలవెన్సులూ అవీ బాగానే వొస్తాయి కానీ ఒకటే విచారించాల్సిన విషయం... అసలే మేష్టారికి పిల్లనివ్వాలంటే పెదవి విరుస్తారు. ఎందుకంటే జీతమే తప్ప గీతం వుండదు కనుక. అలాంటిది గురువుగారికింకా పెళ్లి కానట్టుంది. ఆ కొండల్లో కాపరానికి ఏ ఆడపిల్ల సిద్ధపడుతుంది చెప్పండి" అని వెకిలిగా, అక్కర్లేనంత చనువు తీసుకొని అన్నాడొకాయన.

అది విని విరగబడి నవ్వేరందరూ...

అతను సారీ చెప్పాడు.

ఈ సంఘటనతో విద్యాసాగర్ చిన్నబోయాడు. పల్లెటూరి ప్రజలపట్ల పట్నవాసులు చూపించే ఒకవిధమయిన చులకనభావం లాంటిదేదో అతనికి అక్కడ ఎదురయినట్టనిపించింది. గిల్టీగా ఫీలయ్యాడు.

ఆ తర్వాత పులిపుట్టు వచ్చేక కూడా ఆ ఆలోచనలు అతన్ని వదలలేదు. ప్రమోషన్ కోసం ఎదురుతెన్నులు చూస్తూ ఆ ఊరు వదలి ఎప్పుడు బయటపడదామా అని ఎదురుచూడసాగేడు. ఎప్పుడేనా సత్యంకాని, జానకేశ్వరరావు కాని కలిసినప్పుడు అతను వాళ్ళతో మాట్లాడే విషయం ఒకటే- ప్రమోషన్. విద్యాసాగర్‌లో వస్తున్న ఈ మార్పులు గమనించీ గమనించనట్టుగా ఉండిపోయారు వాళ్లు.

పులిపుట్టు జీవితంలో అనివార్యంగా భరించవలసివస్తున్న స్తబ్దతని అతను తట్టుకోలేకపోతున్నాడు.

మరో మూడేళ్ళు గడిచాక చివరికి ఎలాగయితేనేం అతను ఎదురుచూస్తున్నరోజు రానేవచ్చింది.

బి.యి.డీ. టీచరుగా ప్రమోట్ చేస్తూ ఆర్డరు అందినరోజున అతని ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. కొత్తగా ఇప్పుడే ఉద్యోగం దొరికినంతగా సంతోషించేడు. తన ఉద్యోగ జీవితంలో ఒక అంకానికి తెరపడి మరోటి మొదలు కాబోతున్నందుకు అతని మనసు తృప్తితో నిండిపోయింది. సత్యానికీ, జానకేశ్వరరావుకీ కూడా ప్రమోషన్లిచ్చి వేరువేరు స్కూళ్లలో వేశారు.

పులిపుట్టులో రిలీవ్అయి వచ్చేసేటప్పుడు మాత్రం విద్యాసాగర్‌ని ఏదో దిగులు ఆవ




రించింది. అక్కడివాళ్లు తనతోపాటు చాలాదూరంవరకు వచ్చి వీడ్కోలు చెప్పేరు. కొందరయితే అతని సామాను మోసుకుంటూ బస్‌పాయంట్ వరకూ వచ్చేరు.

ఆఖరిసారిగా ప్రెసిడెంట్ అతనికి చేతులు జోడించి "మేష్టారుగారూ... మీరొచ్చి బడి బాగు చేసినారు. మా పిల్లల్లకి నాలుగచ్చరాలు వచ్చినయి. ఇప్పుడు మీరెల్లిపోనాక మల్లా ఏటవుద్దో తెల్దు. మల్ల ఎవులేనా మీనాగా వొస్తారో, రారో, బడి సెప్పుకుంటారో, నేక మూతబడుద్దో తెల్దు. మీరిప్పుడు పెద్ద మేష్టు అయినారు. అదొగ్గిసి మాకాడ ఉండిపోమని సెప్పలేంగద? బాబూ, మీ అయ్యనీ, అమ్మగోర్నీ అడిగేమని సెప్పండి. దేముడు మిమ్మల్ని సల్లగా నూడాలి...." అని చెప్తున్నప్పుడు మాత్రం విద్యాసాగర్‌కి మనను కలచివేసినట్లయింది.

బరువెక్కిన గుండెతో బయలుదేరాడు.

'నాకోసం నేను చూసుకోనంత గొప్పమనసే మీ నాకు లేదు. వెళ్లొస్తాను. మన్నించండి మిత్రులారా... గుడ్‌బై టు పులిపుట్టు' మనను లోనే అనుకున్నాడు ఆర్తిగా.

★ ★ ★

హైస్కూల్లో జాయినవడానికి వెళ్లినపుడు అక్కడ పద్మ కనిపించడం చూసి, తన కళ్లని తనే నమ్మలేకపోయేడు విద్యాసాగర్.

"మీరు... మీరిక్కడ..." సంభ్రమంతో నోట మాట రాలేదతనికి.

"నేనిక్కడ రికార్డ్ అసిస్టెంటుగా పని చేస్తున్నాను. నాన్నగారు పోయేక డిసీజ్‌డ్ ఎంప్లాయీ కోటాలో ఉద్యోగానికి ప్రయత్నం చేశాను. వేకెన్సీలు లేక జాప్యం జరిగింది. చివరకి ఇక్కడ వేశారు"

ఆమెకి ఉద్యోగం వచ్చినందుకు సంతోషాన్ని వ్యక్తపరచాలో, అచ్యుతరావుగారి మరణానికి సంతాపం తెలియజేయాలో తెలీక ఆమె చెప్పినదానికి తల పంకించేడు విద్యాసాగర్.

హెడ్మాస్టరుకి తన ప్రమోషన్ ఆర్డరు, ఎమ్.డీ.వో. గారిచ్చిన రిలీవింగ్ సర్టిఫికేటూ అందించేడు.

"ఓ! మీరేనా విద్యాసాగర్... వెరీగుడ్... చాలా సంతోషం. కూచోండి... మీ ఆర్డరు మా స్కూలుకి మొన్ననే వచ్చింది. మీ గురించి పద్మగారు చెప్పేరు..." నవ్వుతూ ఆ కాగితాలు అందుకున్నాడు హెడ్మాష్టరు.

జాయినింగ్ రిపోర్టు రాసిచ్చేక అటెండెన్స్ రిజిష్టరులో సంతకం చేసేడు విద్యాసాగర్. తెలిసిన వ్యక్తి, అందులోకీ పద్మలాంటి ఆత్మీయురాలు అక్కడ ఉండడం అతనికి సంతోషాన్ని కలిగిస్తోంది.

టీచర్లు ఒక్కొక్కరే పరిచయం అయ్యేరు. మొత్తం స్టాఫ్ ఇరవైమంది. అందులో టీచింగ్ స్టాఫ్ పదిహారుమంది. అయిదుగురు బియ్యీడీ టీచర్లు, ఒక గ్రేడ్ వన్ తెలుగు పండితుడూ, మరో గ్రేడ్ టూ తెలుగు పండితుడూ ఉన్నారు. వీరు కాక క్రాఫ్టు, డ్రాయింగు, డ్రిల్లు టీచర్లు. సెకండరీగ్రేడు టీచర్లు నలుగురు. హెడ్మాష్టరు పేరు వెంకటేశ్వరరావు. టీచింగ్ స్టాఫ్ కాక ఇద్దరు రికార్డ్ అసిస్టెంటులూ, ఇద్దరు అటెండర్లూ, ఒక నైట్ వాచ్‌మన్ ఉన్నారు. వాళ్లతో కలిపితే మొత్తం ఇరవైమంది దాకా ఉన్నారు.

స్కూల్ ఎల్‌షేప్‌లో మొత్తం ఎనిమిది గదులు స్లాబ్ బిల్డింగ్. చుట్టూ ప్రహరీ ఉంది. ప్రహరీలోపల ఏపుగా పెరిగిన చెట్లూ, ఓ మూల పిల్లల యూరినల్సుకి గదులూ, దానికి ఎడమవేపు ఓ బోరింగ్ నీళ్ల పంపూ ఉన్నాయి.

హెడ్మాష్టరు గదిలో ఓ పెద్ద టేబులూ, దాని ముందు లీజరున్న టీచర్లు కూచోడానికి ఓ నాలుగు కుర్చీలూ, ఓ పెద్ద బల్లవేసి ఉన్నాయి. ఆ గదిలోనే రికార్డులు ఉంచుకోడానికి పెద్ద కర్ర బీరువాలు నాలుగున్నాయి. అదే గదిలో బీరువాలకి వెనకవేపు పద్మకీ, మరొక రికార్డు అసిస్టెంటుకీ పనిచేసుకోడానికి టేబుళ్లు, కుర్చీలు వేసి వున్నాయి. ఆ గది గోడల మీద స్టాఫ్ పేటర్న్ తాలూకు వివరాలు, రోజువారీ పీరియడ్లకి సంబంధించిన టైంటేబులు రాయబడి ఉన్నాయి.

తను పనిచేసిన పులిపుట్టు స్కూలుతో పోల్చి చూస్తే ఈ స్కూలు చాలా పెద్దదనే చెప్పాలి. అక్కడ తనొక్కడే టీచరు. ఇక్కడ ఇంతమందిని చూస్తూంటే సంతోషమనిపిస్తోంది విద్యాసాగర్‌కి. అక్కడి పిల్లలకీ ఇక్కడి పిల్లలకీ ఎంత వ్యత్యాసం! ఒంటిమీద సరిగా చొక్కా కూడా వేసుకోకుండా, జారిపోయే

లాగుల్ని పైకి లాక్కుంటూ బడికి వచ్చే వాళ్లని సంస్కరించడానికి తను చాలా శ్రమ పడవలసి వచ్చింది. ఇక్కడ స్కూలు పిల్లలతో కళకళలాడిపోతోంది. తను చదువుకున్న చదువుకి కాస్తయినా సార్థకత చేకూరే చోటు ఇదేనని పించింది.

హైస్కూలునీ, ఆ వాతావరణాన్నీ చూసేక పులిపుట్టు వదిలి వచ్చేస్తున్నపుడు కలిగిన దిగులుని త్వరలోనే మరిచిపోగలిగేడు విద్యాసాగర్.

''మీరిక్కడ ఇల్లేమయినా తీసుకుంటారా?'' ఓ సైన్సు టీచరు అడిగేడు.

''తీసుకోవాలి... మా ఊరినుంచి ఇక్కడకి రోజూ బస్‌మీద తిరగడం కష్టం. ఏదో ఇల్లు తీసుకుని అమ్మనీ, చెల్లినీ, తమ్ముడ్నీ తీసుకొద్దామనుకుంటున్నాను. నాకిక్కడకి ట్రాన్స్‌ఫరయ్యేక ముందిక్కడ నేను ఒంటరిగా గది తీసుకుని ఏ హొటల్లోనో భోజనం చేసి గడిపేద్దామనుకున్నాను. కానీ పులిపుట్టులో గత నాలుగేళ్ళూ ఒంటరిగా ఉంటూ స్వయంపాకం చేసుకు తినడంవల్ల నా ఆరోగ్యం చెడిపోయిందని మా నాన్నగారే అందుకు ఒప్పుకోలేదు. అదీకాక చెల్లెలూ, తమ్ముడూ చదువులు నేను దగ్గరుండి చూసుకోవాల్సిఉంది'' చెప్పాడు విద్యాసాగర్.

''మరి... మీ నాన్నగారక్కడ ఒంటరిగా ఉండాల్సి వస్తుందేమో, ఆయన భోజనం వగైరాలు...'' మరో టీచరు సందేహం వెలిబుచ్చేడు.

''అదేంలేదు. ఆయన వంటకి యిబ్బంది లేదు. మా బంధువొకావిడ ఉంది'' అతనికి జవాబిచ్చి విద్యాసాగర్ మళ్ళీ అతన్నే అడిగేడు - ''వీలయినంత త్వరలో యిల్లు చూసుకుని అమ్మావాళ్ళనీ తీసుకురావాలనుకుంటున్నాను. దయచేసి అద్దె యిల్లు చూసుకోవడంలో నాకు కొంచెం హెల్ప్ చేస్తారా?''

''అలాగే, దానికేం భాగ్యం?'' అతను భరోసా యిచ్చేడు.

అప్పటికి లాంగ్‌బెల్ కొట్టడంతో అన్ని గదుల్లోంచీ పిల్లలు బిలబిలలాడుతూ బయటకి వచ్చేరు. టీచర్లు కూడా ఎవరిళ్ళకి వారు వెళ్ళిపోయేరు.

ఇల్లు అద్దెకి దొరికేవరకూ విద్యాసాగర్ స్కూల్లోనే ఓ గదిలో ఉండొచ్చని చెప్పి హెడ్మాష్టరు వెళ్ళిపోయేరు.

''రేపటినుంచి హొటలు భోజనం చేద్దురుగానీండి. ఈ పూటకి మా యింట్లో మాతోపాటు భోజనానికి రండి'' అని పద్మ బలవంతం చేస్తే విద్యాసాగర్‌కి వెళ్ళక తప్పలేదు.

★ ★ ★

పద్మ ఉంటున్న యిల్లు స్కూలుకి దగ్గిరే. చిన్న యిల్లు. ముందు చిన్న వసారా తర్వాత రెండు గదులు. అంతే... ఓ గది పడకలకీ, రెండోగది వంటకీ, భోజనాలకీ ఉపయోగిస్తున్నారు.

విద్యాసాగర్‌ని చూసి అచ్యుతరావుగారి భార్య పోల్చుకోలేకపోయేరు. పద్మ అతన్ని తల్లికి పరిచయం చేసింది.

ఆవిడ్ని చూస్తుంటే విద్యాసాగర్‌కి చాలా బాధ అనిపించింది. భర్త పోయిన దుఃఖంనుంచి యిప్పటికీ యింకా తేరుకున్నట్టు లేదావిడ. మనిషి బాగా చిక్కిపోయి ప్రాణాలు కళ్ళలోకి వచ్చినట్టు దీనంగా కనిపిస్తోంది.

ఇంతలో పద్మ తమ్ముడు రవి స్కూలు నుంచి వచ్చేడు. వస్తూనే స్కూలు బేగ్ టేబిలు మీద పెడ్తూ విద్యాసాగర్‌ని చూసి పోల్చుకున్నాడు. వాడి కళ్ళు సంతోషంతో మెరిశాయి.

''నమస్కారమండీ'' అన్నాడు చేతులు జోడిస్తూ.

విద్యాసాగర్ ఆ అబ్బాయి వేపు నవ్వుతూ చూసి ''గుడ్... గుర్తున్నానన్నమాట... యిప్పుడేం చదువుతున్నావోయ్?'' అనడిగేడు.

''మన హైస్కూల్లోనే, ఆరోతరగతిలోకొచ్చేడు'' పద్మ చెప్పింది.

ఆ తర్వాత భోజనాలు చేస్తుండగా పద్మ అడిగింది ''ఇల్లు చూసుకున్నాక అమ్మగార్నీ వాళ్ళనీ యిక్కడకి తీసుకొచ్చేస్తారన్నమాట''

''అవును... నాన్నగారికి వండి పెట్టడానికి మా అత్తయ్య ఒకావిడ ఉంది. నాన్నగారు ఆమెని తీసుకొస్తున్నారు''

''మీ అత్తయ్యంటే... మీరు చిన్నతనంలో వాళ్ళ యింట్లో కొంతకాలం గడపవలసివ




చ్చిందని ఓసారి చెప్పారు. ఆవిడేనా?'' గుర్తుకు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ అంది పద్మ.

''ఆవిడే... మా అచ్యుతాంబ అత్తయ్య... ఆ పల్లెటూర్లో యిప్పుడామె పరిస్థితి ఏమీ బాగులేదు. ఒక్కర్తీ ఉండలేకపోతోంది. పంటలు బాగా పండక ఉన్న భూమి కాస్త అమ్ముకుని ఆ వచ్చిన డబ్బుతో యింతకాలం నెట్టుకువస్తోంది. వయసు పైబడుతూ ఉండడంతో ఒక్కర్తీ ఉండలేక మా దగ్గరకి వచ్చేస్తానంటూ చాలా రోజులుగా ఉత్తరాలు రాస్తోంది. అమ్మ ఆవిడ్ని తీసుకురమ్మని చెప్తున్నా నాన్నగారే తాత్సారం చేస్తూ వచ్చేరు. ఇప్పుడిక తీసుకురాక తప్పదు. ఎంతయినా రక్తసంబంధం వొదులుకోలేరు కదా''

భోజనాలయ్యేక కాసేపు అక్కడే ఉండి, ''వెళ్ళొస్తా''నని చెప్పి బయలుదేరాడు విద్యాసాగర్.



పెద్దగా శ్రమ పడకుండానే యిల్లు అద్దెకి దొరికింది. నాలుగు గదుల యిల్లు. విశాలంగానే ఉంది. నీటి సదుపాయం అదీ బాగానే ఉంది.

ఇల్లు అద్దెకి దొరికేక ఓ రెండురోజులు సెలవు పెట్టి సామానుతోపాటు తల్లినీ, శాంతినీ, వెంకుబాబునీ తీసుకొచ్చేడు విద్యాసాగర్. వెంకుబాబుని హైస్కూల్లోనే జాయిన్‌చేశాడు. శాంతి రిజల్టుకోసం ఎదురుచూస్తోంది. తమ్ముడు పదోతరగతిలోకి వచ్చినా, తనుమాత్రం యిప్పటివరకూ పదోతరగతి పాస్ కాకపోవడంతో ఎప్పుడూ దిగులుగా కూచుంటూ ఉంటుంది. చదువంటే ఆ పిల్లకి పూర్తిగా ఆసక్తి తగ్గిపోయింది. ఇంట్లో వాళ్ళ పోరు పడలేక ఎప్పుడైనా పుస్తకం చేత్తో పట్టుకున్నా ఊరికే పేజీలు తిరగేస్తూ కూచోవడం తప్ప ఒక్క అక్షరం తలకెక్కించుకోదు.

ఏడోతరగతిలో మంచి మార్కులతోనే పాసయినా ఆ తర్వాత పదోతరగతివరకూ చదువుని నిర్లక్ష్యం చేసింది. వెంకుబాబు చదువు కూడా అంతంతమాత్రంగానే ఉంది.

ప్రైవేటు క్లినిక్స్‌లో వైద్యం చేయించుకునే తాహతులేనివారిపట్ల ప్రభుత్వ ఆసుపత్రులు ఎలా శాపంగా పరిణమిస్తున్నాయో, అలాగే యిలాంటి స్కూళ్ళలో చదవాల్సివచ్చిన పిల్లల భవిష్యత్తు కూడా అనిశ్చితంగా తయారవుతోంది. చదువులో ఒక కొత్త పోటీ ప్రపంచం ఏర్పడింది. ఒక పరుగుపందెం మొదలయింది. ఆ పోటీకి తట్టుకోలేనివారూ, ఆ పరుగు వేగాన్ని అందుకోలేనివారూ వెనక్కి ఉండిపోయి ఓడిపోక తప్పడంలేదు.

ఎన్ని కొత్త మార్పులు ప్రవేశపెట్టినా, ఎంత ప్రయత్నించినా ప్రభుత్వ పాఠశాలలు మెరుగుపడడంలేదు. వాటిమీద చులకన భావం పెరుగుతోందేతప్ప తగ్గడంలేదు.

ఎక్కడో ఓ మెరుపు మెరిసినట్టు ఓ విద్యార్థి ముందుకు దూసుకుపోతాడు. అలా మంచి ప్రతిభ చూపించే విద్యార్థులశాతం పరీక్షల్లో కనీస ఉత్తీర్ణతకి కూడా మార్కులు సాధించలేకపోతున్న వారితో పోలిస్తే చాలా తక్కువగా ఉంటోంది. పరీక్షా ఫలితాలు చూస్తే సెకెండరీ విద్య ఏస్థాయిలో ఉందో తేటతెల్లమవుతూనే ఉంటుంది.

ఎక్కడో లోపం ఉంది.

ఎవరు దీనికి జవాబుదారీ?

ఎందుకు దీని పునాదులు యింతగా బలహీనపడ్డాయి?

ఎంత ఆలోచించినా విద్యాసాగర్‌కి సమాధానాలు దొరకలేదు.

విద్యాసాగర్ మనసంతా అదోలా తయారయింది.

ఈ పునాదులు కదిలిపోకుండా ఉండాలంటే అందరూ కలిసి ఏదో చెయ్యాలి. వికా

సించాల్సిన పువ్వులెన్నో మొగ్గలోనే వాడి వత్తలై రాలిపోకూడదు.

ఈ చదువులింక చీకటిదారుల్లో ప్రయాణాలు కాకూడదు. రోజులు గడుస్తున్నకొద్దీ విద్యాసాగర్‌కి హైస్కూలు వాతావరణం అలవాటవుతోంది.

కొత్త ఉద్యోగంలో కొత్త అనుభవాలు ఎదురవుతున్నాయి.

★ ★ ★

ఆ హైస్కూలు బిల్డింగు బయటకి కనిపిస్తున్నంత దృఢంగా ఏమీ లేదని క్లాస్ చెప్పడానికి వెళ్ళిన మొదటిరోజునే అర్థమయింది విద్యాసాగర్‌కి.

చాలావరకూ క్లాస్‌రూముల్లో గోడలు బీటలు వారి వున్నాయి. గచ్చులు ఊడిపోయి ఉన్నాయి. ఒకటో, రెండో తరగతుల్లో తప్ప తక్కిన అన్ని గదుల్లోనూ పిల్లలు బెంచీలు లేకపోవడంతో నేలమీదే కూర్చుంటున్నారు. ఆ యిరుకు గదుల్లో దాదాపు అరవైయ్యేసిమంది పిల్లలు కూచోవడం చూస్తే విద్యాసాగర్‌కి మతిపోయింది. ఏ గదిలోనూ బ్లాక్‌బోర్డులు కూడా సరిగా లేవు. ఆ బిల్డింగ్‌కి రిపేర్లు జరిగి చాలా యేళ్ళయినట్టుగా ఉంది. గోడలకిమాత్రం యిటీవలే వెల్ల వేయించినట్టున్నారు.

వెల్ల వేసిన గోడలు, ఆ భవన శిథిలత్వాన్ని ఎంత ప్రయత్నించినా మరుగుపర్చలేకపోతున్నాయి.

"వీటికి రిపేర్లు జరిగి చాలా రోజులైనట్టుంది. యిలా ఉంటే ప్రమాదమేమో" ఒక రోజు లీజర్ అవర్లో హెడ్మాష్టర్‌తో మాట్లాడుతూ అడిగేడు విద్యాసాగర్.

"మనమేం చెయ్యగలం చెప్పండి. అప్పటికీ స్కూలు బిల్డింగ్ స్థితిని వివరిస్తూ రాయాల్సినవాళ్ళందరికీ లెటర్స్ రాసేను. ఎవరూ ఉలుకూ పలుకూ లేదు. ఏమయినా అంటే నిధుల కొరత. నిధుల్లేక పెద్దపెద్ద ప్రాజెక్టులే నత్తనడకలు నడుస్తూవుంటే స్కూలు బిల్డింగ్‌ల గురించి ఎవరుమాత్రం పట్టించుకోగలరు చెప్పండి? ఆమధ్య తెలిసిన అసిస్టెంట్ యింజనీరొకాయన కనిపిస్తే అడిగేను. పై యేడాది ఫండ్స్ ఏవో రిలీజవుతాయనీ, స్కూలు మరమ్మతులు జరిపిస్తామనీ చెప్పేరు. అవన్నీ నిజంగా జరగటం ఎప్పటిమాటో..."

"స్కూలు కమిటీవాళ్ళు..." ఏదో అడగబోయేడు.

హెడ్మాష్టరు నవ్వి, "డబ్బుతో పనండీ. వాళ్ళు చేయగలిగిందిమాత్రం ఏముంది కనుక? అప్పటికీ స్కూలుకోసం మనం కాస్త ఇనీషియేషన్ చూపిస్తే ఏదో ఒకటి చేస్తూనే ఉంటారు. వాళ్ళని మొబలైజ్ చెయ్యగలగాలి. వాళ్ళకి మనమీద గురి కుదరాలి. ఈ గదిలో రెండు ఫ్యాన్లూ, పిల్లలకోసం మంచినీటి నదుపాయం వాళ్ళు డొనేట్ చేసినవే. నేను లోగడ పనిచేసిన స్కూలుకి ఆ ఊరివాళ్ళయితే ఏకంగా రెండు పక్కా గదులు కూడా కట్టించి ఇచ్చేరు. అందరూ ఒక్కలాగా వుండరుకదా. ఏమయినా సాధారణంగా ఈ ప్రజలకి మొజాయిక్ ఫ్లోరింగులతోనూ, నియాన్ లైట్లతోనూ దేవుడిగుళ్ళు కట్టించడంలో ఉండే ఆసక్తి స్కూలుభవనాలు అభివృద్ధి చేయడంమీద ఉండదనుకోండి" అన్నారు.

'బడి కూడా గుడి అంత పవిత్రమయినదనే భావం వాళ్ళ మనసుపొరల్లో పాదుకొల్పగలిగేలా పరిస్థితులు మలుచుకోగలిగినపుడు స్కూలు బిల్డింగుల అభివృద్ధి విషయంలో ప్రజలు ప్రభుత్వంమీదే ఆధారపడే రోజులు పోతాయేమో... వేలాది రూపాయలు బిల్డింగ్ ఫండ్‌కింద ప్రైవేటు విద్యాసంస్థలకి చెల్లించడానికి వెనుకాడని వ్యక్తులున్నచోట ఈ స్కూళ్ళు యిలాంటి పరిస్థితుల్లో ఉండడం వెనుక కారణాలు వెతకనవసరంలేకుండా తెలుసుకోవచ్చు' అనిపించింది విద్యాసాగర్‌కి.

అతనికి చప్పున పులిపుట్టులో తను పనిచేసిన బడి గుర్తొచ్చింది. ఆ బడీ, ఆ గ్రామ వాతావరణం, అక్కడి ప్రజలు తనమీద చూపిన ఆదరణ గుర్తొచ్చేయి. పాకమాత్రమే కావొచ్చు అది - కాని అందులో పులిపుట్టు ప్రజల శ్రమదానం ఉంది. ఆ ఊరు వదిలివచ్చినందుకు బాధ అనిపిస్తున్నా ఉద్యోగం జీవితంలో ఒక్కొక్క మెట్టు ఎక్కాలన్న తన ఆలోచన కూడా అసమంజసం కాదు...

చాలా రోజుల తర్వాత పాతమిత్రులు గుర్తొ




చ్చేరు విద్యాసాగర్‌కి. వెంటనే తనగురించీ, స్కూలు గురించీ, పద్మగురించీ సత్యానికీ, జానకేశ్వరరావుకీ ఉత్తరాలు రాసి పోస్టుచేశా డు. వారం తిరక్కుండానే యిద్దరినుంచీ జవా బులొచ్చేయి.

సత్యం తన ఉత్తరంలో ఎక్కువగా అచ్యుత రావుగారి గురించే ప్రస్తావించాడు.

''ఆయన మరణం మీలాగే నాకూ బాధకలి గించింది. మనం ఆయనమీద ధ్వజం ఎత్తడ మూ, అల్సరు ముదిరిపోయి ఆయనకి ప్రా ణాంతకంగా పరిణమించడమూ దురదృష్టవశా త్తూ ఒకసారే జరిగాయి. ఆయన పోవడంవల్ల ఆ కుటుంబం కొత్తగా పోగొట్టుకున్నదేమీ లేదు. పద్మ మీ స్కూల్లోనే పనిచేస్తోందని తెలిసి చాలా సంతోషించేను'' అని రాసేడు.

జానకేశ్వరరావు జవాబు రాస్తూ, ''నువ్వు అదృష్టవంతుడివి విద్యా... నీకు పులిపుట్టు ప్రజలు సాదరపూర్వకమయిన వీడ్కోలు యిచ్చేరని రాసేవు. కొండంగి గ్రామస్థుల విశ్వాసం నేను చివరివరకూ పొందలేకపోయే ను. అక్కడ ఏదైతే నేను పొందలేకపోయానో అదిక్కడ పొందడానికి ప్రయత్నాలు చేస్తున్నా ను'' అంటూ రాసేడు.

రోజులు గడుస్తున్నాయి. హైస్కూలు తరగ తులకి పాఠాలు చెప్పడానికి విద్యాసాగర్ యిప్పుడిప్పుడే అలవాటు పడుతున్నాడు.

ఏరోజు చెప్పాల్సిన పాఠం ఆరోజు మరోసారి మననం చేసుకుని ప్రిపేరవుతూ అతను క్లాసు కి వెళ్ళడం అలవాటుగా చేసుకున్నాడు. టీచింగ్‌పట్ల అతను చూపిస్తున్న శ్రద్ధ గమ నించి హెడ్మాష్టరుతోపాటు చాలామంది హర్షించేరు. ఒకరిద్దరు మేష్టర్లుమాత్రం ''ఎందుకండీ, అంత హైరానాపడిపోతారు? ఎగిరిదంచినా, ఎగరక దంచినా కూలిమాత్రం ఒక్కటేకదండీ. కొత్తలో మీలాగే మేమూ యిలా గే చాలా ఇంట్రెస్టుగా చెప్పేవాళ్ళం. ఎవడిక్కా వాలండీ బాబూ మనం చెప్పేది? పేరెంట్సుకా పట్టదు. స్కూల్లో జాయిన్ చెయ్యడంతో తమ బాధ్యత తీరిపోయిందన్నట్టుగా చేతులు దుల పరించుకుపోతారు. కనీసం వాళ్ళెలా చదువు తున్నారో, అసలు రోజూ స్కూలుకి వస్తున్నారో లేదో కూడా వాళ్ళలో చాలామందికి అక్కర్లేదు. కాస్త చదువుకున్నవాళ్ళూ, ఉద్యోగస్తులూ అయితే పిల్లల చదువులమీద ఓ కన్నేసి ఉంచుతున్నారు. మిగతావాళ్ళు అదీలేదు. ఏడోతరగతి ఎలాగో గట్టెక్కించేస్తే మళ్ళీ పదోత రగతివరకూ ఢోకా లేదుకదా... డిటెన్షన్ పద్ధతి రద్దువల్ల అటెండెన్సు ఉంటే చాలు. ఆరూ, ఎనిమిదీ, తొమ్మిది తరగతులు గట్టెక్కేసినట్టే... వీళ్ళకి అటెండెన్సుమీద ఉన్న శ్రద్ధ చదువుల మీద లేదు'' అంటూ పెదవులు విరిచి నిరు త్సాహపరిచేరు.

విద్యాసాగర్ బాధగా నిట్టూర్చేడు. వాళ్ళు చెప్పిందాంట్లో కూడా నిజంలేకపోలేదు. ఒక్కో తరగతిలో సుమారు అరవైమంది పైచిలుకు ఉంటే నిజంగా చదువుపట్ల ఆసక్తి కనపబరిచే పిల్లలు చేతివేళ్ళ సంఖ్యను మించడంలేదు.

క్లాసురూంలోకి తను వెళ్ళేసరికి 'మేష్టారూ... అటెండెన్సు వెయ్యండి' అంటూ గుర్తుచేసేవా ళ్ళే ఎక్కువ. పై తరగతిలోకి వెళ్ళాలంటే హాజరుశాతం చాలా అవసరం అనే సంగతి వాళ్ళకి బాగా తెలుసు. హాజరు పడగానే చల్లగా బయటకు జారుకునే విద్యార్థులూ లేకపోలేదు.

''నిజమే... కాని మనం మరికొంత శ్రద్ధ తీసుకుని పనిచేస్తే పిల్లల్ని హాజరుకోసం కాక చదువుకొందుకి వచ్చేలా చెయ్యగలమేమో కదా'' అనబోయేడు విద్యాసాగర్.

''అయ్యా, అదీ అయింది. మీకింకా కొత్త. ఉత్సాహం పాలు కాస్త ఎక్కువగానే ఉంటుంది. చదవకపోతే ఏం చేస్తాం. కొడ తామా? అహా... తెలియక అడుగుతాను, చె ప్పండి... కొడితే జనం కర్రలు పట్టుకుని మీదికొస్తారు మీకు తెలీదుకాబోలు'' అన్నాడొకా యన. ఆ మాటల్లో వెటకారం, కొండంత ఉదా సీన భావం ధ్వనిస్తోంది.

కర్ణుడి చావుకి ఎన్నో కారణాలన్నట్టు యిక్క డి విద్యాప్రమాణాలు దిగజారిపోవడానికీ అన్ని కారణాలూ ఉన్నాయి.

ఒక నిర్లిప్త ధోరణి, ఒక ఉదాసీన భావం, పిల్లల భవిష్యత్తుమీద గొడ్డలిపెట్టుగా మారు తోంది. ఒకతరం బలయిపోతోంది.

★ ★ ★

ఆరోజు పదవతరగతి సప్లిమెంటరీ పరీక్షల ఫలితాలు తెలిశాయి. ఉత్తీర్ణత శాతం చాలా నిరాశాజనకంగా ఉంది. పేపరు కొని, జేబు పర్సులోంచి చెల్లెలు శాంతి నెంబరు తీసి ఆత్రుతగా రిజల్టు చూసేడు విద్యాసాగర్.

మామూలే... శాంతి మళ్ళీ పరీక్ష తప్పింది. విద్యాసాగర్ మనసు వికలంగా తయార యింది. స్కూలు వదిలేక నిస్పృహతో నిరాశగా యింటికొచ్చేడు.

ఇంటిదగ్గర తల్లి విచారంగా చూస్తూ కూర్చుంది. శాంతి ఏడ్చి ఏడ్చి మంచంమీద పడుకునిఉంది. దాని ముఖం కన్నీటితో చార లు కట్టి అసహ్యంగా తయారయింది.

విద్యాసాగర్ యింట్లోకి రాగానే తల్లి ఫిర్యా దు చేసింది. ''ఒరే నాయనా, ఇది మరింక పరీక్షకి కూర్చోనంటోందిరా... తనింక ఆ చదువు చదవలేనంటోంది''

''ఏమయిందమ్మా''

''మళ్ళీ దాని పరీక్ష పోయిందికదురా... మీ అక్కయ్య పిల్లలు చూడు ఎలా చదువుకొని పైకొస్తున్నారో. ఒకడు యింజనీరింగ్, రెండోవా డు బి.ఎస్సీ. చదువుతున్నారు. అన్నీ ఫస్టు రాంకులే. ఇది చూస్తే యిలా ఉంది''

''అమ్మా, నువ్వూరుకో'' అని తల్లిని వారించి లాలనగా చెల్లి నుదుటిమీద చెయ్యివేశాడు విద్యాసాగర్.



తొకతొక్కిన పాములా లేచింది శాంతి.

"వాళ్ళతో నన్ను పోల్చకు. మాకు చివరివరకూ హిందీ టీచరు లేరు. లెక్కల టీచరుకి మధ్యలోనే ట్రాన్స్‌ఫరయిపోయింది. మాకు కోర్సులు సరిగా పూర్తికానేలేదు. అలాంటి స్కూళ్ళలో చదివిస్తే నేనూ ప్యాసయిఉండేదాన్నేమో..." అంది రోషంగా.

"శాంతీ, అలా నిరాశపడకమ్మా, ఈసారి నేను దగ్గరుండి నిన్ను చదివిస్తాను. ఈసారి పరీక్ష తప్పకుండా పాసవుతావు" అనునయించేడు విద్యాసాగర్.

"నేను చదవను. చదవనంతే" ముఖం గోడవేపు తిప్పుకుని ముడుచుకుని పడుకుంటూ మొండికేసినట్టుగా చెప్పింది శాంతి.

విద్యాసాగర్‌కి ఏం చెయ్యాలో పాలుపోలేదు.

"బుద్ధిలేకపోతే సరి... అర్థాంతరంగా చదువు ఆపేస్తాననంటే ఎలాగే... మీ అన్నయ్య చక్కగా చదువుకుని ఉద్యోగం చేసుకోవడంలేదూ? ఒళ్ళుబద్ధకం కాకపోతే, చదివితే పాసు కావూ?" తల్లి గొంతులో కోపంకన్నా ఆందోళనే హెచ్చుగా కనిపిస్తోంది.

"నేను మొద్దునే. ఈ చదువు నా తలకెక్కదు. సరేనా... నన్ను చంపి పాతరేసినా యింక చదవను" తల్లి మాటలకు జవాబుగా అటువేపు తిరిగి పడుకునే అరిచింది శాంతి.

"ఇదేమిట్రా... యిదిలా తయారయిందీ?" పార్వతమ్మ అయోమయంగా కొడుకువేపు చూసింది.

"తప్పు దానొక్కర్తిదీ కాదులేమ్మా" గొణుక్కుంటున్నట్టుగా అన్నాడు విద్యాసాగర్.

కొడుకు అంటున్నదేమిటో ఆవిడకి అర్థంకాలేదు.

★ ★ ★

శాంతి మరింక చదవనని మొండికెయ్యడంతో విద్యాసాగర్‌కి ఏం చెయ్యాలో తోచలేదు. తమ్ముడు వెంకుబాబు యిప్పుడు పదో తరగతిలోకి వచ్చేడు. వాడిగురించి దిగులు లేదు. తను ఊహించినట్టుగానే వాడికి చదువుమీద ఆసక్తి పెరిగింది. శ్రద్ధగా చదువుతున్నాడు. పబ్లిక్ పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకోగలడనే అనిపిస్తోంది. ఆటధ్యాసలోపడి చదువుని ఎక్కడ అశ్రద్ధ చేస్తాడోనని భయపడితే తమ్ముడు కుదురుగా చదువుకోవడం, ఏడవతరగతిలో మంచిమార్కులతోనే పాసయినా శాంతి తరువాత తరువాత అశ్రద్ధ చేయడం విద్యాసాగర్‌కి చాలా బాధ కలిగిస్తోంది.

శాంతి పదో తరగతికి వచ్చినరోజుల్లో స్కూల్లో సరిగా పాఠాలు జరక్కపోవడానికి కారణాలు కనబడుతూనే ఉన్నాయి. టీచర్ల బదిలీలు, టీచర్ల కొరత, బంద్‌లు, సమ్మెలు, అదే ఏడాది వచ్చిన జనాభాలెక్కల సేకరణతోను, ఎలక్షన్ డ్యూటీలతోను, ఎన్యూమరేషన్ డ్యూటీతోను మేష్టర్లకి సరిపోయింది. అసలే విద్యాసంవత్సరం అంతా సక్రమంగా జరిగితేనే కోర్సులు సరిగా పూర్తిచేయలేని స్థితి. దానికితోడు ఉపాధ్యాయులకి ఈ అదనపు బాధ్యతలు... సమ్మెలాంటి అనుకోని అవాంతరాలు వస్తే యిక పాఠాలు సక్రమంగా ఎలా జరుగుతాయి? వీటికి తోడు సప్లిమెంటరీ పరీక్షల డ్యూటీలు, స్పాట్ వాల్యుయేషన్ డ్యూటీలు.

వీటన్నిటికీ సమన్వయం కుదుర్చుకుని సంతృప్తికరంగా కోర్సులు పూర్తిచేయడంలో ఉండే కష్టం టీచర్లకే తెలుస్తుంది.

తెలివితేటలున్నవాళ్ళూ, చురుకైన పిల్లలూ అయితే ఈ పరిస్థితుల్ని సమర్థవంతంగా ఎదుర్కొనగలరు. ఒక విద్యాసంవత్సరం నష్టపోతే దాని ప్రభావానికి నలిగిపోయేది శాంతిలాంటి విద్యార్థులే.

శాంతిని తిరిగి పరీక్షకి కూచునేలా చేయడానికి విద్యాసాగర్ ఎంతగానో ప్రయత్నించేడు. అతని ప్రయత్నాలు ఫలించలేదు. శాంతి తన పట్టు విడవలేదు.

బోర్డునుంచి మార్కుల జాబితాలు వచ్చేయి. శాంతి సైన్సుకీ, లెక్కలకీ వెళ్తే, లెక్కల పరీక్ష పాసయింది. పాస్ మార్కులే వచ్చేయి.

తెలిసీ తెలియని అమాయకత్వంతో చెల్లి చదవనని మొరాయించినా ఆ పిల్లని అలా వదిలెయ్యడం విద్యాసాగర్‌కి ఎంతమాత్రం ఇష్టంలేదు. నారాయణమూర్తిగారు వచ్చినపుడు శాంతికి నయానా భయనా చెప్పిచూసేరు. శాంతి మనసు మార్చుకోకపోవడంతో "ఇదింక




చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టేసినట్టేరా విద్యా. టైపు నేర్పించు... దానిఖర్మకి మనమేం చేస్తాం" అని చెప్పి నిరాశగా వెళ్ళిపోయేరు.

చెల్లెలు యిలా మొండికేయడం తమ్ముడి మీద ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తుందో తెలీదు. ఇదే విషయం పద్మదగ్గర చర్చించేడు.

"ఫరవాలేదు... మళ్ళీ ఫీజు కట్టడానికి టైముందికదా... ప్రతిసారీ ఏదో పరీక్ష తప్పుతూ ఉండడంతో ఆ పిల్ల నిస్పృహకి లోనై అలాంటి నిర్ణయానికి వచ్చిందేమో. నేను చెప్పిచూస్తాను. మీరు ఆందోళన పడకండి" అని ధైర్యం చెప్పింది పద్మ.

విద్యాసాగర్‌కిమాత్రం నమ్మకం కుదరలేదు.

★ ★ ★

నారాయణమూర్తిగారు ఆ మరుసటివారం వచ్చినపుడు తనతోపాటు అచ్యుతాంబని కూడా తీసుకొచ్చేరు.

సీతారాంపురం వదిలిపెట్టి వచ్చేక ఆవిడని చూడడం మళ్ళీ యిదే. ఆ తర్వాత విద్యాసాగర్ మేనత్తని చూడనేలేదు. తల్లీ తండ్రీ ఎప్పుడేనా అక్కడకి వెళ్ళి ఒకటిరెండురోజులుండి వచ్చేవారు. ఆ ఊరు విడిచి వచ్చేక తను మరక్కడకి వెళ్ళలేదు. చెల్లెలు శాంతికీ, తమ్ముడు వెంకుబాబుకీ అసలా గ్రామం ఎలా ఉంటుందో తెలీదు. అచ్యుతాంబ అత్తయ్య పేరు వినడమేకాని ఆవిడని వాళ్ళెప్పుడూ చూడనయినాలేదు.

పాతరోజులు పూర్తిగా మరిచిపోయినట్టుగా ఆవిడ తన తల్లితో కలుపుగోలుగా మాట్లాడుతూ ఉండడం విద్యాసాగర్‌కి ఆశ్చర్యమనిపించింది. తన తల్లి కూడా ఆ విషయాలేవీ జ్ఞాపకం లేనిదానిలాగానే ప్రవర్తించడం మరీ వింతగా తోచింది. రక్తసంబంధాలని నిలబెట్టుకోవడంలో ఆతరంవాళ్ళు ఎంత ఉదారంగా ప్రవర్తించగలరో! అనిపించిందతనికి.

ఆవిడ వస్తూనే విద్యాసాగర్‌ని చూస్తూ, "వీడు మన సాగర్ కాదూ? ఎంత ఎదిగిపోయాడో!" అంటూ ఆశ్చర్యపోతున్నట్లుగా పార్వతమ్మ వేపు తిరిగి అంది.

ఆవిడ నవ్వేసి, "చాలా యేళ్ళు అయిందికదూ మీరు చూసి. అప్పటికింకా వీళ్ళు పుట్టనేలేదు" అంటూ శాంతినీ, వెంకుబాబునీ పిలిచి ఆవిడకి పరిచయం చేసింది.

"అవునవును... వీళ్ళ గురించి తమ్ముడూ నువ్వు చెప్పడమేకాని నేను చూడ్డం యిదే మొదటిసారి. వీళ్ళు పుట్టేక ఎప్పుడేనా ఒక్కసారయినా నాదగ్గరకి తీసుకొస్తేగదా"

విద్యాసాగర్‌కి ఆవిడ అలా నిష్ఠూరంగా మాట్లాడటం నచ్చలేదు. అతనికి తన బాల్యంలో ఆరోజు రాత్రి నిస్సహాయంగా తనూ, అమ్మా, అక్కా అచ్యుతాంబగారి యింటినుంచి బయట పడవలసి వచ్చిన పరిస్థితి గుర్తొచ్చింది. అప్పుడు అమ్మ ముఖంలో కనిపించిన అవమానం, సిగ్గు, ఏమీ చేయలేని అశక్తత గుర్తొచ్చాయి. అలా తమని బయటకి గెంటేసిన అచ్యుతాంబేనా యివాళ ఇలా మాట్లాడుతోంది?

శాంతిని చూస్తూ "ఏం చదువుతున్నావే నువ్వు?" అని దీర్ఘాలు తీస్తూ అడిగిందావిడ.

శాంతి జవాబు చెప్పలేదు.

ఆవిడ రెట్టించి అడగడంతో పార్వతమ్మ జవాబు చెప్పింది, "పదో తరగతి పరీక్షలు రాసింది"

"పాసయిందా?" ఆవిడ ఊరుకునేలా లేదు.

"లేదు... ప్యాసు కాలేదు. మరింక పరీక్షలు **రాయనుకూడా" శాంతి అక్కసుగా తెగేసినట్టుగా చెప్పింది. ఆవిడ కళ్ళు పెద్దవి చేస్తూ "ఇదేం చోద్యమే తల్లీ. పరీక్ష తప్పావు సరే... మళ్ళీ రాయనంటావేమిటీ? చదువు మానేసి** కూచుని ఏం చేద్దామనుకుంటున్నావు?" అంది.

శాంతి ఆవిడవేపు నిర్లక్ష్యంగా చూసి అక్కడినుండి లేచి వెళ్ళిపోయింది. ఆ తర్వాత అచ్యుతాంబగారు ఉన్న రెండురోజులూ శాంతిని ఈ విషయంలో ఏవో మాటలంటూ సతాయిస్తూనేఉంది. ఆవిడ అలా రెచ్చగొడుతున్నకొద్దీ శాంతిలో మొండితనం మరింత ఎక్కువ అవుతోందే తప్ప తగ్గడంలేదు. విద్యాసాగర్‌కి ఈ పరిస్థితి చిరాకు పుట్టిస్తోంది. నెమ్మదిగా నచ్చచెప్పి, శాంతిని దారికి తేవాలని తను అనుకుంటూంటే ఈవిడ మాటల్తో శాంతి



మరింత మొండిగా తయారవుతోంది.

అచ్యుతాంబగారిని వారించాలని విద్యాసాగర్ ప్రయత్నించేడు. కాని ఆవిడ ధోరణి ఆవిడదే. ఆవిడ ఉన్న రెండు రోజులూ శాంతి రుసరుసలాడుతూనే ఉంది. తన తెలివితక్కువతనాన్ని ఆవిడ ఎత్తిచూపిస్తున్నట్టనిపించి ఆ అమ్మాయి మరింత బాధపడసాగింది.

కూతుర్ని అచ్యుతాంబ పదేపదే ఏవో అంటూ బాధపెట్టడం పార్వతమ్మగారికి కూడా కష్టం కలిగిస్తోంది.

అచ్యుతాంబగారు ఊరెళ్ళిపోయేరోజున పద్మ ఆ ఇంటికొచ్చింది. విద్యాసాగర్ అక్కడ జాయినయ్యేక పద్మ అక్కడకి వస్తూపోతూండడంతో పద్మకి పార్వతమ్మగారిదగ్గర చనువు ఏర్పడింది. శాంతికీ, వెంకుబాబుకీ కూడా పద్మ సన్నిహితురాలైంది.

''మా అచ్యుతాంబ అత్తయ్య'' పద్మకి ఆవిడని పరిచయం చేశాడు విద్యాసాగర్. పద్మ చేతులు జోడించి ఆవిడకి నమస్కరించింది. పద్మని ఆవిడకి పరిచయం చేశాడు.

పద్మ ఎదుట కూడా అచ్యుతాంబగారు శాంతి చదువుగురించి మాట్లాడడం మానలేదు.

తన గురించి పద్మ ఎదుట అలా మాట్లాడుతూ ఉంటే మరింక సహించలేకపోయింది శాంతి. ఉక్రోషంగా ఆవిడమీద కేకలు వేయడం ప్రారంభించింది.

శాంతి ఆవిధంగా తనమీద తిరగబడడంతో అచ్యుతాంబగారు బిత్తరపోయేరు.

పార్వతమ్మగారు కలుగజేసుకుని కూతుర్ని మందలించేరు. ''శాంతీ, ఏమిటా మాటలు పెద్దా చిన్నా లేకుండా'' అనే తల్లి మందలింపుతో ఆ పిల్ల కోపం తారాస్థాయికి చేరుకుంది.

విద్యాసాగర్‌కి ఈ పరిస్థితి యిబ్బందికరంగా తోచింది. తండ్రి రిక్షా తేవడానికి వెళ్ళేరు. ఈవిడ వేగిరం యిక్కడినుండి వెళ్ళిపోతే బాగుండుననిపించిందతనికి.

శాంతిలాంటివాళ్లని రెచ్చగొట్టి లాభంలేదు. కాస్త మంచిమాటలు చెప్పి దారికి తేవాలి. చదువు విలువ ఏమిటో పూర్తిగా అర్థంచేసుకోలేని వయసు. తెలివితేటలు ఉన్నప్పటికీ వాటిని సద్వినియోగం చేసుకోలేని స్థితి.

చదువు, పరీక్షలు అనేవి అధిగమించలేని అవరోధంలాగా కాకుండా, ఆసక్తికరమైన విషయంగా వాళ్ళని ప్రభావితం చేయగలిగిననాడు ఏ యింట్లోనూ యిలాంటి పరిస్థితులు ఎదురుకాకపోవొచ్చును.

నారాయణమూర్తిగారు యింటిముందు రిక్షా ఆపించి, యింట్లోకి వస్తూనే అక్కడి పరిస్థితిని అర్థంచేసుకున్నారు.

ఏడుపూ, అసహనమూ మిళితమయిన గొంతుతో శాంతి బిగ్గరగా అచ్యుతాంబమీద విరుచుకుపడటం ఆయన కంటబడింది.

అచ్యుతాంబగారు మళ్ళీ ఏదో అనబోతూ ఉంటే నారాయణమూర్తిగారు ఆవిడని గట్టిగా మందలిస్తూ, ''చాల్లే... ఊరుకో... మేం అందరం చెప్పిచూసేంకదా. పరీక్షలు వరసగా తప్పుతూఉండడంవల్ల అదిలా తయారయింది. మళ్ళీ దానికెప్పుడో బుద్ధిపుడుతుంది. అప్పుడు చదువుతుంది. లేదూ, పెళ్ళిచేసి పంపించివెయ్యడమేకదా మనం చేయగలిగింది'' అన్నారు.

తండ్రి మాటలు సూటిగా తగిలి శాంతి ముఖం చిన్నబోయింది. ఆ పిల్లలో దుఃఖం తన్నుకొస్తోంది.

పద్మ శాంతిపక్కన చేరి అనునయిస్తూ ఆ పిల్ల తల నిమరసాగింది.

''రిక్షా తీసుకొచ్చేను. పదక్కా యింక బయలుదేరదాం'' అచ్యుతాంబని తొందరపెట్టేరు నారాయణమూర్తిగారు.

ఆవిడ గుమ్మం దిగితే చాలనిపించింది విద్యాసాగర్‌కి.

చేతిసంచీ తీసుకుని బయలుదేరబోతున్నదల్లా ఆగి, పార్వతమ్మ దగ్గరకి వెళ్ళింది అచ్యుతాంబ.

''శాంతి మెడ బోసిగా ఉందే పార్వతీ, అది మనసు మార్చుకుని పరీక్ష రాసి పాసయితే నా బహుమానంగా దాని మెడలో యిది వెయ్యి'' అంటూ తన మెడలోని ఒంటిపేట గొలుసొకటి తీసి ఆవిడ మెడలో వేసింది అచ్యుతాంబ.




అనుకోని ఈ సంఘటనకి అందరూ ఆశ్చర్యంతో తలమునకలయ్యేరు. బయటికి ఎంత మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తున్నా గతంలో తను ఆ కుటుంబంపట్ల వ్యవహరించిన తీరు గుర్తొచ్చినప్పుడల్లా ఆవిడ పశ్చాత్తాపంతో బాధపడుతోందనడానికి యిప్పుడామె చర్యే నిదర్శనం అనిపించింది విద్యాసాగర్‌కి.

"వద్దొద్దు... ఎందుకండీ..." గాభరాగా వారించబోయింది పార్వతమ్మ.

అచ్యుతాంబ అంగీకరించలేదు.

"దానికి నేనివ్వకూడదాయేం? మరింక నువ్వేమీ అడ్డుచెప్పకు" అంటూ బయల్దేరడానికి సిద్ధపడిందామె.

ఆ సంఘటనతో నిర్ఘాంతపోయిన శాంత కాస్త తేరుకుంది. అది ఆ పిల్ల మనస్సులో ఏ అభిమానాన్ని రెచ్చగొట్టిందో, ఏమో

చివాలున తల్లిముఖంలోకి చూస్తూ అంది. "నాకదేం అక్కర్లేదు. ఆ గొలుసు అత్తయ్యకి యిచ్చేయ్ అమ్మా. నేను పరీక్షకి మళ్ళీ కూచుంటాను... సరేనా?" ఈ మాటలనేసి గబగబ లోపలి గదిలోకి వెళ్ళిపోయింది.

పార్వతమ్మ గొలుసు తీసి అచ్యుతాంబ చేతికి యివ్వబోయింది.

"ఉంచమ్మా... చిన్నపిల్ల... దానిమాటలకేం... దాని మనసు మారింది. మళ్ళీ దార్లోపడింది. అదేచాలు" అంటూ వీధిలోకొచ్చి రిక్షా ఎక్కింది అచ్యుతాంబ. నారాయణమూర్తిగారు కూడా ఎక్కేక రిక్షా కదిలింది.

చెల్లెలు మనసు మార్చుకొని మళ్ళీ పరీక్షకి కూచోడానికి సిద్ధపడటంతో విద్యాసాగర్ మనసు తేలికపడింది.

అచ్యుతాంబగారికి మనసులోనే ధన్యవాదాలు తెలుపుకున్నాడు.

"మీ అత్తయ్యకి ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా పట్టడం కష్టమేరా" అంటున్న తల్లివేపు చూసి చిన్నగా నవ్వేడు.

'అది మనుమల నైజంలోనే ఉందమ్మా. ఒకప్పుడు కర్కశంగానూ, మరోసారి దయాపూరితంగానూ వ్యవహరించడం ప్రతి మనిషి వ్యక్తిత్వంలోనూ యిమిడిపోయి ఉండేగుణం. మనిషే రాక్షసుడు. మనిషే దేవుడు. అచ్యుతాంబ అత్తయ్యా కూడా మానవత్వం ఉన్న మనిషేకదమ్మా' అందామనుకున్నాడు. ఆ మాటలు అతని గొంతులోనే ఉండిపోయేయి.

పద్మ గదిలోకి వెళ్ళి శాంతిని మెచ్చుకుంటూ మాట్లాడింది. "మంచి నిర్ణయం తీసుకున్నావమ్మా. బాగా చదువుకుని పైకొస్తే ఆ చదువే మనకి మంచి బహుమానం. ఎవరూ యివ్వలేని కానుక అది"

పద్మ తనని మెచ్చుకుంటూ మాట్లాడ్డం శాంతికి సంతోషాన్నీ, చాలా సంతృప్తినీ కలిగించింది. ఆ పిల్లలో కొత్త ఉత్సాహం ఉరకలు వేసింది.

★ ★ ★

హైస్కూలు ఉద్యోగం నల్లేరుమీద బండీన తరలాంటిది కాదని విద్యాసాగర్‌కి, అవగతం కావడానికి అట్టేరోజులు పట్టలేదు. ఇక్కడి సమస్యలు ఒక్కొక్కటీ అర్థం కాసాగాయి.

వృత్తిరీత్యా ఇందులో లభించే సంతృప్తి మరే వృత్తిలోనూ దొరకదని అనుకోవడంలో పూర్తి నిజంలేదని అతనికి అర్థమయింది.

ఆరోజు రెండో పీరియడ్ తొమ్మిదో తరగతిలో పాఠం చెప్పడం పూర్తిచేసి, ఎసైన్‌మెంట్ ఇస్తూ ఉండగా అటెండరు సర్క్యులర్ తీసుకొని వచ్చేడు.

పిల్లలంతా ఆ సర్క్యులర్‌లో ఏం ఉందా అని ఆసక్తితో విద్యాసాగర్ ముఖంలోకి చూస్తూ ఉండిపోయారు.

తీరుబడిగా కుర్చీలో కూర్చుని సర్క్యులర్ ఆసాంతం చదివేడు విద్యాసాగర్.

రానున్న పదోతరగతి పబ్లిక్ పరీక్షల్లో ఉపాధ్యాయులు సబ్జెక్టులవారీగా సాధించాల్సి ఉన్న ఉత్తీర్ణతా శాతానికి సంబంధించిన కాగితం అది. ప్రతీ సబ్జెక్టులోనూ ఎంతశాతం ఉత్తీర్ణత సాధించితీరాలో సూచిస్తూ టార్గెట్స్ ఫిక్స్‌చేస్తూ పైనుంచి ఆదేశాలు వచ్చేయి..

ఈ విషయమే చర్చించడంకోసం సాయంత్రం బడి వదిలేక స్టాఫ్ మీటింగ్ ఉంది.

సర్క్యులర్ మీద సంతకంచేస్తూ, తను బోధించే సైన్సు సబ్జెక్టులో తను ఎంత శాతం రిజల్టు సాధించాల్సి ఉందో చూసుకున్నాడు

విద్యాసాగర్.

ఎనభైఅయిదు శాతం!

విద్యాసాగర్ గుండె ఝల్లుమంది.

కిందటేడు ఈ స్కూలునుంచి పదోతరగతి పాసయిన వాళ్ళ సంఖ్య చాలా తక్కువ. సైన్సు సబ్జెక్టులో పాసయినవారి శాతం మరీ తక్కువ.

బి.య్యీడీ టీచరుగా ప్రమోషనుమీద తనిక్కడికి వచ్చిచేరి ఎన్నోరోజులు కాలేదు. ఎక్కడి సిలబస్ అక్కడే ఉంది. పబ్లిక్ పరీక్షలకు వ్యవధి కూడా తక్కువే ఉంది. ముందు సిలబస్ పూర్తిచేయాలి.

పదోతరగతిలో ఇద్దరో ముగ్గురో తప్ప తక్కిన విద్యార్థులందరూ చాలా వెనుకబడి ఉన్నారన్న సంగతి ఇప్పటికే తను గమనించేడు. శిలాప్రతిమల్లా కళ్లు అప్పగించి వినడమే తప్ప ఒక్క అక్షరం తలకెక్కించుకుంటున్నారో లేదో కూడా అనుమానాస్పదమే.

ఈ జడత్వం ఇంత వేగిరం వదిలేది కాదు. వీళ్ళకి- చదువుకోవడం అంటే బడికి వచ్చి వెళ్ళడమే.

ఈ పరిస్థితుల్లో ఈ గండం తను గట్టెక్కగలడా అనిపించింది విద్యాసాగర్‌కి.

సంతకంచేసి సర్క్యులర్ అటెండరుకిచ్చేడు. అతను వెళ్లిపోయాక క్లాసంతా ఓసారి పరికించి చూసేడు.

ఆ సర్క్యులర్‌లో ఏం ఉందో తెలుసుకోవాలనే కుతూహలం వాళ్లలో కనిపించింది. విద్యాసాగర్‌కి నవ్వొచ్చింది. పిల్లల దృష్టిలో సర్క్యులర్ వస్తే సెలవొస్తుంది. లేదంటే కనీసం ఏ బోధనేతర కార్యక్రమమో ఉంటుంది.

తను ఏం చెప్పబోతున్నాడా అని ఉత్సుకతతో చూసేవాళ్ళ చూపులు విద్యాసాగర్‌లో కొత్త ఆలోచనలు రేకెత్తించేయి.

వీళ్ళలో ఉత్సాహానికీ, ఉత్తేజానికీ కొదవలేదు. కొత్త విషయాలు తెలుసుకోవాలన్న జిజ్ఞాసకీ, నేర్చుకుందామన్న తపనకీ కూడా లోటులేదు.

కానీ, వీళ్ళ ఆసక్తులు నిర్వీర్యమయే పరిస్థితులు... వీళ్ళ ఆలోచనలు పెడదారిపట్టే వాతావరణం వీళ్ళ చుట్టూ ముళ్ళకంచెలా పెరిగిపోయి ఉంది.

ఆ ముళ్ళకంచె పెకిలించి వేసి, మల్లెలు వికసింపచేయగల్గిననాడు-

అమాయకంగా చూసే ఆ వదనాల్లో చదువుపట్ల భయాన్నీ అనాసక్తతనీ పోగొట్టగలిగిననాడు- ఉపాధ్యాయుడిగా తన బాధ్యత సక్రమంగా నిర్వహించగలిగినట్లే. అప్పుడే తన కృషికి సాఫల్యం సిద్ధిస్తుంది.

ఆ పని తను చెయ్యగలడా? రోజుకిన్ని ఫైల్సు డిస్పోజ్‌చేసి పక్కన పడెయ్యాలనే సూత్రం ఇక్కడ వర్తిస్తుందా? తనీయేడాది పబ్లిక్ పరీక్షల్లో ఎనభైఅయిదుశాతం రిజల్టు చూపించాలన్న సంగతి మళ్ళీ స్ఫురణకొచ్చి అతనిలో మొదటిసారిగా భయం కలిగింది. తన సామర్థ్యంమీద తనకే ఓ సందేహం నల్లని నీడలా మనసంతా వ్యాపించి ఆందోళనకి గురిచేసింది.

ముఖాన పట్టిన చిరుచెమటని జేబురుమాలుతో తుడుచుకున్నాడు.

ఆ సర్క్యులర్‌లో ఏం ఉందో తెలుసుకోవాలన్న పిల్లల కుతూహలాన్ని మరింత సస్పెన్స్‌లో పెట్టడం ఇష్టంలేక, "ఇప్పుడొచ్చిన సర్క్యులరు మీకు సంబంధించినది కాదు... సాయంత్రం మేష్టార్లకి స్టాఫ్ మీటింగ్ ఉంది" అని చెప్పేడు.

పిల్లల ముఖాలలో ఉత్సాహం నీరు కారిపోయింది.

నిజానికి దానితో వాళ్ళకి సంబంధంలేదూ? ప్రత్యక్షంగా లేకపోయినా ఆ సాయంత్రం జరిగే స్టాఫ్ మీటింగ్ ఆ పిల్లల చదువుల గురించే.

పీరియడ్ పూర్తయ్యాక విద్యాసాగర్ నేరుగా స్టాఫ్‌రూంకి వెళ్ళేడు.

అక్కడ అప్పుడే పైనుంచి వచ్చిన ఆదేశాల గురించే వేడివేడిగా చర్చ జరుగుతోంది.

అక్కడ చేరిన ఉపాధ్యాయుల ముఖాల్లో మాటల్లో ఆందోళన ఎంత దాచుకుందామన్నా వ్యక్తమవుతూనే ఉంది.

"చూసేరా, నాకు తొంభయ్ అయిదుశాతం టార్గెట్ ఫిక్స్ చేసి పంపించేరు... ఈ వెధవల్ని చూస్తే అసలు చదవనే చదవరు" తెలుగుటీచరు వాపోయారు.




"వాళ్ళకేమిటండీ అక్కడ ఆఫీసుల్లో ఫేన్ల కింద కూచుని ఇంత శాతం పాస్ తీసుకు రండి. అంతశాతం సాధించండి అని ఉత్తర్వు లు జారీచేసిపారేస్తుంటారు. మన ఇబ్బందు లు వాళ్ళకి తెలీవు. ఏడోతరగతిలో అడ్డదారు లు తొక్కో, లేదా రీఎగ్జామినేషన్‌లోనో ఎలాగో గట్టెకి ఎనిమిదోతరగతిలోకి వచ్చేస్తారు. ఆ తర్వాత అటెండెన్సు పాస్ కనుక ఏ కొద్దిమందో తప్ప ఎప్పుడూ చదివిన పాపానపోరు... చదువు లు రమ్మంటే ఎలా వస్తాయి" సోషలుటీచరు అక్కసుగా అన్నారు.

"ఈసారి వాళ్లు ఫిక్స్‌చేసిన టార్గెట్స్ సంపా దించలేకపోతే చాలా సివియర్ పనిష్మెంట్ ఉంటుందిట. ఇంక్రిమెంట్లు కూడా కట్‌చేసి పారేస్తారుట" ఒకాయన భయపడుతున్నట్టుగా చెప్పారు.

అతని మాటలువిని మరో టీచరు అరికాలు మంటెత్తినట్టు చివ్వున కోపంతో లేచి, "చేస్తా రు... చేస్తారు. చెయ్యకేం చేస్తారులెండి. కాళ్లు భూమిలోనూ, ఆలోచనలు ఆకాశంలోనూ ఉంటే ఇలాగే అఘోరిస్తుంది మరి. ఇక్కడ చూస్తే ఒక్క సదుపాయమూ ఉండదు. పిల్లలకి చూ పించాలంటే సైన్సు పరికరం సరైనది ఒకటీ ఉండదు. బ్లాక్‌బోర్డులూ చాక్‌పీస్‌లకీ కూడా ముఖాలు చూసుకోవలసివస్తుంది ఒక్కోసారి. పథకాలు మాత్రం పైనుండి దిగుమతి అయి పోతూఉంటాయి. ఆడియో వీడియో ఎడ్యుకే షన్ పేరిట లక్షలు ఖర్చు చేస్తున్నారు. ఏం లాభం? స్కూళ్లకి టీవీలూ, వీసీఆర్‌లు సప్లయ్ చేయడమేగానీ ఏంటెన్నాలు ఎప్పటికోగాని ఇవ్వరు. టీవీలను భద్రపరచడానికి సరైన గదులు ఉండవు. అన్నీ ఉన్నా స్కూలుకి కరెంటు కనెక్షన్ ఉండదు. నెలనెలా కరెంటుబి ల్లులు కట్టడానికే ఫండ్స్ చాలవు. గోచీకెక్కువా గావంచాకి తక్కువా అని, మన హైస్కూళ్ళ పరిస్థితి ఇలావుంటే రిజల్టు పడిపోడానికి అక్క డికి మనమే ఏదో కారణం అన్నట్టుగా మీద నుంచి సర్క్యులర్లూ, మెమోలూనూ..." అంటూ నిశితంగా విమర్శించడం ప్రా రంభించేరు.

స్టాఫ్‌రూంలో పెద్దగా అరుచుకుంటున్న ట్టుగా టీచర్లు మాట్లాడుకోవడం వినిపించి హెడ్మాష్టరు తన గదిలోంచి అక్కడికొచ్చి, ఏమి టన్నట్టు చూస్తూ నిలబడ్డారు. హెడ్మాష్టరు రావ డంతో అంతా లేచి నిలబడ్డారు. ఒక టీచరు కుర్చీ కాస్త ముందుకి జరిపి ఆయన్ని కూచో మని చెప్పారు.

హెడ్మాష్టరు కూచోలేదు "మధ్యాహ్నం ఎలా గూ స్టాఫ్‌మీటింగ్ పెట్టాను. ఈ విషయాలన్నీ అక్కడ మాట్లాడుకోవచ్చు. ఇప్పుడిలా పిల్లల చెవిని పడేలా అరుస్తూ మాట్లాడుకోవడం భావ్యంగా ఉండదు" అన్నారు సౌమ్యంగా.

ఈ కొద్దిపాటి మందలింపుకే నొచ్చుకుని ఇందాక మాట్లాడినాయన మరిన్ని విమర్శనా స్త్రాలు సంధించబోయారు.

హెడ్మాష్టరు అతన్ని వారిస్తూ, "నో... నో... మీరలా అనకూడదు. మీరిప్పుడు విమర్శిస్తు న్నవన్నీ మంచి పథకాలే. ఆచరణలో ఏవో లోటుపాట్లు ఉండొచ్చు. ప్రతీదీ విమర్శించడం మాని, ఏ చర్యలు చేపడితే అభివృద్ధి సాధించ గలమో ఆలోచించడం మంచిది" అని సర్దిచె ప్పబోయారు.

చాలామంది మేష్టర్లు అతని మాటలతో ఏకీభవించలేకపోయారు. ఈ చర్చలో అణగా రిన ఉపాధ్యాయుల అసంతృప్తి చాలావరకూ బయటపడుతోంది.

"మనకెందుకు లెద్దురూ... మన జీతాలు మనకొస్తున్నాయికదా. చదివినవాడు పాసవుతా డు. లేనివాడు పోతాడు" డ్రిల్లుటీచరు నాన్చే స్తూ ఏదో అనబోయారు.

దాంతో- ఆ చర్చకి అంతటితో తెరపడు తుందనుకున్నదల్లా మళ్లీ మొదలయింది.

డ్రిల్లుమేష్టరు మాటలతో కోపం తెచ్చుకుని, "మీకేం మేష్టారూ... మీరలాగే అంటారు. మీ సబ్జెక్టుకి ఫలితాలతోనూ, పరీక్షలతోనూ సంబంధంలేదుకదా... సరైన రిజల్టు రాకపోతే పై అధికార్లకు సంజాయిషీ ఇచ్చుకోవలసిన సబ్జెక్ట్ టీచర్లం మేం కాని మీరు కాదు" అన్నారు తీవ్రస్వరంతో- ఇంగ్లీషు టీచరు.

అతన్ని మరింత రెచ్చగొడుతున్నట్టుగా వెటకారం ధ్వనించే స్వరంతో, "నేతాచార్యులు, క్రీడాచార్యులు, గీతాచార్యులు... వీళ్లు ముగ్గు




ర్గా ఏ హైస్కూలుకయినా గారాల అల్లుళ్లు కదండీ. సుఖజీవులు వాళ్ళకుండే నిబ్బరం మనకెలా ఉంటుంది చెప్పండి. ఇనస్పెక్షనొస్తుందంటే భయమా? కోర్సులు కంప్లీట్ కాలేదని భయమా- రిజల్టు బాగులేదని వెరపా- ఆ బెంగలన్నీ మనకి. వాళ్లకేం, ఇలాంటి ఉచిత సలహాలే పారేస్తూ ఉంటారు'' తెలుగు మేష్టరు కామెంట్ చేయడంతో ఆ సంభాషణ అనుకోని విధంగా పెద్ద గొడవకి దారితీసింది.

క్షణంలో అక్కడి వాతావరణం ఉద్రిక్తమైపోయింది. చర్చ కాస్తా వివాదంలోకి దిగింది. ఉపాధ్యాయులందరూ గోలగోలగా అరుచుకోవడం ప్రారంభించేరు. అది చిలికి చిలికి గాలివానై పెద్ద రగడకి దారితీసింది.

పెద్ద పెద్ద గొంతుకలతో వాళ్ళు అలా అరుస్తూ ఉంటే తరగతి గదుల్లోంచి విద్యార్థులంతా బిలబిలమంటూ వచ్చి స్టాఫ్ రూంముందు పోగవడం ప్రారంభించేరు. తమకి పాఠాలు చెప్పే ఉపాధ్యాయులు అప్పుడప్పుడు తమలో తాము ఇలా కేకలేసుకోవడం ఎందుకో వాళ్ళకి తెలీంది కాదు. కాని ఇవాళ వాళ్ళ చిన్నారి కళ్లకి అక్కడో యుద్ధవాతావరణం కనిపిస్తుండడంతో, విషయం అర్థంకాక విస్తుపోయి చూస్తూ ఉండిపోయారు.

ఆ తగువులో వాళ్ళమధ్య ఉండే పాతస్పర్ధలు కూడా ఏవో చర్చకి రావడం మొదలయింది. కేకలు కాస్తా బాహాబాహీవరకూ దారితీసేలా తయారయింది.

పరిస్థితి అదుపు తప్పేలా ఉందని గమనించిన హెడ్మాష్టరు అందర్నీ గట్టిగా మందలిస్తూ శాంతపరచడానికి ప్రయత్నించారు. ఆ ఉద్రేకంలో అతని మాటలు వాళ్లు చెవికెక్కించుకోలేదు. అటెండరూ, నైట్‌వాచ్‌మేనూ వచ్చి, పిల్లల్ని తరగతి గదుల్లోకి పంపించేందుకు ప్రయత్నాలు చేశారు. విద్యార్థులు అయిష్టంగానే అక్కడినుంచి వెనక్కి చూస్తూ తరగతులవేపు కదిలారు.

అక్కడసలేం జరుగుతోందో అర్థంకాని వాడిలా విద్యాసాగర్ చేష్టలుడిగి ఉండిపోయాడు.

సహనానికీ, శాంతానికీ మారుపేరు కావలసిన ఉపాధ్యాయులు ఇలా ప్రవర్తించడం- అదీ విద్యార్థులముందు తమ దౌర్బల్యాలని నిర్లజ్జగా వ్యక్తపరుచుకోడానికి ఏమాత్రం సంకోచించకపోవడం అతనికి వింతగా తోచింది. తెలీని సిగ్గుతో అతని ముఖం జేవురించింది.

ఎన్నో ఆదర్శాలతో, ఎంతో ఉన్నతంగా ఊహించుకుంటూ ఉపాధ్యాయ వృత్తిలోకి అడుగిడిన కొత్తవాళ్ళకి ఇలాంటి సంఘటనలు ఒకటి రెండు చాలు- వాళ్ళలో వైముఖ్యాన్నీ నిర్లిప్తతనీ కలిగించడానికి.

హైస్కూళ్లలో డ్రిల్లుటీచర్లని క్రీడాచార్యులనీ, క్రాఫ్ట్ ఇన్‌స్ట్రక్టర్లని నేతాచార్యులనీ, డ్రాయింగ్ ఉపాధ్యాయులని గీతాచార్యులనీ వెటకారంగా పిలుస్తుంటారన్న సంగతి ఆ తర్వాత ఎవరో చెప్పగా విని విద్యాసాగర్ మనసుకి బాధ కలిగింది. ఆ ముగ్గురికీ స్కూళ్ళలో తక్కువ పీరియడ్‌లు ఉంటాయనీ, పెద్దగా బాధ్యత లేవీ ఉండవనీ, ఏమాత్రం శ్రమపడనక్కరలేకుండానే తమతోపాటు ఒకేలా జీతాలు అందుకుంటూ సుఖపడిపోతున్నారనే ఓ భావం మిగతా ఉపాధ్యాయులు చాలామందిలో ఉంటుందని తెలిసి విద్యాసాగర్ ఆశ్చర్యపోయాడు. ఇవాళ గొడవ ఇంతగా పెరిగిపోవడానికి కారణమయిన తెలుగు మేష్టరి వ్యాఖ్యల ఆంతర్యం ఇదేనని గ్రహించేక విద్యాసాగర్ మనసులో చాలా బాధపడ్డాడు.

ఉన్నత పాఠశాల స్థాయిలో ఆ ముగ్గురు ఉపాధ్యాయుల ప్రాధాన్యాన్నీ ఎన్ని వెటకారాలు చేసినా ఎవరూ తగ్గించలేరు. విద్యార్థులలోని మానసిక, సృజనాత్మక శక్తులని వెలికి తీయడంలోనూ, శారీరక ధారుఢ్యాన్ని పెంపొందించడంలోనూ ఆ ముగ్గురి టీచర్ల పాత్ర చాలా కీలకమయిందన్న సంగతి తెలిసి కూడా ఎందుకు విస్మరిస్తారో అతనికి అర్థం కాలేదు.

పనిభారంతో జీతం రాళ్ళతోనూ తూకం వేస్తూ సాటి ఉపాధ్యాయులని ఆవిధంగా చిన్నచూపు చూడడం, విద్యాసాగర్‌కి ఆవేదన మిగిల్చింది.

తెలుగుమేష్టరి అల్పత్వప్రదర్శన అతనిలో అసహ్యాన్ని కలిగించింది. స్టాఫ్‌లో తనింకా కొత్తవాడవడంవల్ల తన అభిప్రాయాలు బహిర్గతం చెయ్యడానికి కొంచెం సంకోచించే

డు. అయినా ఈ సంఘటన అతని మనసుని తీవ్రంగా కలచివేసింది.

ఉపాధ్యాయుల మధ్య రేకెత్తిన ఆ జగడం మరి కాస్సేపటికి సద్దుమణిగింది. ఇలాంటి పరిస్థితి మరోసారి ఎదురయితే సహించేది లేదనీ, డిసిప్లినరీ యాక్షన్ తీసుకుంటాననీ జనాంతికంగా అందరికీ వార్నింగ్ ఇచ్చి హెడ్మాష్టరు అక్కడినుంచి తన రూంలోకి వెళ్లిపోయారు.

పెనుతుఫాను వెలిసినట్టయింది. ఆరోజు తక్కిన పీరియడ్లు యధావిధిగానే జరిగాయి. విద్యాసాగర్ అన్యమనస్కంగా క్లాసుకి వెళ్లేడు.



సాయంత్రం ఆఖరి పీరియడ్ గంట కాస్త ముందుగా కొట్టించేసి హెడ్మాష్టరుగారు స్టాఫ్ మీటింగ్ ఏర్పాటుచేశారు.

ఎవరెవరికి రిజల్టు టార్గెట్ ఎంతెంత ఫిక్స్ చేశారో మరోసారి చదివి వినిపించి, హెడ్మాష్టరు తదుపరి చర్యల గురించి ఉపాధ్యాయుల అభిప్రాయాలు అడిగేరు.

ఉదయం స్టాఫ్‌రూంలో జరిగిన సంఘటన తాలూకు ఉద్రిక్త ఛాయలింకా పోలేదేమో, టీచర్లందరూ ముభావంగా ఉండిపోయారు.

ఉపాధ్యాయులు ఏమీ మాట్లాడకపోవడంతో తనే కొన్ని సూచనలు చేశారు హెడ్మాష్టరుగారు. విద్యార్థులకు మరిన్ని ఎసైన్‌మెంట్లు ఇవ్వాలనీ, ఏ విద్యార్థి ఏ సబ్జెక్టులో వెనుకబడి ఉన్నాడో గుర్తించి ప్రత్యేక వ్యక్తిగత శ్రద్ధ చూపించాలనీ, గతంలో జరిగిన పబ్లిక్ పరీక్షల పేపర్లు ఆన్సరు చేయించాలనీ, అదనపు తరగతులు నిర్వహించాలనీ, ఇలాంటివే ఏవో సూచనలు చేశారు.

హెడ్మాష్టరు పదేపదే కోరిన మీదట రిజల్టు శాతం పెంచాలంటే తీసుకోవలసిన చర్యలగురించి ఒక్కొక్కరే పెదవి విప్పి తోచింది చెప్పసాగారు.

ఉన్నట్టుండి- ''రిజల్టు శాతం పెరగాలంటే పబ్లిక్ పరీక్షల్లో కాపీలు కొడుతూఉంటే చూసీ చూడనట్టుగా ఊరుకోవడమే అదే దానికి మందు... అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే కుదరదు'' ఎవరో వెనుకనుంచి అన్నారు.

ఆ మాటలతో హెడ్మాష్టరుకి చిర్రెత్తుకొచ్చింది.

''నాన్సెన్స్... నోటికొచ్చింది మాట్లాడకండి. పరీక్షల్లో అవినీతిని అరికట్టాల్సిన మనమే దాన్ని ప్రోత్సహించాలనడం బుద్ధి తక్కువ. అదొక్కటే దీనికి పరిష్కారమార్గం అనడం అన్యాయం...'' అంటూ మండిపడ్డారు.

ఈ కామెంట్ చేసిన టీచరు తగ్గిపోడానికి యిష్టపడక మరో అస్త్రం సంధించేరు.

''పరీక్షలప్పుడు అడ్డదార్లు తొక్కేవాళ్ళూ, విద్యార్థులు మాల్‌ప్రాక్టీస్‌కి పాల్పడటానికి దోహదంచేస్తున్నవాళ్ళూ లేరంటారా?'' తనని తను డిఫెండ్ చేసుకోడానికి ప్రయత్నిస్తూ అన్నాడతను.

''చూడండీ... ఆ విషయం గురించి మనం యిప్పుడు మాట్లాడ్డం అనవసరం... అది వాళ్ళ వ్యక్తిగత సంస్కారానికి సంబంధించిన విషయం. పరీక్షల్లో అక్రమాలు జరుగుతూనే ఉండొచ్చు. కాపీలు చేయడం, స్లిప్పులు పెట్టి రాయడం ఒక చెడ్డ కల్చరు. అది ఇక్కడే ఈ దశలోనే మొదలయితే ఇక విద్యావిధానాన్ని ఎవరూ ఆదుకోలేరు. మీరు చెప్పినట్టు టీచర్లు కొందరు అలాంటి పనులకి పాల్పడుతున్నారంటే వాళ్ళు ఏవో ప్రలోభాలకి లొంగిపోతున్నారనో విద్యార్థులదగ్గరా, వారి తల్లిదండ్రులదగ్గరా ఛీప్ పాపులారిటీకోసం, ప్రాపకంకోసం దేవులాడుతున్నారనో అనుకోవాలి. కొందరు వ్యక్తుల దౌర్బల్యాలని ఆధారంగా చేసుకుని మొత్తం పరీక్షావిధానాన్నే తెగనాడడం వివేకమనిపించుకోదు. పరీక్షలని స్ట్రిక్ట్‌గా నిర్వహిస్తున్నవా




రు లేరంటారా?'' హెడ్మాస్టరు సూటిగా తీవ్రస్వరంతో ప్రశ్నించేరు.

కాసేపు అందరూ మౌనం వహించేరు. ఈ టాపిక్ లేవనెత్తిన టీచరే, యింకా ఉండబట్టలేక, ''ఉన్నారండీ... లేరని ఎలా అంటాను? పరీక్షల్లో కాపీ చేస్తున్న విద్యార్థిని పట్టుకుని డిబార్ చేయించారని గతంలో మన కస్తూరిరావు మేష్టర్ని పట్టుకుని నడిబజార్లో కొట్టేరు. అప్పుడేమయింది? ఈ ధర్మపన్నాలు పలికేవాళ్ళంతా ఆయన వొంటిమీద దెబ్బ పడకుండా తప్పించగలిగేరా?'' అనడిగేరు.

ఆ ప్రశ్న అక్కడందరికీ సూటిగా తగిలింది. కాని ఆ ప్రశ్నకి అక్కడెవరిదగ్గరా జవాబులేదు.

అందరి మనసుల్లోనూ ఆ సంఘటన కదలాడింది. విద్యాసాగర్ కూడా ఆ విషయం గురించి చూచాయగా విన్నాడు.

కస్తూరిరావు అనే ఆయన ఆరేడేళ్ళక్రితం ఇదే స్కూల్లో పనిచేసేవారు. ఆయన సైన్సుటీచరు. ఆయన బోధనలో ఒక విలక్షణత్వం ఉండేది. పిల్లల మనసుకి హత్తుకుపోయేలా సైన్సు పాఠాలు చెప్పగలిగేవారు. శాస్త్రవిషయాన్ని అంత చక్కగా బోధించడానికి ఎంతో నేర్పూ, ఓర్పూ కూడా ఉండాలి. వీలున్నంతవరకూ ఎప్పుడూ ఏవో ప్రయోగాలు చేసి చూపిస్తూ విద్యార్థులను ఆకట్టుకొనేవారు. జిల్లాలో జరిగే వైజ్ఞానిక ప్రదర్శనలకోసం ఎన్నో మంచి మంచి పరికరాలు తయారుచేసి, స్కూలుకి మంచి బహుమతులు సాధించి పెట్టేవారు. స్కూల్లో జరిగే సాంస్కృతిక కార్యక్రమాల్లో కూడా చురుగ్గా పాల్గొంటూ ఉండేవారు.

ఇలా అన్నివిధాలా తనకంటూ ఒక మంచి స్థానాన్నీ, గౌరవాన్నీ సాధించుకున్న కస్తూరిరావుగారిపై పడరాని దెబ్బ పడింది.

అలా జరగడంలో ముఖ్యపాత్ర వహించినది సాటి ఉపాధ్యాయుడేనని విన్న విషయం విద్యాసాగర్ మరిచిపోలేదు. ఆ విషయం గుర్తొచ్చినప్పుడల్లా విసవుగాడ్పు ముఖాన కొట్టినట్టు అతను విచలితుడైపోతూనేఉంటాడు.

కస్తూరిరావుగారిని దెబ్బ తీసింది అదే స్కూల్లో పనిచేస్తున్న మరో సైన్సు టీచరు రంగారావు. జిల్లాస్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయుడిగా ఎన్నికయిన వ్యక్తి! ఈ నిజం మరింత విషతుల్యంగా విద్యాసాగర్ మనసుని దహించివేస్తూంది.

ఈ దుస్సంఘటన గురించి వర్ధనరావుగారు తనతో చెప్పినప్పుడు విద్యాసాగర్ విభ్రాంతితో అడిగేడు, ''అంత మంచివ్యక్తిపై దెబ్బతీసిన రంగారావు ఉత్తమ ఉపాధ్యాయుడా! అదెలా సంభవం?'' అని.

''మీకిది వింతగా తోచవచ్చును. అసంబద్ధంగా అనిపించవచ్చును. కాని, యిది నిజం! ముమ్మాటికీ నిజం. ప్రతియేటా జరిగే ఉత్తమ ఉపాధ్యాయుల ఎన్నికల్లో ఇలాంటి తొందరపాటు నిర్ణయాలూ, వ్యక్తుల యిష్టాయిష్టాలకి అనుగుణంగా కొన్ని రాజకీయాలు చోటుచేసుకోక తప్పడంలేదు. అలాగని ఉత్తమ ఉపాధ్యాయులుగా ఎన్నికవుతున్న వారందరూ అందుకు అనర్హులని అనడంలేదు. అన్నివిధాలా అర్హులైనవారికి ఎప్పటికీ ఆ సత్కారాలు లభించకపోవడం ఏవిధంగానూ అర్హులు కాని వారిని ఆ అవార్డులు వరించడం అప్పుడప్పుడూ జరుగుతూనే ఉంటోంది. కారణాలు కోకొల్లలు. కాని జరిగేదంతే. దేవాలయాలకి పవిత్రులతోపాటు అపవిత్రులు కూడా చొరబడే వీలు ఎలాగయితే ఉందో అలాగే, ఒక్కోసారి రంగారావులాంటివాళ్ళని కూడా అలాంటి అవార్డులు వరిస్తూ ఉంటాయి''

ఆ మాటలు విన్నాక విద్యాసాగర్ తల దిమ్మెక్కిపోయింది. ఒక శూన్యం అతని మస్తిష్కాన్ని ఆవరించింది. ఈ నిష్ఠురసత్యం జీర్ణించుకోవడం అతనివశం కాలేదు.

కస్తూరిరావుగారిపై రంగారావుకి ద్వేషం కలగడానికి నిజానికి బలమైన కారణాలు కూడా ఏవీ లేవు.

పాఠాలు బోధించడంలో తగినంత ప్రతిభ లేకపోయినా, గడుసుగా, ఇతర గిమ్మిక్స్‌తో విద్యార్థుల పసిమనసులని ఆకట్టుకుంటూ రోజులు నెట్టుకొస్తున్న రంగారావుకి, ఆ స్కూల్లో కస్తూరిరావుగారి ప్రవేశంతో దిక్కుతోచనట్లయింది. సబ్జెక్టులో మంచి పట్టు, బోధనలో మంచి నైపుణ్యం కలిగిన కస్తూరిరావుగారు అనతికాలంలోనే స్కూల్లో పిల్లలందరినీ ఆక

ర్థించగలిగేరు. ఆకట్టుకుని తనవేపు తిప్పుకోగలిగేరు. దాంతో రంగారావుకి వెన్నుపూస విరిగినట్టయింది.

రోజురోజుకీ పిల్లలదగ్గర తన యిమేజ్ పల్చబడిపోతూ వుండడం చూసి రంగారావు ఓర్చుకోలేకపోయేడు. ఏదోవిధంగా కస్తూరిరావు గారిని దెబ్బతీయాలని అడ్డదారులు వెతకడం మొదలుపెట్టాడు.

పబ్లిక్ పరీక్షలు అందుకు ఆయుధంగా వాడుకున్నాడు. సహజంగానే కస్తూరీరావు పరీక్షల్లో అక్రమాలని ఎంతమాత్రం సహించలేని వ్యక్తి. స్ట్రిక్ట్‌గా ఇన్‌విజిలేషన్ చేస్తూవుంటారు.

ఆ ఏడాది పబ్లిక్ పరీక్షల్లో మాల్‌ప్రాక్టీస్ చేస్తూ ఓ విద్యార్థి కస్తూరిరావుగారికి దొరికిపోయేడు. ఆయన వెంటనే ఆ విద్యార్థిని పట్టుకుని మాల్‌ప్రాక్టీసు కేసుకింద బుక్‌చేసేశారు. చాలా మంది అతన్ని వారించడానికి ప్రయత్నించేరు. రాయబారాలు సాగేయి. నయానా భయానా చెప్పిచూసేరు. కస్తూరి రావుగారు తన పట్టు సడలించలేదు. ఆ విద్యార్థిని క్షమించి వదిలెయ్యడానికి సూతరామూ అంగీకరించలేదు.

ఆ పరీక్షాకేంద్రందగ్గర అలజడి మొదలయింది. ఒక ఉద్రిక్త వాతావరణం నెలకొంది. ఏమవుతుందా అనే టెన్షన్ అందరిలోనూ చోటు చేసుకుంది.

ఆ విద్యార్థి స్థానిక మాజీ ఎమ్మెల్యేగారి ఏకైక పుత్రరత్నం కావడంతో, ఆ సంఘటన అనవసర ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. అర్థరహితమయిన ఉద్రేకాలకి కారణమయింది.

రంగారావు ఈ సంఘటనని తనకి అనుకూలంగా వాడుకున్నాడు. మాజీ ఎమ్మెల్యేనీ, అతని అనుచరులనీ కలుసుకుని రెచ్చగొట్టేడు. తన పేరు, ఉనికి ఎక్కడా బయటపడనివిధంగా జాగ్రత్తపడుతూనే చెయ్యవలసిన చెడ్డ అంతా చేసేడు.

ఫలితంగా ఆ రోజు సాయంత్రం ఇంటికి వస్తున్న కస్తూరిరావుగారిపై అకస్మాత్తుగా మోటుమనుషుల దాడి జరిగింది. ఆయన మాట్లాడటానికి కూడా అవకాశం యివ్వకుండా సైకిలు చైన్లతోనూ, కర్రలతోనూ ఆ గూండాలు కుళ్ళబొడిచేరు. ఆ చుట్టుపక్కలవాళ్లు ఆ దృశ్యం చూస్తూ కూడా ఏమీ చేయలేక చేష్టలుడక్కి ఉండిపోయేరు.

ఒక మంచితనం, ఒక నిజాయితీ నడిరోడ్డు మీద గూండాయిజానికి బలైపోయింది.

ఒక మంచి ఉపాధ్యాయుని మనసూ, శరీరమూ కూడా ఆ పాశవిక కృత్యానికి నజ్జునజ్జయిపోయింది.

కొట్టి కొట్టి ఆ గూండాలు వెళ్ళిపోయాక రక్తసిక్తమయిన శరీరంతో, ఎప్పటికీ మరిచిపోలేని అవమానభారంతో రోడ్డుమీద దాదాపు అచేతనస్థితిలో ఉన్న కస్తూరిరావుగారిని ఎవరో దయామయులు హాస్పిటల్లో చేర్చారు. ఆ తర్వాత పోలీసులు రంగప్రవేశం చేసినా - తీవ్ర అసంతృప్తితో, నిస్పృహతో ఉన్న కస్తూరి రావుగారు వారికి సహకరించకపోవడంతో అదొక దొమ్మీకేసుగా కొట్టిపారేయడం జరిగింది.

ఆ తర్వాత కస్తూరిరావుగారు మరింక ఉపాధ్యాయవృత్తిలో కొనసాగడానికి మనస్కరించక రిజైన్‌చేసి, ఎక్కడికో వెళ్ళిపోయేరుట.

తను విన్న ఈ చరిత్ర అంతా గుర్తొచ్చి విద్యాసాగర్ మనసు భారమైపోయింది.

రేపటి లోకంకోసం దీపాలు వెలిగించే ఉపాధ్యాయలోకం ఎంత దిగజారిపోయింది! ఈ పతనం ఏ అగాధాల అంచుల్లోకి? విద్యాసాగర్ తల ఆలోచనలతో వేడెక్కిపోతోంది.

హెడ్మాష్టరుగారు ఎవరిమీదో కోపం తెచ్చుకున్నట్టుగా గట్టిగా మాట్లాడుతూ ఉండడం చెవినిపడి మళ్ళీ ఈలోకంలోకి వచ్చేడు.

స్టాఫ్ మీటింగ్‌లో మళ్ళీ ఏదో అంశంమీద గొడవ జరిగిందని గ్రహించేడు.

హెడ్మాష్టరు తీవ్రస్వరంతో అంటున్నారు. "క్షమించండి... ఇంక ఈ విషయాలు మాట్లాడ్డం నాకు యిష్టంలేదు. ఏదో జరిగిందనీ, జరగబోతోందనీ మనం మన కర్తవ్యాన్ని విస్మరించలేం. విద్యారంగం రానురాను ఒక యుద్ధరంగంగా మారినప్పుడు మనం సుశిక్షితమయిన సైనికుల్లా పనిచేయక తప్పదు. ఇలాగ విమర్శలూ, ప్రతివిమర్శలూ చేసుకుంటూ మన విధిని మనం చేయకుండా వదిలెయ్యడం వివేకం అనిపించుకోదు. అందుచేత





నేను యిందాక ప్రతిపాదించినట్టుగా మీరంతా మరింతగా కృషిచేసి ఈసారి మన స్కూలు ఉత్తీర్ణతాశాతాన్ని బాగా పెంచాలని కోరుతున్నాను. అందుకు మీ అందరి సహకారం ఉంటుందనే ఆశిస్తున్నాను'' అంటూ అంతటితో ఆ మీటింగు ముగించేరు.

విద్యాసాగర్ మనసులో రకరకాల ఆలోచనలు సుడులు తిరగసాగేయి. అతనిలో ఒక ఆవేదనా కెరటం విరుచుకుపడింది. ఏవో ఊహించుకుని, ఎన్నో ఆశలతో తనీ వృత్తిలోకి వచ్చేడు. ఇందులో లోతుపాతులు ఒక్కొక్కటీ తెలుస్తున్నకొద్దీ మనసు వికలమైపోతోంది.

ఈ మహా యంత్రాంగంలో తను ఒక చిన్న మరలాంటివాడు. ఈ యంత్రం ఎలా తిరిగితే తానూ అలాగే తిరగాల్సిందేనేమో...

తుప్పుపట్టిన మరలతో, పనిచెయ్యమని మొరాయించే భాగాలతో మూలబడే స్థితిలో ఉన్న ఈ యంత్రాన్ని సమూలంగా రిపేర్ చేయగలిగే మెకానిక్ ఎవరు?

ఈ శిథిల యంత్రం దేశానికి మంచి ఉత్పత్తులని ఎలా అందించగలదు?

హఠాత్తుగా విద్యాసాగర్‌కి చెప్పలేనంత నిస్సత్తువ ఆవహించింది. కళ్ళముందు గాలిదెయ్యాలు గింగుర్లు కొడుతున్నట్టనిపించింది.

అతనికెందుచేతో ఆ పాఠశాల పునాదులు బలహీనపడి, పై కప్పూ, దూలాలూ, ద్వారాలూ, తలుపులూ, గోడలూ పెద్ద చప్పుడు చేసుకుంటూ ఒక్కసారిగా కళ్ళముందే కుప్పకూలిపోతున్నట్టనిపించింది.

దానికింద చిన్నపిల్లలు అయోమయంగా, అల్లకల్లోలంగా భీతావహులై పెనుకేకలు పెడుతూ, గుండెలు పగిలేలా రోదిస్తూ, దిక్కుతోచక అటూ యిటూ పరుగులు పెడుతున్నట్టు తోచింది. ఆ శిథిల శకలాలకింద నలిగిపోతూ, చివరిసారిగా 'అమ్...మ్...మ్మా!' అని అరుస్తూ, శూన్య భవిష్యత్తులోకి నిస్తేజంగా నిగిడ్చిన చూపులతో పిల్లలు. ఎవరెవరో తెలిసో, తెలియకో చేస్తున్న ద్రోహానికి అన్యాయంగా చిద్రుపలు చిద్రుపలైపోతున్న రేపటి యువశక్తి...

కదిలిపోయిన ఆ పునాదులను దృఢతరం చేసుకోవాలనే యింగితమూ, దృక్పథమూ స్పృహా, కూడా లేకుండా నువ్వూ, నేనూ, వాడూ, వీడూ - మేథావులు, రాజకీయ వేత్తలు, ఉద్యోగులు, తండ్రులూ తల్లులూ - అందరూ ఆ పునాదిరాళ్ళని స్వార్థంతో తలాదిక్కుకీ పెకలించుకుపోతున్నట్టు ఓ విషాదదృశ్యం విద్యాసాగర్ కళ్ళముందు కదలాడింది. అతని కడుపులో దేవేసినట్టయింది.

ఈ భయంకరమయిన ఆలోచనలని తట్టుకోలేక విహ్వలుడైన అతనికి తెలీకుండానే ''మై గాడ్!'' అనే కేక పెద్దపెట్టున అతని నోటి నుండి వెలువడింది.

మీటింగ్ చాలించి వెళ్ళిపోబోతున్నవారందరూ అతని కేక వినిపించి ఉలిక్కిపడి ఆగిపోయారు.

''ఏమయింది... ఏమయింది మేష్టారూ?'' అని గాబరాగా అతని చుట్టూ చేరారు.

విద్యాసాగర్ వాస్తవంలోకొచ్చి తెల్లబోయేడు. అంత ఉద్వేగంగా, అలా ప్రవర్తించినందుకు సిగ్గుతో అతని ముఖం వివర్ణమైపోయింది.

'ఛ! ఏమైంది తనకు? పరిసరాలు మరిచిపోయి అలా ప్రవర్తించకుండా ఉండాల్సింది' అని తనని తనే నిందించుకున్నాడు.

''అబ్బే... ఏంలేదు... ఏంలేదు'' అన్నాడు తడబడుతూ

★ ★ ★

స్కూలు గేటుదాటి బయటకు వచ్చేటప్పటికి పద్మ తనకోసమే ఎదురుచూస్తున్నట్టుగా నిల్చుని ఉంది. జీవంలేని నవ్వొకటి విద్యాసాగర్ పెదిమలమీద తొణికిసలాడింది.

జవాబు అన్నట్టుగా పద్మ చిన్నగా నవ్వింది. స్వచ్ఛమయిన ఆ చిరునవ్వులో ఏదో ఓదార్పు ఉన్నట్టు అతనికెందుచేతో అనిపించింది.

అతనిపక్కనే నడుస్తూ ''మీరివాళ చాలా కలతచెందినట్టుగా అనిపిస్తోంది విద్యా'' అంది నెమ్మదిగా.

విద్యాసాగర్ బదులుచెప్పలేదు. అతని ముఖం గంభీరంగా ఉంది. ఉద్యోగంలో చేరే ముందు, లాడ్జి గదిలో అచ్యుతరావుగారి ఎదుట ఎదురయిన వేదనాభరితమయిన పరిస్థితీ, బయటికి రాగానే వాంతి చేసుకోవడం, జానకేశ్వరరావు తనని పొదివిపట్టుకుని ఆద

రించడం అతనికెందుచేతో చప్పున ఆ సమయంలో గుర్తొచ్చేయి. అతని కళ్ళు చెమర్చేయి.

ఇవాళ పరిస్థితి అంతకంటే భిన్నంగా లేదు. ఇవాళ సూటిగా తనకి ఎలాంటి అవమానం కలగకపోయినప్పటికీ విద్యావ్యవస్థలోని చీకటికోణాలు ఒక్కొక్కటీ బయటపడుతున్నట్టనిపించి మనసంతా చికాగ్గా ఉంది. దిగుళ్ళ కొండలేవో మోస్తున్నవాడిలా అతను తనలో తనే కుంగిపోతున్నాడు.

ఈ పరిస్థితిలో పద్మ మాటలు తొలకరి జల్లులా అతని మనసుని చల్లగా తాకేయి.

"ఇవాళ స్కూల్లో జరిగినదానికి మీరు చాలా అప్సెట్ అయినట్టు కనిపిస్తోంది. ఎంతో ఉదాత్తమూ, ఆదర్శవంతమూ అయిన ఈ రంగంలో కూడా కొందరు కుత్సితులూ, అల్ప మనస్కులూ లేకపోలేదు. మిగతా రంగాలలో లాగే ఇక్కడా రాజకీయాలూ, నటనలూ, మోసాలూ ఎదురవుతూనే ఉంటాయి. కాని మన విధి మనం సక్రమంగా నిర్వర్తించిననాడు లభించే ఆనందంముందు యివేమీ అవరోధాలు కావు. మీ మేష్టర్ల సంగతే తీసుకోండి. మనస్ఫూర్తిగా పాఠాలు బోధించి విద్యార్థుల మన్ననలు పొందగలిగిననాడు లభించే సంతోషానికి కొలబద్దలు లేవు. ఉపాధ్యాయుల మంచిచెడుల తారతమ్యానికి మీ శిక్షణలో విజ్ఞానాన్ని సముపార్జించే విద్యార్థులే సరైన నికషలు. నిజమే... ఈ వయస్సులో పిల్లలకి ఏదిమంచో, ఏదిచెడో తెలీకపోవచ్చు. చిత్తశుద్ధితో పనిచేసేవాళ్ళకీ, పబ్బం గడుపుకునేవాళ్ళకీ అమాయకంగా ఒకే విలువ యిస్తున్నట్టు కనిపించవచ్చు. కాని యింతమంది విద్యార్థులలో కనీసం ఏ కొందరో మంచి ఉపాధ్యాయులని గుర్తుంచుకోక మానరు. మీరు వెలిగించిన దీపాలు ఎక్కడో ఒక చోట వెలుగుతూనే ఉంటాయి. ఆ సంతృప్తి చాలదూ?"

పద్మ నడుస్తూనే మాట్లాడుతోంది.

భారమైన మనసు కొంచెం తేలికపడినట్లయింది విద్యాసాగర్‌కి. మరికాసేపటికి యిద్దరూ విడిపోయే చోటు వచ్చింది.

"వస్తాను... రేపు స్కూల్లో కలుద్దాం" అని చెప్పి పద్మ యింటిదారి తీసింది.

పద్మ మాటలే మననం చేసుకుంటూ ఇంటికొచ్చేడు విద్యాసాగర్.

ఇంటికొస్తూనే ముందు వరండాలో ఎవరో ఓ కొత్త వ్యక్తి కూర్చుని ఉండడం గమనించేడు. అతను బక్కపల్చగా ఒక మోస్తరు పొడుగ్గా ఉన్నాడు. సన్నని మీసకట్టు, ఫుల్‌హేండ్స్ చొక్కా వేసుకుని ఉన్నాడు. తల్లి గుమ్మానికి ఆనుకుని నించుని అతనితో మాట్లాడుతోంది.

విద్యాసాగర్ గుమ్మంలో అడుగుపెట్టగానే ఆవిడ నవ్వుతూ "ఇతన్ని నువ్వు పోల్చుకోగలవేమో చెప్పుకో చూద్దాం" అంది. ఆవిడ ముఖంలో సంతోషం ప్రస్ఫుటంగా తొణికిసలాడుతోంది. తల్లి ముఖంలో అంత సంతోషాన్ని గమనించేక విద్యాసాగర్‌ని ఉదయం నుంచీ బాధించిన విచారమంతా గాలికి పూర్తిగా కొట్టుకుపోయినట్టయింది.

జోళ్లు విడిచి అతని కెదురుగా కుర్చీలో కూర్చుంటూ అతని ముఖంలోకి తదేకంగా చూడసాగేడు. అతను రెండు చేతులూ జోడించి వినయంగా నమస్కరించేడు. ఆ ముఖం ఎప్పుడో పరిచయమైనట్లే అనిపిస్తోంది. కానీ, ఎంత ప్రయత్నించినా గుర్తుకు రావడం లేదు విద్యాసాగర్‌కి.

తల్లి ఇంకా నవ్వుతూ విద్యాసాగర్ ముఖంలోకే చూస్తూ నిల్చుంది. ఆ వ్యక్తి పెదవి విప్పి తన గురించి తను ఏదో పరిచయం చేసుకోబోతున్నంతలో "ఇతను నారాయణ... నీకు గుర్తులేదూ విద్యా?" అంది తల్లి.

నారాయణ! ఆ పేరు విని విద్యాసాగర్ కళ్లు పెద్దవి చేసుకుంటూ అతని ముఖంలోకి చూసేడు. ఆ పేరుతో కూడా తనకెంతో పరిచయం ఉన్నట్టు లీలగా మనసు పొరల్లో మెదులుతోంది.

కొద్ది క్షణాలు గడవకముందే విద్యాసాగర్‌కి అతనెవరో పూర్తిగా గుర్తొచ్చింది.

సంభ్రమంగా అతనివేపు చూస్తూ "నువ్వు... నువ్వు... మేం మా అచ్యుతాంబ అత్తయ్యగారింట్లో ఉండే రోజుల్లో మా అమ్మ దగ్గర చదువుకోడానికి వచ్చే వాడివి... కదూ!" సంతోషం పట్టలేక, లేచి వెళ్లి అతని చేతులు రెండూ పట్టుకుని కుదిపేస్తూ అన్నాడు విద్యా





సాగర్.

విద్యాసాగర్ తనని గుర్తు తెచ్చుకోగలగడం నారాయణకి అమితానందాన్ని కలిగించింది. అతని కళ్లు సంతోషంతో మెరిసాయి.

వాళ్లిద్దరినీ మాట్లాడుకుంటూ ఉండమని చెప్పి కాఫీ, టిఫిన్లు తేవడానికి వంట గదిలోకి వెళ్లేరు పార్వతమ్మ.

ఆ తర్వాత ఇద్దరి మధ్యా బాల్య స్మృతులు సంభాషణలోకి వచ్చేయి. జ్ఞాపకాల పరదాలు తెరుచుకుని ఎన్నెన్నో చిన్ననాటి ముచ్చట్లు కలబోసుకున్నారు. ఆ రోజుల్లో తమ ఇంటికి ట్యూషనుకి వచ్చిన వాళ్లలో నారాయణతో పాటు మరొకరిద్దరి పేర్లు మాత్రమే గుర్తున్నాయి విద్యాసాగర్‌కి. పేర్లు గుర్తులేని ఒకరిద్దరి రూపాలు లీలగా స్ఫురణకొస్తున్నాయి.

ముఖ్యంగా ఆ రోజుల్లో ఆ గ్రామంలో తమని ఆదరించిన వాళ్లందరి గురించీ మాత్రం పేరు పేరునా అడిగి తెలుసుకున్నాడు.

వాళ్లకి సంభాషణలో కాలం తెలీలేదు. ఈలోగా నారాయణమూర్తిగారు ఇంటికొచ్చేరు. విద్యాసాగర్ నారాయణని తండ్రికి పరిచయం చేశాడు.

''నువ్వు... కొమరయ్య కొడుకువి కదూ!'' అంటూ నారాయణమూర్తిగారు ఆప్యాయంగా అతన్ని పలకరించేరు. అతని కుటుంబ సభ్యుల గురించి యోగక్షేమాలడిగి, బట్టలు మార్చుకోడానికి ఇంట్లోకి వెళ్లిపోయేరు.

పది నిముషాలు గడిచేక పార్వతమ్మ చెరో ప్లేట్లోనూ టిఫిన్ తెచ్చి అందించేరు. నారాయణ మొహమాటపడుతూనే టిఫిన్ తీసుకున్నాడు. ఆ తర్వాత కాఫీలు తాగడం పూర్తయేక నారాయణ తనొచ్చిన పని గురించి విద్యాసాగర్‌తో చెప్పేడు.

''పెళ్లి సంబంధం చూసుకోడానికి వచ్చేవన్న మాట!'' నవ్వుతూ అన్నాడు విద్యాసాగర్.

అవునన్నట్టుగా అతను సిగ్గుగా నవ్వుతూ తలూపేడు.

''మా అమ్మా నాన్నా ఈ ఊరొచ్చి అమ్మాయిని చూసి వెళ్లేరు. పిల్ల వారికి బాగా నచ్చింది. వాళ్లీఊరు వచ్చినప్పటికి మీరిక్కడ ఉన్నట్టు మాకు తెలీదు. ఆ తర్వాత ఈ ఊర్లో సంబంధం చూసి వచ్చినట్టుగా నాన్న ఎవరితోనో అంటే మీరిక్కడే ఉన్నట్టు తెలిసింది. ఇప్పుడా సంబంధం చూసి రమ్మని నన్ను పంపించేరు. మీరున్నారని తెలిసి ఎగిరి గంతేసి వచ్చేను...'' గబగబా చెప్పుకు పోయేడు నారాయణ.

అమ్మ దగ్గిర అక్షరాభ్యాసం చేశాక నారాయణ చదువు అంతటితో ఆగిపోలేదు. వాళ్ల కుటుంబంలో పుస్తకాలు చేతబట్టిన మొదటి వ్యక్తి నారాయణే! అందరూ చదువు సంధ్యలు లేకుండా కూలి పనులు చేసుకుంటూ కాలం వెళ్లబుచ్చేవారే... నారాయణని చదివించడానికి మొదట్లో వాళ్ల ఇంట్లో ఎవరికీ ఇష్టం లేకపోయినా, తన తల్లి బలవంతం మీద అతని చదువు కొనసాగిందన్న సంగతి విద్యాసాగర్‌కి తెలుసు. ఏ దశలోనూ నారాయణ చదువుని ఆపేది లేదని పార్వతమ్మ చేతిలో చెయ్యివేసి ప్రమాణం చేసిన నారాయణ తల్లిదండ్రులు ఆ మాట నిలబెట్టుకున్నారు. నారాయణ పట్నంలో బి.కాం. పూర్తి చేసి, తన తెలివితేటలతో, సామర్థ్యంతో బ్యాంకులో ఉద్యోగం సంపాదించుకోగలిగేడు.

ఈ వివరాలన్నీ నారాయణ నోటవిన్నాక చాలా సంతోషం కలిగింది విద్యాసాగర్‌కి.

''సరే... ఇంతకీ అమ్మాయి పేరేమిటి? వాళ్ల అడ్రస్ చెప్పు...'' అనడిగేడు.

దానికి సమాధానంగా నారాయణ జేబులోంచి పర్సుతీసి, అందులోనుంచి ఒక అడ్రస్ రాసిన కాగితం తీసి విద్యాసాగర్‌కి అందించేడు.

ఆ కాగితంలో రాసి ఉన్న అడ్రస్ చదువుతూనే విద్యాసాగర్ ముఖం వెయ్యి వోల్టుల బల్బులా వెలిగిపోయింది. పట్టరానంత ఆనందంతో తబ్బిబ్బయిపోయేడు. అతని సంతోషం అవధులు దాటింది.

పెళ్లి కూతురు ఎవరో కాదు... పద్మ!

తల్లినీ తండ్రినీ కేకేసి ఆ విషయం వాళ్లతో చెప్పి, సంతోషాన్ని వాళ్లతో పంచుకున్నాడు.

అది విని పార్వతమ్మ మనసారా నవ్వుతూ ''చాలా మంచి మాట విన్నాను నాయనా...





పద్మ చాలా బుద్ధిమంతురాలు. చాలా తెలివైంది. చక్కని రూపం. నీకు నచ్చి నువ్వు పెళ్లికి అంగీకరిస్తే ఎంతో మంచి సంబంధం. పద్మ అదృష్టవంతురాలవుతుంది'' అంది.

తను సంబంధం చూసుకోడానికి వచ్చిన అమ్మాయి విద్యాసాగర్ కుటుంబంలో అందరికీ ఆప్తురాలన్న సంగతి విన్నాక నారాయణ కూడా చాలా ఆనందించేడు. అతని వదనంలో ఎనలేని తృప్తి చోటు చేసుకుంది.

''మీ మనసుని మెప్పించగలిగిన ఆ అమ్మాయి నాకు కూడా నచ్చినట్టేనమ్మా... ఈ సంబంధం ఖాయం అయిపోయినట్టే.. మీ దంపతులే ఆశీర్వదించి మా పెళ్లి జరిపించాలి...'' అన్నాడు వినమ్రంగా.

తల్లిపట్ల నారాయణ ప్రదర్శిస్తున్న అపూర్వమయిన గౌరవభావానికి విద్యాసాగర్ చలించిపోయేడు. అతని మనసు ఆర్ద్రమయిపోయింది.

అప్పుడతని కంటికి తన తల్లి విద్యులతల్లిలా అనిపించింది.

ఆవిడ ఎదుట నారాయణ చేతులు కట్టుకుని నిల్చునే పాఠశాల విద్యార్థిలాగే ఉన్నాడు.

చిన్నప్పుడు తను ఎంతగా దబాయించినప్పటికీ వినకుండా ''అ... అంటే అమ్మ, ఆ అవు... పంతులమ్మగారు అలాగే చెప్పేరు. అదే నిజం'' అంటూ ససేమిరా తన మాటలకి లొంగకుండా తన చేత అనవసరంగా దెబ్బలు తిన్న చిన్నప్పటి కుర్రాడిలాగే అబ్బురంగా కనిపిస్తున్నాడు.

''మా అమ్మ మాటంటే నీకెంత గౌరవం!'' అపేక్షగా నారాయణ ముఖంలోకి చూస్తూ అన్నాడు విద్యాసాగర్.

మౌనంలోనే ఎన్నో అపురూపమయిన అర్థాలు స్ఫురించేలా నవ్వి ఊరుకున్నాడు నారాయణ.

★ ★ ★

తర్వాత వేడి నీళ్లతో స్నానాలు చేసి తయారై ఇద్దరూ పద్మా వాళ్లింటికి వెళ్లేరు.

నారాయణ వస్తాడని ముందుగానే తెలిసి అతని రాక కోసం ఎదురు చూస్తున్న ఆ ఇంటిలోని వ్యక్తులు అతనితోపాటు విద్యాసాగర్ కూడా రావడం చూసి ఆశ్చర్యపోయేరు. ఆ తర్వాత వాళ్ల పరిచయం గురించి తెలుసుకున్నాక సంతోషించేరు.

నారాయణ ముందుగానే చెప్పడం చేత పెళ్లి చూపుల తతంగం ఏ అట్టహాసమూ లేకుండా చాలా సహజంగా జరిగింది.

పద్మ కంచి కాటన్ చీరలో చాల సింపుల్‌గా అలంకరించుకుని ఉంది. మెడలో ఒంటిపేట గొలుసు వేసుకుని జడ వదులుగా అల్లుకుని ఉంది. జడలో కనకాంబరాల దండ వేలాడుతోంది. చెవులకి చిన్న సైజు దుద్దులు, నుదుటి మీద పొందికగా పెట్టుకున్న తిలకం బొట్టు, నిర్మలంగా మంచులో తడిసిన మందారంలా ఉందామె.

నారాయణ ఏవో ఒకటి రెండు ప్రశ్నలడిగేడు. విద్యాసాగర్‌కి వాళ్లిద్దర్నీ ప్రైవేటుగా మాట్లాడుకోనిస్తే బాగుంటుందనిపించింది. నారాయణ కూడా అదే అభిప్రాయం వెలిబుచ్చేడు. పద్మ సిగ్గు పడుతూనే అందుకు అంగీకరించింది.

ఆ తర్వాత పద్మ, నారాయణలు మేడ మీదకి వెళ్లి కాసేపు ఏకాంతంగా మాట్లాడుకొని వచ్చేరు.

ఇద్దరూ ఒకరి కొకరునచ్చేరు. అందరి ముఖాల్లోనూ ఆనందం వెల్లివిరిసింది. చాలా రోజుల తర్వాత పద్మ తల్లి ముఖంలో తృప్తితో కూడిన మెరుపు కనిపించింది విద్యాసాగర్‌కి.

ఇవాళ పగలంతా ఆవేదనతోనూ, ఆందోళనతోనూ గడిచింది. తలుచుకుంటేనే విద్యాసాగర్‌కి ఆశ్చర్యం కలుగుతోంది. ఇప్పుడా బాధ లేశమాత్రమయినా అతనిలో లేదు. ఆ దిగులంతా ఎవరో మంత్రించి తీసిపారేసినట్టు అతని మనసు ఇప్పుడు దూదిపింజెలా తేలికపడింది.

వేసవికాలం మధ్యాహ్నం భయంకరమయిన వడగళ్లవాన కురిసి వెలిసిపోయేక, ఆకాశంలో ఇంద్రధనుస్సు నేత్రపర్వంగా కనిపించినట్టు అతని మనసు ప్రఫుల్లమయింది.

మరి కాస్సేపు గడిచేక ఇద్దరూ ఇంటికి వెళ్లడానికి లేచి నించున్నారు.

వాళ్లని సాగనంపుతూ- ''తక్కిన విషయాలు మాట్లాడుకోవడం కోసం మంచిరోజు చూసుకుని వస్తామని మీ నాన్నగారితో చెప్పు బాబూ...'' పద్మ తల్లి నారాయణతో అంది.

'అలాగే' అన్నట్టుగా తలూపి బయలుదేరాడు నారాయణ.

గుమ్మం దిగి వెళ్లబోతూ ఒక్కక్షణం ఆగి పద్మతో నవ్వుతూ అన్నాడు విద్యాసాగర్. మేం వెలిగించిన దీపాలు ఎక్కడో ఒకచోట వెలుగుతూ ఉంటాయని ఇందాక అన్నావు కదూ! నారాయణ మా అమ్మ వెలిగించిన దీపం. ఆవిడ దగ్గరే అక్షరాలు దిద్దడం నేర్చుకున్నాడు. నాకెంత సంతోషంగా ఉందో తెలుసా!''

పద్మ పెదవుల మీద దరహాసం లాస్యం చేసింది. ఆత్మీయంగా చూస్తూ కళ్లతోనే వీడ్కోలు చెప్పింది.



అక్కడ నుంచి బయలుదేరి వచ్చేటప్పటికి రాత్రి దాదాపు ఎనిమిది గంటలు కావస్తోంది.

ఇంటి వద్ద విద్యాసాగర్ తల్లీతండ్రీ వాళ్ల కోసమే ఎదురు చూస్తూ కనిపించేరు.

విద్యాసాగర్ నోటమ్మట ఆ సంబంధం కుదిరిందన్న సంగతి తెలుసుకుని ఆవిడా నారాయణమూర్తిగారూ కూడా ఎంతో సంతోషించేరు.

ఆఖరి బస్సు మరో అరగంటలో ఉంటుందనీ, తను వెళ్లిపోతాననీ నారాయణ ఎంత చెప్పినా ఆ రాత్రికి అతన్నింక కదలనివ్వలేదు.

రాత్రి భోజనాలప్పుడు తన మనసులోని మాట వాళ్ల ముందు వ్యక్తం చేశాడు నారాయణ. తను కట్నం తీసుకోడనీ, లాంఛనాలూ, కానుకలూ ఏవీ వద్దనీ, పెళ్లి కూడా పెద్ద ఆర్భాటాలేవీ లేకుండా జరిపిస్తే బాగుంటుందనీ అన్నాడు. ఈ విషయాలు పద్మ వాళ్లింట్లో తెలియజెయ్యమని విద్యాసాగర్ని కోరేడు. పెళ్లయేక తనిక్కడకి దగ్గరగా ట్రాన్స్‌ఫర్ చేయించుకోడమో, పద్మకి తను పని చేసే ఊరికి దగ్గరగా బదలీ కోసం ప్రయత్నాలు చెయ్యడమో చేస్తానని చెప్పేడు.

ఏ కట్న కానుకలూ ఆశించకుండా పెళ్లికి సిద్ధపడిన నారాయణ వ్యక్తిత్వం అందరికీ నచ్చింది. విద్యాసాగర్ నారాయణ వేపు అభినందన పురస్సరంగా చూసేడు.

తన దగ్గర కూచుని అక్షరాలుదిద్దిన నారాయణ ఎంతగా ఎదిగిపోయేడో చూసి పార్వతమ్మగారు పొంగిపోయేరు.

భోజనాలయేక నారాయణ శాంతి, వెంకుబాబుల చదువుల గురించి అడుగుతూ వాళ్లతో కాసేపు మాట్లాడేడు. తర్వాత విద్యాసాగర్ నారాయణలు ముందు గదిలో పడకలు వేసుకుని చాలా రాత్రి వరకూ ఏవో ముచ్చట్లు చెప్పుకుంటూ గడిపేరు.

మర్నాడు ఉదయాన్నే లేచి ముఖం కడుక్కున్నాక కాఫీ తాగి అందరి దగ్గరా సెలవు తీసుకుని నారాయణ వెళ్లిపోయేడు.

★ ★ ★

పద్మ పెళ్లి కుదిరిందన్న వార్త స్కూల్లో అందరికీ తెలిసిపోయింది. అందరూ సంతోషంగా పద్మకి అభినందనలు చెప్పి, ప్రస్తుతానికి కాఫీలయినా ఇస్తే కానీ వీల్లేదని పట్టుపట్టేరు.

పద్మ నవ్వేసి అందరికీ కాఫీలు తెప్పించింది.

ఆ రోజంతా ఉల్లాసంగానే గడిచింది. సాయంత్రం లాంగ్‌బెల్ అవుతుందనగా హెడ్మాష్టరుగారి నుంచి విద్యాసాగర్‌కి కబురొచ్చింది.

విద్యాసాగర్ అతని గదిలోకి వెళ్లేసరికి హెడ్మాష్టరు ఏవో బిల్లు మీద సంతకాలు పెడుతున్నారు. విద్యాసాగర్ని కూచోమని చెప్పి మరో





నాలుగయిదు నిముషాల్లో తన పని పూర్తి చేసుకున్నారు.

ఆ తర్వాత పెన్‌కేప్ ముడిచేస్తూ జేబులో పెట్టుకుని నవ్వుతూ అడిగేరు "మీకు ఈ సాయంత్రం వేరే పనేమీలేదు కదూ? తీరిగ్గానే ఉంటారా?'' అని.

"తీరికే... వేరే ముఖ్యమయిన పనులేవీ లేవు... చెప్పండి'' అన్నాడు విద్యాసాగర్.

"అలాగయితే కాస్సేపు ఆగండి. స్కూలు వదిలేక అలా మా ఇంటి వేపు వెళ్తూ మాట్లాడు కుందాం'' అంటూ హెడ్మాష్టరుగారు గోడ గడియారం వేపు చూసేరు. లాంగ్‌బెల్‌కింకా నాలుగయిదు నిముషాలు టైముంది.

విద్యాసాగర్‌కి అతను తనతో ఏం మాట్లాడదలిచేరో అర్థం కాలేదు. ఇదివరకెప్పుడూ తననిలా ప్రత్యేకంగా రప్పించి మాట్లాడలేదు. లెసన్ ప్లాన్లూ అవీ సకాలంలో సబ్‌మిట్ చేస్తూ ఉంటాడు కనుక వాటి గురించి ప్రత్యేకంగా తన గదిలోకి పిలిపించి మాట్లాడే పనిలేదు. ఇంకేమై ఉంటుందబ్బా?

ఆలోచిస్తూ ఎడం చేతి పక్క నున్న కిటికీ లోంచి బయటకి చూసేడు.

సాయంకాలపు ఎండ గ్రౌండు మీద ఏటవాలుగా పడుతోంది. ఆటస్థలం వెనకవేపున్న తోటలోంచి చల్లని గాలి వీస్తోంది. ఆఖరి పీరియడ్ డ్రిల్లు క్లాసు కావడం చేత దాదాపు అన్ని తరగతుల పిల్లలూ గ్రౌండ్‌లో ఏవో ఆటలాడుకుంటూ కనిపిస్తున్నారు. ఇరుకు తరగతి గదుల్లో కూర్చుని కూర్చుని వచ్చేరేమో ఆ ఆటవిడుపు సమయాన్ని వాళ్లు ఉల్లాస భరితంగా గడుపుతున్నారు. కాస్సేపు డ్రిల్లు ప్రాక్టీసు చేయించి వాళ్లని వదిలేసినట్టున్నారు. డ్రిల్లు టీచరు గ్రౌండ్‌లోనే ఓ చివరగా ఒకరిద్దరు మేష్టర్లతో మాట్లాడుతూ కనిపిస్తున్నారు. దక్షిణం వేపున్న గదుల్లో పదో తరగతి విద్యార్థులకింకా ఏవో క్లాసులు జరుగుతున్నట్టున్నాయి.

గ్రౌండ్‌లో పిల్లల సందడి హెచ్చుగా ఉంది. ఒకరి నొకరు తోసుకుంటూ, ఒకరి చుట్టూ ఒకరు పరిగెడుతూ ఏవేవో ఆటలాడుకుంటున్నారు. ఆటల పట్ల మరింత ఎక్కువ ఆసక్తి ఉన్న పిల్లలు చెడుగుడు ఆడుకుంటున్నారు. మిగతా ఆడ పిల్లలు రింగ్ టెన్నిస్‌లాంటి ఆటలు ప్రాక్టీసు చేస్తున్నారు. అల్లంత దూరంలో మామిడి చెట్టు కింద ఉన్న బోరింగ్ కొడుతూ ఆ నీళ్లు ఒకరిపై ఒకరు జల్లుకుంటూ మరికొంతమంది పిల్లలు కేరింతలు కొడుతున్నారు. అటెండరు వాళ్ల అల్లరి మాన్పించాలని కేకలేస్తూ ఏదో బెదిరిస్తున్నాడు. అతని మాటలు లక్ష్యపెట్టకుండా ఆ పిల్లలు తమ ధ్యాసలో తాము ఉన్నారు.

ఆ దృశ్యం చూస్తూ కూర్చున్న విద్యాసాగర్ మనసులో ఏదో ప్రశాంతత ఆవరించినట్టయింది.

ఈ పిల్లల్లో చాలామంది సరిగా చదవడం లేదనో, మొద్దులనో, పనికిరాని వాజమ్మలనో తరగతి గదుల్లో మేష్టర్లచేత తరుచుగా చీవాట్లు, చెంపదెబ్బలు తింటూనే ఉంటారు. చదువంటే వైముఖ్యం, పరీక్షలంటే భయం కలగడానికి తమ తెలివితేటలు మాత్రమే కారణం కాదన్న సంగతి వాళ్లకి తెలీదు.

తరగతి గదుల్లో చురుకైన పిల్లలముందు న్యూనతా భావంతో కుంచించుకుపోయే ఆ పిల్లలంతా ఇప్పుడు అదంతా మరిచిపోయి పట్ట పగ్గాల్లేకుండా కలిసిమెలిసి ఆడుకుంటున్నారు. ఇక్కడ తెలివైన విద్యార్థి, తెలివి తక్కువ వాడు అనే తేడా లేదు. తరగతి గదుల్లో కృతక గంభీరమయిన వాతావరణం సడలిపోయి నిజమయిన క్రీడా స్ఫూర్తికి అనువైన పరిస్థితులు నెలకొంటే ఈ చదువులు ఇంత పతనావస్థలో ఉండేవి కావేమో.

లాంగ్‌బెల్ గణగణమని మ్రోగడంతో విద్యాసాగర్ ఆలోచనలలోనుంచి తేరుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?'' కుర్చీలోంచి లేచి నిలబడి నవ్వుతూ అడిగేరు హెడ్మాష్టరు గారు.

"అబ్బెబ్బె...ఏం లేదు...'' ఏం జవాబు చెప్పాలో తెలీక తత్తరపాటు చెందేడు విద్యాసాగర్.

"పదండి''

ఇద్దరూ గదిలోంచి బయటకి వచ్చేరు. పిల్లలంతా బిలబిలలాడుతూ గేటు దాటి ఇళ్లకి బయలుదేరారు. టీచర్లు కూడా గుంపులు

గుంపులుగా మాట్లాడుకుంటూ ఇళ్లకి దారితీశారు.

అటెండరు వచ్చి హెడ్మాష్టరు గదికి మిగతా వాటికి తాళాలు వేశాక, అతనిచ్చిన తాళం చెవుల గుత్తిని జేబులోవేసుకుని హెడ్మాష్టరు కదిలేరు. విద్యాసాగర్ అతన్ని అనుసరించేడు.

ఇద్దరూ స్కూలు ఆవరణదాటి హెడ్మాష్టరు గారి ఇంటి దిశగా నడక ప్రారంభించేరు.

"నిన్న స్కూల్లో జరిగిన గొడవ మిమ్మల్ని బాగా కలత పెట్టినట్టుంది కదూ?" అడిగేరు హెడ్మాష్టరుగారు.

విద్యాసాగర్ వెంటనే ఏ జవాబూ చెప్పలేదు. కాస్సేపాగి "స్కూల్లో పిల్లల ముందు అలా జరగడం చాలా బాధ కలిగించింది..." అన్నాడు.

హెడ్మాష్టరుగారు నిట్టూర్చి "నిజమే... నన్నూ అదే విషయం బాధించింది. తరుచుగా ఏదో ఓ చిన్న విషయాన్ని గోరంతలు కొండంతలు చేసి రాద్ధాంతం చేస్తూ ఘర్షణలు పడటం స్టాఫ్‌లో చాలామందికి అలవాటయిపోయింది. ఎన్నోసార్లు చెప్పి చూసేను. వాళ్ల పద్ధతి మార్చుకోరు. అసలు కొందరికయితే అకడమిక్ ఇంట్రెస్టు ఏమాత్రం లేకపోయినా రోజూ ఇలా ఏదో ఓ సీన్ క్రియేట్ చేసి ఆనందించడమే అలవాటుగా మారిపోయింది" అన్నారు.

విద్యాసాగర్‌కి స్టాఫ్ రూమ్‌లో అప్పుడప్పుడు తెలుగు టీచరు నరసింహారావు చేసే కామెంట్ ఒకటి గుర్తొచ్చింది.

జాగ్రత్తగా ప్రిపేరయి, యింట్రెస్టింగ్‌గా పాఠం చెప్పి స్టాఫ్ రూమ్‌లోకి వచ్చినపుడు మెచ్చుకోవడం సంగతి అలా ఉంచి వెటకారంగా ఏదో ఓ విసురు విసరడం అతనికి అలవాటు. "ఎందుకండీ బాబూ విద్యాసాగర్ గారూ మరీ అంత గొంతు చించుకుని, గుండెలు ఎండి పోయేలా శ్రమపడి పోతారు క్లాస్ రూంలో. ఈ పిల్లల భవిష్యత్తంతా ఏదో మీ ఒక్కరి భుజస్కంధాలమీదే ఉన్నట్టు ఊరికే హైరానా పడిపోతారేమిటండీ, మరీనూ! చూడండీ.. ఎగిరి దంచినా, ఎగరకదంచినా కూలి ఒకటే అని సామెత. ఆ వెధవలకి ఎలా చెప్పినా తలకెక్కి చావదు.. అంచేత మనం గొంతు చిరిగిపోయేలా అరవడంవల్ల ఏ ప్రయోజనమూ వచ్చి పడిపోదు. ఇంకా బోలెడు సర్వీసు చేయాల్సి ఉంది. మొదట్లోనే ఒంట్లో శక్తంతా ధారపోసి వీరత్యాగం చేస్తే ఎలా సార్? మన స్కూళ్లలో 'బిల్లు- బెల్లు- గొల్లు' అనే మాటని మీరు వినలేదా ఏం?" అని సుదీర్ఘమయిన ఉపన్యాసం ఒకటి ఇచ్చి ఫెళ్లున పడి పడి నవ్వుతూ ఆ మాటలకి అర్థాలు కూడా వివరించేరు ఒకసారి.

"మనక్కావలసిందేమిటి చెప్పండి? బిల్లు... జీతాల బిల్లు... అది సక్రమంగా వెళ్తోందా లేదా- జీతాలు, అరియర్లు సకాలంలో అందుతున్నాయా లేదా అని చూసుకోవడం. రెండోది బెల్లు... ప్రాణం ఆర్చుకుపోయేలా పాఠాలు అరిచి గీ పెట్టడం కాదు... గంట ఎప్పుడు కొడతారా, ఈ రోజుకీ చెర ఎప్పుడు విముక్తి అవుతుందా అని, నిముషానికోసారి చేతి వాచీ వేపు చూసుకుంటూ వీరయ్య కొట్టే గంట కోసం ఓ చెవి అటుపడేసి ఉంచడం. ఇక మూడోది గొల్లు... అది రోజూ ఉండేదే... మనం చెప్పి ఏడ్చినా, చెప్పకుండా ఏడ్చినా పిల్లలగోల మనకి తప్పదు కదా, ఆ గొల్లు కాస్సేపు భరిస్తే ఇహ ఆ రోజుకి డ్యూటీ ముగిసిపోయినట్టే" అని ఆ మాటలకి టీకా తాత్పర్యాలు వివరించినట్టు చెప్పేరు.

ఆ రోజు అతని మాటలు తనకి కోపం తెప్పించాయి. కానీ చూస్తూ చూస్తూ అంత సర్వీసున్న పెద్దాయనని ఏం అనడానికీ తనకి నోరు రాలేదు.

నరసింహారావుగారు చెప్పే ఇలాంటి పనికి మాలిన కబుర్ల కోసం, సరదా కథల కోసం స్టాఫ్‌లో చాలామంది క్లాసులకి వెళ్లాల్సి ఉన్నా, కాస్సేపు తాత్సారం చేస్తూంటారు. అతని చుట్టూ చేరి అతను చెప్పే కబుర్లు వింటూ వీలయితే క్లాసులు ఎగ్గొట్టడం కూడా కద్దు. ఒక్కోసారి ఆ కబుర్లలో బూతులు కూడా దొర్లిపోతూ ఉంటాయి.

మొదట్లో అదంతా భరించలేనంత దుర్భరంగా తోచేది తనకి. కానీ రాను రాను అనివార్యంగా సహించి విననట్టు ఊరుకోవడం అలవాటు చేసుకున్నాడు.




అయితే... విచిత్రమయిన విషయం ఏమి టంటే,

ఉపాధ్యాయ వృత్తిపట్ల ఏమాత్రం గౌరవ భావం లేనట్టు కబుర్లు చెప్పే నరసింహారావు గారికి తన తెలుగు సబ్జెక్ట్‌లో అపారమయిన ప్రజ్ఞ ఉంది. అద్భుతమయిన పాండిత్యం ఉంది. డ్యూటీ పట్ల అందరి మనసుల్లోనూ చులకన భావం ఏర్పడేలా మాట్లాడతారే కానీ... తన పని విషయంలో అశ్రద్ధ చూపించ రు. ఆయన పాఠం చెప్తే పిల్లలు ఇళ్లకి వెళ్లి మరి చదవక్కర లేదని ప్రతీతి ఉంది.

అలాంటి వ్యక్తి యితరుల మతులు పోగొ ట్టేలా అలా ప్రవర్తిస్తూ ఎందుకలా మాట్లాడు తూ ఉంటారో విద్యాసాగర్‌కి ఎంత ఆలో చించినా అర్థం కాదు. తను తప్పుకి దొర క్కుండా ఎదుటివాళ్లు అడ్డదారులు పట్టేలా చేసి ఆనందించే ఆ విపరీత మనస్తత్వం ఏమిటో చిత్రంగా అనిపిస్తుంది తనకి.

"మళ్లీ ఏదో ఆలోచనల్లోపడి పోయినట్టున్నా రు..." ఎదురుగా వస్తున్న రిక్షాని కూడా చూసుకో కుండా పరధ్యానంగా నడుస్తున్న తనని హెడ్మా ష్టరు పక్కకి నెడుతూ అంటుంటే విద్యాసాగర్ తుళ్లిపడ్డాడు.

"సారీ సర్.. తెలుగు మేష్టరుగారి మాటలేవో గుర్తొచ్చి..." అన్నాడు నొచ్చుకుంటున్నట్టుగా నసుగుతూ.

'అతనా! అతనో పెర్వర్టెడ్ జీనియస్. స్కూ ల్లో సగం ప్రాబ్లెమ్స్ అలాంటి ఒకరిద్దరి వల్లే ఉత్పన్నమవుతూ ఉంటాయి. తా చెడ్డ కోతి వనమంతా చెరిచిందన్నట్టు వృత్తిపట్ల ఏమా త్రం అంకిత భావం ఉన్న వాళ్లయినా ఆ ధోరణికి, అతని మాటల ప్రభావానికి లొంగి పోయి ఉపాధ్యాయవృత్తిపట్ల చులకనభావం ఏర్పరుచుకుంటూ ఉంటారు. ప్రభుత్వ పాఠశా లల్ని కేన్సరుకంటే ప్రమాదంగా పట్టి పీడిస్తు న్నది ఈ అలసత్వ భావనే. దాన్ని మరింత పెంచి పోషించేది నరసింహారావుగారి లాంటి వ్యక్తులే"

సాధారణంగా స్టాఫ్‌లో ఎవరి గురించీ ఏమీ అనని హెడ్మాష్టరుగారు తన మనసులోని భావాలని ఇలా సూటిగా చెప్పడం ఆశ్చర్యం కలిగించింది విద్యాసాగర్‌కి.

ఇద్దరూ మాట్లాడుతూనే హెడ్మాష్టరుగారి ఇంటిని సమీపించేరు. ఆ ఇల్లు విద్యాసాగర్‌కి పరిచయమైనదే. లోగడ ఏవో పనుల మీద ఒకటి రెండు పర్యాయాలు అక్కడకి వచ్చేడు.

"రండి..." అంటూ ఇంట్లోకి దారి తీసేరు హెడ్మాష్టరుగారు.

విద్యాసాగర్‌ని ముందు గదిలో సోఫాలో కూర్చోమని చెప్పి, డ్రస్ మార్చుకుని రావడాని కి లోపలి కెళ్లారాయన.

విద్యాసాగర్ సోఫాలో కూచుని చుట్టూ చూపు లు సారించేడు.

ఆ గదంతా ఎంతో నీట్‌గా సర్ది అమర్చబడి ఉంది. తను కూర్చుని ఉన్న సోఫాకాక, మరో రెండు అల్లిక కుర్చీలూ, మధ్య ఓ టీపాయ్ ఉన్నాయి. దాని మీద హెడ్మాష్టరుగారి అభిరు చికి అద్దం పట్టేలాగ ఒకటి రెండు మంచి ఇంగ్లీషు నవలలు, వాటితోపాటు సుప్రసిద్ధ రచయితల తెలుగు పుస్తకాలు రెండూ ఉన్నాయి. కుడివేపు పుస్తకాల రేక్‌లో చాలా పుస్తకాలు చక్కని క్రమంలో పేర్చి ఉన్నాయి. లోపలి గదిలోకీ, పక్కనున్న కిటికీలకీ అందమ యిన తెరలు వేలాడుతున్నాయి. ఎదురుగా గోడమీద 'చెడు వినకు. చెడు చూడకు. చెడు మాట్లాడకు' అనే అర్థాన్ని స్ఫురింపజేసే మూ డు కోతుల బొమ్మ ఉన్న రంగుల పెయింటింగ్ అతికించబడి ఉంది. ఆ గదికీ లోపలి గదికీ కార్నర్‌లో గోడకి చిన్న షెల్ఫ్‌లాంటిది అమర్చ బడి ఉంది. దానిలో దాదాపు పాతిక దాకా టేప్ రికార్డర్ కాసెట్స్ ఉన్నాయి. మంగళంపల్లి, పట్టమ్మాళ్‌లగాత్రం, షెహనాయ్, నాదస్వరం మొదలయిన ఇనిస్ట్రుమెంటల్ మ్యూజిక్ ఉన్న కేసెట్లు కనిపిస్తున్నాయి. ఆ గది చల్లని సంగీ తంతోనూ, చక్కని సాహిత్యంతోనూ వింత సౌర భాలేవో వెదజల్లుతున్నట్టు అనుభూతి చెందే డు విద్యాసాగర్.

ఇంతలో లోపలినుంచి హెడ్మాష్టరుగారు తెల్లని పంచె, బనియనుతో ముందు గదిలోకి వచ్చేరు. చేత్తో రెండు టీ కప్పులతో వచ్చి ఒకటి విద్యాసాగర్ చేతికందించి మరొకటి తను తీసు కున్నారు.

"థాంక్స్" టీ అందుకుంటూ చెప్పాడు విద్యాసాగర్.

టీ సిప్ చేస్తూ కాస్సేపు స్కూలు భోగట్టాలే ఏవో చర్చించేరు హెడ్మాష్టరుగారు.

విద్యాసాగర్ అతని మాటలు వింటూ మౌనంగా ఉండిపోయేడు.

ఎప్పుడూ గంభీరంగా రిజర్వ్‌డుగా ఉండే అతను నోరు విప్పితే ఇంత సన్నిహితంగా, విశదంగా మాట్లాడతారని విద్యాసాగర్ ఎప్పుడూ ఊహించలేదు.

ఆ సంభాషణ అలా సాగిసాగి పరీక్షల విధానం మీదికి మళ్లింది.

"అసలు మన పరీక్షా విధానంలోనే చాలా లోపాలున్నాయి. దానిని మరింత ప్రయోజనాత్మకంగా, సమర్థవంతంగా చెయ్యక తప్పదు. మొదటిది పరీక్షల్లో ఎలాంటి అక్రమాలకీ తావు లేకుండా కట్టుదిట్టం చెయ్యాలి. రెండు మూడు రకాల ప్రశ్నాపత్రాల తయారీ దీనికి దోహద పడుతుంది. ఈ ప్రతిపాదన ప్రస్తుతం ప్రభుత్వ పరిశీలనలో ఉంది. విద్యార్థి పాటవానికి నిజమైన నికషలుగా రూపుదాల్చవలసిన అవసరం ఉంది. ఇక జవాబు పత్రాల వేల్యుయేషన్ గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది. మందెక్కువయితే మఠానికి చేటన్నట్టు ఇన్ని లక్షల మంది అభ్యర్థుల జవాబు పత్రాలను దిద్దడానికి స్పాట్ వేల్యుయేషన్లు పెడుతూ ఉంటారు. మీరు హైస్కూలు కొచ్చేక ఇంకా ఒక స్పాట్ వేల్యుయేషన్‌కీ అటెండ్ కాలేదు కదూ! అదంతా ఓ పెద్ద ప్రాసెస్. లక్షలాది విద్యార్థుల భవిష్యత్తు నిర్ణీత గడువులో అటో ఇటో తేల్చిపారేసే సమయం అది. పేపరుకింత అని రెమ్యూనరేషను ఉంది కనుక గబగబ తమకి వచ్చే కోటా పూర్తి చేసి పారెయ్యాలనే తప్ప విద్యార్థులకి సరైన న్యాయం జరుగుతోందా లేదా అని చూసే ఆసక్తీ వ్యవధీ కూడా ఉండదక్కడ. నిజానికి ఒక్కోరోజు మేష్టర్లకి అక్కడ తలకి మించిన పని భారం ఉంటుంది. అంతా ఏదో తొందర హడావిడి. అందరూ అన్యాయంగా ప్రవర్తిస్తున్నారని చెప్పలేం కానీ జవాబు పత్రాల మదింపు కార్యక్రమాన్ని తీరికగా వెసులుబాటుగా ఏదోలా అయిందనిపించేద్దామని భావించే ఉపాధ్యాయులు కూడా అక్కడక్కడా కనిపిస్తూ ఉంటారు. వాళ్ల భాషలో చెప్పాలంటే వాళ్లు అవలంభించేది టిక్ అండ్ మార్క్ మెథడ్. అంటే తోచిన చోట ఎర్ర ఇంకుతో టిక్ పెట్టెయ్యడం ఆ ప్రశ్నకిచ్చిన మార్కులకి మించిపోకుండా అప్పటికి తోచిన మార్కులు పడెయ్యడం"

విద్యాసాగర్ అతను చెప్పే విషయాలు విస్తుపోయి చూస్తూ వింటున్నాడు.

"అలా పేపర్లు దిద్దితే సూపర్విజనూ, ప్రాపర్‌చెకింగూ ఉండదూ?" మనసులో సందేహం దాచుకోకుండా అడిగేసేడు.

"మేష్టర్లు దిద్దే పేపర్లలో రెండో మూడో ఓ కట్టలో రేండమ్ చెకింగ్ ఛీఫ్ ఎగ్జామినర్లు చేస్తుంటారు. అంతకుమించి ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఇదో మేడిపండు వ్యవహారం. అంతా బాగున్నట్టే అనిపిస్తూ ఉంటుంది. లోతు పాతులు తరిచి చూస్తున్నకొద్దీ ఎన్నో అవకతవకలు బయటపడుతూ ఉంటాయి. సినిమా కబుర్లు చెప్పుకుంటూనో, కష్టసుఖాలు మాట్లాడుకుంటూనో పిల్లల భవిష్యత్తులు నిర్ధారింపబడవలసిన చోట కొందరు పేపర్లు దిద్ది పారేస్తూ ఉంటారని చెప్తే మీకు నమ్మకం కలగకపోవచ్చును"

"భావి తరానికి ద్రోహం. అలా ప్రవర్తించే కొందరివల్ల మొత్తం ఉపాధ్యాయ వర్గమే నగుబాటు చెందుతోంది. కొందరివల్ల మొత్తం వ్యవస్థ కుప్పకూలిపోయే పరిస్థితులు యేర్పడటం ఎంత దారుణం" బాధగా నిట్టూర్చి అన్నాడు విద్యాసాగర్.

"అంతే మేష్టారూ... కొందరే... కొందరివల్లే యీ వ్యవస్థ భ్రష్టుపట్టిపోతూ ఉంటుంది. ఉపాధ్యాయుల్లో ఎన్ని లక్షలమంది చిత్తశుద్ధి కలిగిన వాళ్లు లేరు? అయినప్పటికీ కొత్తకొత్త పథకాలతో మంచి ఆలోచనా దృక్పథంతో పతనావస్థ వేపు పయనిస్తున్న విద్యారంగాన్ని అభివృద్ధి మార్గంవేపు నెట్టాలని ప్రయత్నించినా కొందరివల్ల కొన్ని ప్రతీపశక్తులవల్ల అది నిష్ప్రయోజనం అయిపోతోంది. విజ్ఞాన పథం వేపు నిచ్చెన మెట్లు అధిరోహించాల్సిన విద్యా వ్యవస్థ సమస్యల జారుడుబల్ల మీదనుంచి




అధోగతికి నానాటికీ దిగజారిపోతోంది''

హెడ్మాష్టరుగారిలోని ఆవేశం కట్టలు తెంచుకున్నట్టు మాటల రూపంలో వెలువడుతోంది. కొత్తకొత్త సంగతులు, సమస్యలు తెలుసుకుంటున్న కొద్దీ ఎన్నో ఆలోచనలు విద్యాసాగర్ మెదడుని కందిరీగల్లా చుట్టుముట్టి బాధించసాగేయి.

మాటల్లో చాలా సమయం గడిచిపోయిందని గమనించి ఇక బయలుదేరి వెళ్లడానికి ఉద్యుక్తుడయ్యాడు విద్యాసాగర్.

మళ్లీ ఏవేవో విషయాలు మాట్లాడుతూ అసలు తనని ఇంటి వరకూ ఎందుకు పిల్చుకొని వచ్చేరో ఆ సంగతి చెప్పనే లేదని స్ఫురణకొచ్చింది విద్యాసాగర్‌కి. సాలోచనగా హెడ్మాష్టరుగారి కళ్లలోకి చూసేడు.

అతని భావం గ్రహించినట్టుగా నవ్వి అబ్బే వేరే ఏంలేదు... చాలా రోజులుగా మీ పనితీరు, నడవడికా గమగనించేక మీతో ఎందుకో కాసేపు విడిగా మాట్లాడాలనిపించింది. అంతే... అప్పుడప్పుడు కనిపించి వెళ్తూండండి... నిన్న-స్కూల్లో బాధాకరమయిన ఆ సంఘటన జరగడం, సాయంత్రం మీటింగ్‌లో మీరు ఆ వాతావరణానికి యిముడలేనట్టుగా నెర్వస్‌గా అసంకల్పితంగా కేకవేయడం చూసేక ఎందుచేతో ఇలా మాట్లాడాలనిపించింది... అంతే...'' అన్నారు.

హెడ్మాష్టరుగారికి కృతజ్ఞతలు చెప్పి బయలుదేరబోతున్నవాడల్లా అక్కడ తను అంతసేపూ కూర్చున్న సోఫావెనుక గోడమీద వేలాడుతున్న ఓ యువకుని ఫొటో చూసి సందిగ్ధంగా ఆగిపోయేడు. ఆ ఫొటోకి బంతిపూల దండ వేసి ఉంది. లోగడ ఒకటిరెండుసార్లు ఆ యింటికి వచ్చినప్పుడు అక్కడా ఫొటో చూసినట్టు గుర్తులేదు. కొత్తగా తగిలించేరు కాబోలు...

విద్యాసాగర్ ఆ ఫొటోవేపు ప్రశ్నార్థకంగా చూడడటం గమనించి తను కూడా అటువేపే చూస్తూ ''మా అబ్బాయి ఫొటో అది. పోయి రెండేళ్ళు కావస్తోంది'' అన్నారు వణుకుతున్న కంఠంతో.

''అయాం వెరీ సారీ'' నొచ్చుకుంటూ అతనిలో ఆ స్మృతులు మళ్ళీ రేకెత్తించినందుకు బాధపడుతున్నట్టుగా అన్నాడు విద్యాసాగర్.

రెండుమూడు క్షణాల నిశ్శబ్దం వారిద్దరిమధ్యా నెలకొంది.

''పేరు...'' అడిగేడు విద్యాసాగర్.

''వాడిపేరు కస్తూరిరావు... నువ్వు వినేవుంటావు... కొంతకాలంక్రిందట మనస్కూల్లోనే సైన్సు అసిస్టెంటుగా పనిచేసి, పబ్లిక్ పరీక్షల గొడవల్లో రౌడీల అమానుషదాడికి గురైన మనిషి''

నేలకింది భూమి కదిలిపోతున్నట్టనిపించింది విద్యాసాగర్‌కి. తలలో శతఘ్నుల మోత వినిపిస్తున్నట్టయింది. సన్నటి కన్నీటి పొర అలుముకుని ఫొటోలో వ్యక్తిరూపం మసకబారిపోయింది. అతి ప్రయత్నంమీద దృష్టి ఫొటోమీదనుంచి మరల్చి హెడ్మాష్టరువేపు చూసేడు.

నిండుకుండలాంటి ఆ మనిషిలో విషాదఛాయలు గోచరిస్తున్నాయి.

''వాడు మా అబ్బాయని యిక్కడెవరికీ తెలీదు. నేను ఎక్కడెక్కడో పనిచేసి ఈ ఊరొచ్చేను. వాడికి శాపమై పరిణమించిన ఈ ఊర్లోనే నేను హెడ్మాష్టరుగా పనిచెయ్యాల్సిరావడం నా దురదృష్టమేనేమో...'' భారంగా అన్నారాయన.

''మరి... ఆయన... ఆయన ఎలా పోయేరు... ఇక్కడ టీచరు ఉద్యోగానికి రిజైన్ చేశాక ఇంకెందులోనూ చేరలేదా?'' గొంతు పెగుల్చుకుని అడిగేడు విద్యాసాగర్.

''ఇక్కడ రిజైన్ చేశాక హైదరాబాద్‌లో ఒకటిరెండు ప్రైవేటు కంపెనీల్లో పనిచేశాడు. కానీ ఎక్కడా ఎక్కువరోజులు యిముడలేకపోయేడు. మొదటినుంచీ వాడి దృష్టి అంతా టీచింగ్‌మీదే ఉండేది. ప్రైవేటుగా కాన్వెంట్ నడపమని ఎవరెవరో సలహాలయితే ఇచ్చేరుకానీ ఆ భారీ విద్యావ్యాపారమంటే వాడికి మొదటినుంచీ అసహ్యం. కొన్నాళ్ళు నిరుద్యోగ జీవితం అనుభవించేడు... ఆ తరువాత...''

విద్యాసాగర్ అతను చెప్పబోయే విషయంకోసం ఉద్విగ్నంగా అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు.

ఒకక్షణం మౌనం తర్వాత హెడ్మాష్టరుగారు




గద్గదకంఠంతో ఒక్కొక్క మాటా పేర్చుకుంటు న్నట్టుగా అన్నారు, "ఆ తర్వాత... వాడు మా అందరికీ రెండేళ్ళపాటు దూరమైపోయేడు... చివరికి... చివరికి మమ్మల్నందరినీ అన్యా యంచేసి అడవుల్లో పోలీసుల ఎదురుకాల్పు ల్లో..." దుఃఖంతో మరి మాట పెగలక అతని గొంతు పూడుకుపోయింది.

శ్వాస స్తంభించిపోయినట్టనిపించింది విద్యాసాగర్‌కి. శరీరంలోనుంచి సన్నని జలద రింపేదో బయలుదేరి వెన్నుపూసని కుదిపే సినట్టయింది.

ఇక అక్కడ అట్టేసేపు ఉండలేకపోయేడు.

'వెళ్ళొస్తాన'న్నట్టుగా ఏదో గొణిగేసి కదలబో తూవుంటే,

"మా కస్తూరి కూడా మీలాగే ప్రతీ చిన్న చిరుగాలికీ అల్లాడిపోయే రెమ్మలా చలించిపో యేవాడు. అందుకే మీతో చెప్పాలనిపించి పిలిచేను. వచ్చిపోతూ ఉండండి" రుద్ధ కంఠంతో అంటున్న హెడ్మాష్టరుగారి మాటలు అస్పష్టంగా వెనుకనించి విద్యాసాగర్ చెవినిప డ్డాయి.

★ ★ ★

ఆ తర్వాత చాలారోజులవరకూ అతను మామూలుగా ఉండలేకపోయాడు. కస్తూరి రావు గురించిన ఆలోచనలే అనుక్షణం అత న్ని చుట్టుముడుతూ ఉండేవి. ఈ వ్యవస్థ విషపుకాటు తిన్న వ్యక్తి అతను...

రోజులు గడిచేవి. స్కూలు పనిలో పడ్డాక అతని మనసు కొంచెం కుదుటపడింది.

ఆ మరునటినెలలో పద్మ పెళ్ళి నారాయ ణతో జరిగిపోయింది. పెళ్ళయ్యేక లాంగ్‌లీవ్ పెట్టి భర్తతో వెళ్ళిపోయింది. లీవు పూర్తయ్యేక బదిలీ ప్రయత్నాలు చేస్తానని చెప్పింది. ఆ పెళ్ళిపనుల్లో విద్యాసాగర్ కాస్త మామూలు మనిషి కాగలిగేడు. మళ్ళీ రొటీన్‌లో పడ్డాడు. మరోరెండునెలలు గడిచాయి.

పదోతరగతి పరీక్షలు దగ్గరపడుతున్నాయి. స్కూల్లో విద్యాసాగర్ తన సిలబస్ కంప్లీట్ చేసి పిల్లల్ని పరీక్షలకి సిద్ధంచేసేపనిలో తల మునకలయ్యేడు.

విద్యాసాగర్‌కి ఆనందాన్ని కలిగిస్తున్న విషయం మరోటి ఏమిటంటే - పదోతరగతి పూర్తిచెయ్యకుండానే చదువు ఆపేస్తుందనుకు న్న చెల్లెలు శాంతి ఎవరూ ఊహించనవిధంగా మిగిలిపోయిన సైన్సు పరీక్షకోసం రాత్రీ పగ లూ శ్రద్ధగా చదువుతోంది. శాంతిలో ఈ మార్పు యింట్లో అందరికీ సంతోషాన్ని కలిగిస్తోంది. పెళ్ళి జరిగి వెళ్ళిపోయేముందు పద్మ శాంతిలో ఈ మార్పు తీసుకురావడానికి ఎంత గానో కృషిచేసింది. ఎంతో ధైర్యాన్ని నూరిపోసి, ఎంతో ఉత్సాహాన్ని కలగజేసింది.

ఇప్పుడు శాంతి ఎంత ధైర్యంగా ఉండగలు గుతోందంటే పరీక్షల భయం దానికి ఏ కోశానా లేదు. తెలీని పాఠ్యాంశాలని తనంత తనుగా విద్యాసాగర్‌దగ్గర నేర్చుకుంటోంది. అంతకు ముందున్న సంకోచాలన్నీ విడిచిపెట్టి, ప్రశ్నాప త్రం ఎంత కఠినంగా ఉన్నా అన్ని ప్రశ్నలకూ ధైర్యంగా ఆన్సరుచేసి వస్తానని నిబ్బరంగా చెప్తోంది.

చదివి చదివి అలిసిపోయినప్పుడుమాత్రం తల్లిచెంతన చేరి సరదాగా కబుర్లు చెప్తోంది.

తల్లి మెడలో గొలుసు సవరిస్తూ, "అత్తయ్య నాకోసం యిచ్చిన గొలుసు యిది... దీన్ని నీ మెడలో ఉంచేది మా రిజల్టు వచ్చేవరకే సుమా!' అంటూ నవ్వుతూ ఉంటుంది. చెల్లెలి మాటలు విని విద్యాసాగర్ గుండెనిండా హాయిగా గాలిపీల్చుకుని నిట్టూర్చేవాడు.

శాంతి చదువుగురించి తనకింక ఏ బెంగా లేదు. వెంకుబాబు గురించి మొదటినుంచీ ఏ దిగులూ లేదు. పదోతరగతిలో వాడు చాలా కష్టపడి చదివేడు. వాడి దస్తూరీ కూడా ముత్యా ల్లా ఉంటుంది. అన్ని సబ్జక్టుల్లోనూ చాలా మంచిమార్కులే వస్తూఉంటాయి.

చెల్లెలు శాంతి, తమ్ముడు వెంకుబాబుల చదువుల గురించి పీడించిన బెంగ దూరమ య్యేక విద్యాసాగర్ నిశ్చింతగా ఉండగలిగేడు.

★ ★ ★

పరీక్షల యజ్ఞం మొదలయింది.

పదోతరగతి పరీక్షల నిర్వహణకి ఇన్విజిలే టరుగా విద్యాసాగర్‌ని మరో ఊరు వేశారు.

ఆ డ్యూటీకి బయలుదేరుతూ ఆఖరిసారిగా

చెల్లెలికీ, తమ్ముడికీ యివ్వాల్సిన సూచనలిచ్చేడు. పరీక్షలు బాగా రాయమని శుభాకాంక్షలు చెప్పి బయలుదేరాడు.

పదోతరగతి పబ్లిక్ పరీక్షలకి ఇన్విజిలేటరుగా పనిచేయడం విద్యాసాగర్‌కి అదే మొదటిసారి.

అప్పుడప్పుడు మాటల సందర్భంలో తన కొలీగ్స్ చెప్పిన అనుభవాలు అతనికీ ఎదురయ్యేయి.

తమ పిల్లలు పరీక్షలు రాస్తున్నారనీ, పరీక్ష హాల్లో కాస్త లిబరల్‌గా ఉండమనీ, చూసీ చూడనట్టు వదిలెయ్యమనీ అడిగేవాళ్ళూ...

అర్థింపులేకాక, సూచనప్రాయంగా బెదిరింపు ధోరణిలో మాట్లాడేవాళ్ళూ కూడా అతనికి తటస్థపడ్డారు. ఏమాత్రం అవకాశం యిచ్చినా కాపీ చెయ్యడానికి వెనుదీయని పిల్లలు కొందరుండనే ఉన్నారు.

విద్యాసాగర్ వేటినీ లక్ష్యపెట్టకుండా తన డ్యూటీ తను చేసుకుపోయేడు.

అదృష్టవశాత్తూ ఆ పరీక్షాకేంద్రంలో తక్కిన స్టాఫ్ అంతా కూడా పరీక్షలు పకడ్బందీగా నిర్వహించడంలో ఎంతగానో సహకరించేరు.

సోషల్‌స్టడీస్ రెండవ పేపరుతో విద్యాసాగర్ ఇన్విజిలేషన్ డ్యూటీ పూర్తయింది.

చీఫ్ సూపరింటెండెంట్‌నుండి రిలీవింగు సర్టిఫికేటు, టి.ఎ., డి.ఎ.లు తీసుకుని యింటికొచ్చేడు.

వెంకుబాబు అన్ని పరీక్షలూ బాగా రాసేడు. ఫస్టుక్లాసు ఎలాగూ వస్తుంది. మంచి పర్సెంటేజీ తప్పకుండా తెచ్చుకోగలనని ధైర్యంగా చెప్పేడు.

శాంతి కూడా సైన్సు పరీక్ష రెండు పేపర్లూ బాగా రాసింది. మంచి మార్కులతో మిగిలిపోయిన ఆ ఒక్క పరీక్ష పాస్ అయి తీరుతానని ఆనందంతో చెప్పింది. చాలారోజుల తర్వాత చెల్లెలి మొహంలో అంత సంతోషాన్ని చూసి విద్యాసాగర్‌కి గుండెమీదనుండి ఏదో భారం దిగిపోయినట్టనిపించింది. తమ్ముడ్నీ, చెల్లెల్నీ మనసారా అభినందించేడు. పిల్లలిద్దరూ పరీక్షలు బాగా రాసినందుకు తల్లీ, తండ్రీ కూడా చాలా సంతోషించేరు. వెంకుబాబు స్నేహితులతో ఏదో సినిమాకి వెళ్ళిపోయేడు. శాంతి ఏదో కథలపుస్తకం తెచ్చుకుంటానంటూ పక్కింటికి వెళ్ళింది.

సాయంత్రం అయిదయింది. ఎండ చల్లబడింది. స్నానంచేసి బట్టలు మార్చుకుని అలా తిరిగి రావడానికి బయలుదేరాడు విద్యాసాగర్. దారిలో ఒకరిద్దరుకొలీగ్స్‌కనిపించేరు. వాళ్ళతో




కలిసి అలా వంతెనవరకూ షికారుకి వెళ్ళేడు. పరీక్షల నిర్వహణలో ఎదురయిన అనుభవాలు గురించి వాళ్ళమధ్య సంభాషణ జరిగింది.

చీకటి పడేవరకూ చల్లగాలిలో గడిపి ఇళ్ళకు బయలుదేరారు.

ఊళ్ళోకి ప్రవేశించగానే శలవు తీసుకుని అతని మిత్రులు తమతమ యిళ్ళకి వెళ్ళిపోయేరు. స్వీట్‌షాపుకి వెళ్ళి, చెల్లెలికీ, తమ్ముడికీ ఏదేనా మంచి స్వీటు కొని తెద్దామనిపించి అటువెళ్ళేడు విద్యాసాగర్.

స్వీట్లు కొనుక్కుని వస్తూవుంటే అచ్యుతరావుగారి భార్య కనిపించేరు.

"బాగున్నారా? పద్మనుంచి ఉత్తరాలు వస్తున్నాయా?" అని ప్రశ్నించేడు.

ఆవిడ నవ్వుతూ తలూపి, "పద్మనుంచి ఉత్తరం వచ్చింది బాబూ క్షేమంగా ఉంది. పద్మకిప్పుడు నెలతప్పింది. ఈ శుభవార్త మీ యింట్లో చెప్పు" అంది సంతోషం ఉట్టిపడే స్వరంతో.

ఆ వార్త విని విద్యాసాగర్ సంతోషించేడు.

"మంచిదమ్మా. చాలా సంతోషం. అలాగే చెప్తాను. ఈసారి పద్మకి ఉత్తరం రాసినప్పుడు నా శుభాకాంక్షలు అందించండి" అన్నాడు.

ఆవిడ తలూపి వెళ్ళిపోయేరు.

పద్మ నెలతప్పిందన్న వార్త విన్నాక విద్యాసాగర్ మనసులో ఒక విచిత్రమైన భావన కదలాడింది.

'పుట్టబోయే ఆ శిశువుకోసం అలాంటి లక్షలాది పసికందులకోసమైనా పెడదారులు పడుతున్న విద్యావ్యవస్థకి సంపూర్ణమయిన ప్రక్షాళన జరిగి బాగుపడితే ఎంత బాగుండును!' అనిపించిందతనికి.

ఆశావహమయిన చిరునవ్వొకటి అతని పెదిమలమీద క్షణంసేపు కదలాడింది.

ఇంటికొచ్చి భోజనం చేసేక ఏదో పుస్తకం చదువుతూ నిద్రకి ఉపక్రమించేడు.

ఆ రాత్రి విద్యాసాగర్‌కి నిశ్చింతగా నిద్రపట్టింది.

★ ★ ★

మర్నాడు రేడియోలో ప్రాంతీయవార్తలు వస్తూవుంటే మెళకువ వచ్చింది విద్యాసాగర్‌కి. యధాలాపంగా మంచంమీద పడుకునే, రేడియో వింటున్నాడు. అప్పుడే ప్రసారమయిన ఆ వార్త విని తలమీద పిడుగేదో పడ్డట్టు తుళ్ళిపడ్డాడు. దిగ్గున లేచి కూచున్నాడు.

ఆ వార్త విని యింట్లోవాళ్ళంతా ఒక లిప్తకాలం చేష్టలుడిగిపోయినట్లు ఉండిపోయేరు.

"... మొన్న జరిగిన పదవ తరగతి పరీక్షలలో సైన్సుపేపరు కొన్ని ప్రాంతాలలో ముందుగానే వెల్లడి అయినట్టు తెలిసింది. విద్యాశాఖ అధికారులు ఈ విషయాన్ని దర్యాప్తుచేసి, జరిగిన సైన్సు పరీక్ష రద్దుచేస్తున్నట్టుగా తెలిపారు. పరీక్షాపత్రాల లీక్‌కి కారకులయిన సంఘవ్యతిరేక శక్తులకోసం పోలీసులు గాలిస్తున్నారు. రద్దయిన ఈ పరీక్ష మళ్ళీ ఎప్పుడు జరిగేదీ త్వరలో ప్రకటిస్తారు..."

ఆ వార్త అందరికీ అశనిపాతంలా తగిలింది. విద్యాసాగర్ నిర్వేదంగా తమ్ముడివేపూ, చెల్లెలివేపూ చూసేడు.

విద్యుద్ఘాతం తగిలినవాడిలా వెంకుబాబు నిలువుగుడ్లేసి చూస్తూ ఉండిపోయేడు.

చెల్లెలు ముఖంలో రక్తం యింకిపోయినట్టు తెల్లబోయి చూస్తోంది. తల్లి వెంటనే ఆ వార్తని జీర్ణించుకోలేకపోయింది. ఆమె గొంతు విప్పి, "ఏమయిందిరా?" అంటూ అడుగుతోంది.

ఆ వెంటనే శాంతి గొంతులోంచి, మొదట సన్నని ఏడుపు జీర మొదలై, రానురాను దుఃఖం అతిశయించగా ఆ ఏడుపు అనేక ప్రకంపనాలుగా విడిపోయి క్రమేపీ పెద్దదై ఆ యిల్లు మారుమోగిపోయేలా పెద్దపెట్టున రోదన మొదలయింది.

శాపగ్రస్త విద్యారంగాన్ని ముంచెత్తే ఉప్పెనలా ఆ దుఃఖవాహిని చాలాసేపటివరకూ విరుచుకుపడుతూనే ఉంది.

ఏడ్చి ఏడ్చి యిక విలపించే శక్తిలేక నేలమీద కూలబడిపోయింది శాంతి.

చెల్లెల్ని ఓదార్చడానికి మాటలే మరిచిపోయినవాడిలా చూస్తూ ఉండిపోయేడు విద్యాసాగర్.



# 'బంటీ'పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన మన్నూ భండారి నవల 'బంటీ'పై మాకందిన ఉత్తమ సమీక్షలను ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## మేలుకొలుపు

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

"బంటీ" తండ్రి వేరే స్త్రీని చేసుకుని వెళ్ళినా అతనికి ఆ విషయం చెప్పి తండ్రిపై చెడు అభిప్రాయం కలిగించేందుకు ప్రయత్నించకపోవడం శకుంతల సంస్కారం. అతను తనకూ, తన బిడ్డకూ ఎంత ద్రోహం చేసినా కొడుకుముందు మాత్రం భర్తను కించపరచలేదు ఆమె. తనలోతను కుమిలిపోయిందే తప్ప కొడుకుముందు ఎప్పుడూ బయటపడలేదు.

అంతవరకూ బాగానే వుందిగానీ భర్తమీద కసితోనైతేనేం, తనకో తోడుకోసమైతేనేం డాక్టర్ జోషిని తన జీవితంలోకి ఆహ్వానించేముందు ఆ విషయం మెల్లమెల్లగా బంటీకి విడమర్చి చెప్పి అతన్నందుకు మెంటల్‌గా ప్రిపేర్ చెయ్యడానికి ప్రయత్నించకపోవడం మాత్రం తల్లిగా అది ఆమె బాధ్యతారాహిత్యం. అందుకే ఆ ఆకస్మిక మార్పును తట్టుకోలేక బంటీ అంత కల్లోలం సృష్టించాడు. తనూ నరకం అనుభవించాడు మానసికంగా.

అయినా కొడుకుని మెల్లిగా సముదాయించి మార్చుకోవాలని .తల్లిగా ప్రయత్నించకపోగా, అజయ్‌తో పోలుస్తూ, కొడుకు తన జీవితానికే అడ్డుతగులుతున్నాడని భావించడం మాతృత్వానికే కళంకం.

పైగా డాక్టర్ జోషియే కలగజేసుకుని బంటీకి ఈ మార్పు ఇష్టమైనట్లుగా చేయాలని ప్రయత్నించాడే తప్ప, ప్రిన్సిపాల్ అయివుండీ కొడుకు మనస్తత్వాన్నీ, అతడు అనుభవించే విపరీతమైన క్షోభనీ శకుంతల గుర్తించకపోవడం చాలా వింతగా వుంది. అటువంటి పరిస్థితిలో పిల్లల సైకాలజీకి అనుగుణంగా ప్రవర్తించకపోవడం ఆమె తెలివితక్కువతనమే.

బంటీ అటు తండ్రికీ చెందక, ఇటు తనదనుకున్న తల్లికీ చెందక ఒంటరితనంతో ఎంతగా తల్లడిల్లిపోయాడోనన్న విషయం చదువుతుంటే కంటతడి పెట్టించింది. పైకి బింకంగా ఉన్నా ఎవరో ఒకరు వచ్చి "కలకత్తా వెళ్ళొద్దు బంటీ" అని అడుగుతారేమోనని, ఆశతో బేలగా ఎదురుచూశాడు పాపం ఆ పసివాడు.

భార్యాపిల్లలూ ఉన్నారనే స్పృహలేకుండా పరాయిభామల మోజులోపడి తమ స్వార్థం, సంకుచిత బుద్ధితో బాధ్యతారహితంగా ప్రవర్తించే పురుషపుంగవులు ఈ సమాజంలో చీడపురుగుల్లా వున్నంతవరకూ బంటీ వంటి పిల్లలకి హాస్టళ్ళూ, రెసిడెన్షియల్ స్కూళ్ళే గతేమో!

కల్చర్, స్వేచ్ఛల పేరు చెప్పి కుళ్ళిపోయిన నేటి సమాజపరిస్థితిని చక్కగా విశదీకరిస్తోందీ నవల. బాధ్యతలు మర్చిపోయిన తల్లిదండ్రులకు ఇదొక మేలుకొలుపు.

-జె. సూర్యకుమారి
హైదరాబాద్

## యదార్థమే!

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'బంటీ' చదువుతూవుంటే నాకు తెలిసిన




ఒక సంఘటన గుర్తుకువస్తోంది. తండ్రిలేని బంటీలాంటి ఒక పిల్లవాడు ఒక కొత్త వ్యక్తిని తండ్రిగా అంగీకరించలేకపోయాడు. ఆ తండ్రి ఇతన్ని తన కొడుకుగా చేరదీయలేకపోయాడు. వీరిద్దరి నడుమ ఆమె నలిగిపోయి ఆ పిల్లవాడిని మొదటి భర్త తల్లి దగ్గరకు పంపింది. ఇది అంతా అతని పదోతరగతి చదివేరోజుల్లో జరిగింది. మానసికంగా చాలా కృంగిపోయాడు. తల్లిని వదులుకోలేక కొత్త వ్యక్తిని అంగీకరించలేక, నాయనమ్మ దగ్గర ఇమడలేక ఇంట్లోనుంచి పారిపోయాడు. మేనత్తకు తెలిసి చేరదీసింది. అయినా తల్లి రమ్మనటంతో మళ్ళీ వెళ్ళాడు. ఆ తర్వాత ఏం జరిగిందోగానీ రైలుపట్టాల మీదపడి ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఇలా తల్లిగా ఒకరు తీసుకొన్న నిర్ణయం పిల్లవాడిమీద ఎటువంటి ప్రభావం పడుతుందని ఆలోచించక ఎవరి సుఖం వాళ్లు చూసుకొంటే బలిఅయిపోయేది అన్నెం పున్నెం ఎరుగని పసివాళ్ళు. తల్లి అయినా, తండ్రి అయినా పిల్లల భవిష్యత్తుకై ఎంతో కొంత త్యాగం చేయాలి. అప్పుడే పిల్లల భవిష్యత్తు ఉజ్వలంగా వుండవచ్చు. "బంటీ" నవల సమాజంలో జరిగే సంఘటనలకు అద్దం పట్టేదిగా వుంది. ఇంత మంచి నవల అందించినందుకు ధన్యవాదాలు.

-సి. భవాని
గుడివాడ.

## చక్కని మనోవిశ్లేషణ

**(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

**చి**న్నపిల్లవాడి మనోవిశ్లేషణను ఇతివృత్తంగా తీసుకుని హృద్యంగా మనసుకు హత్తుకునేట్లు వ్రాసిన నవలను అందించినందుకు ధన్యవాదాలు.

ఫ్రాయిడ్ థియరీ ఇడిపస్ కాంప్లెక్స్‌ను విశ్లేషించడం డి.హెచ్. లారెన్స్‌కే సాధ్యమయిందనుకుంటుంటే ఓ భారతీయ రచయిత ఈ కాంప్లెక్స్ యొక్క ప్రాథమిక దశను మరో దృక్కోణంలో నడపడం మనోవిశ్లేషణాత్మక నవలల్లో మరో ముందడుగు.

తల్లి మనసు తండ్రివల్ల ఏవిధంగానైనా క్షోభకు గురైతే భర్తపట్ల ఆమెకు తగ్గిన ప్రేమస్థానంలో కొడుకుకు ప్రాధాన్యాన్నిచ్చి, వాడిలో భర్తను చూసుకుంటే, తర్వాత వాడి మానసిక సంఘర్షణకు అదెలా దారితీస్తుందో చాలా చక్కగా వివరించారు. శకుంతల మళ్ళీ పెళ్లి చేసుకోకుంటే 'బంటీ' పాత్ర మరో 'పాల్‌మోరెల్' (డి.హెచ్. లారెన్స్ యొక్క సన్స్ అండ్ లవర్స్) అయ్యుండేవాడు. లాయర్ శకుంతలకిచ్చిన సలహాల ద్వారా ఇదే వెల్లడయింది.

డాక్టర్‌పట్ల శకుంతల ఆకర్షితురాలవనంతవరకూ కొడుకులో తన భర్తను చూసుకుంది. అందువల్లే బంటీకి సర్వస్వం ఆమే అయ్యింది. ఆమె ప్రేమను మరొకరితో పంచుకోవలసిరావడం బంటీ మానసిక సంఘర్షణను త్రీవతరం చేసింది. బంటీ వయసు ఇంకొంచెం ఎక్కువగా ఉంటే ఇంత చిన్నవయసులో ఇంత పెద్ద ఆలోచనలు సంభవమా అనే అనుమానం రాకుండా ఉండేది. ఈ నవలలో అంతుపట్టని విషయం ఒకటుంది. అటు శకుంతల ఒక కాలేజ్ ప్రిన్సిపాల్ అయ్యుండీ ఇటు డాక్టర్‌గారు విజ్ఞుడయి ఉండి కూడా బంటీ మానసిక సంఘర్షణను కనిపెట్టలేకపోవడం విచిత్రమే. కనిపెట్టినా వారి స్వార్థంతో బంటీని అశ్రద్ధ చేశారని సరిపెట్టుకోవాలి.

ఈ నవల్లో మరో ముఖ్యలోపం. బంటీ మానసిక సంఘర్షణకు పరిష్కారమార్గం రచయితైనా చూపించకపోవడం. కలకత్తా వెళ్ళినా బంటీ మనసు ఇంకా ఎక్కువ సంఘర్షణకు లోనయిందే తప్ప తగ్గలేదు. ఇంత సున్నితమైన సమస్యను సహజసిద్ధంగా తీర్చిన రచయిత పరిష్కారమార్గం కూడా చూపిస్తే నవల ఇంకా ప్రయోజనకరంగా ఉండేది.

"ఆ! పిల్లలదేముంది! రెండురోజుల్లో సర్దుకుంటారులే" అని తేలిగ్గా తీసిపారేసి, పిల్లల పెంపకాన్ని అశ్రద్ధచేసే తల్లితండ్రులెందరో ఉన్న మన సమాజానికి ఇలాంటి నవలల ఆవశ్యకత ఎంతైనా ఉంది. 'చతుర'లో ఇలాంటి సామాజిక విలువలున్న నవలల్ని

ముందు ముందు కూడా అందిస్తారన్న ఆశతో-

-జంపని సురేష్‌బాబు
గూడూరు

## కల్పన-వాస్తవం

*(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

మన్నూభండారి నవల 'బంటీ' చదివాక చివరికి మిగిలే అనుభూతి అసహాయత మాత్రమే.

తండ్రి లేక, ఉన్నా దగ్గర లేకుండా పెరిగిన పిల్లాడి మనస్తత్త్వ పరిశీలన చక్కగా ఉంది గానీ అది సగటు పాఠకుల ఊహకందనిదిమాత్రం కాదు. ముఖ్యంగా అటువంటి పిల్లాడి ప్రవర్తనలో తల్లికి దగ్గరవడం, 'అమ్మకూచి'గా పెరగడం సామాన్యం. అదే ఉమ్మడి కుటుంబాల్లోనయితే ఎవరో ఒకరు ఆ స్థానం పూరించి బాధ్యత తీసుకుంటారు. ప్రస్తుతం సాధారణం అయిపోయిన ఒంటరి కుటుంబాల్లో ఈ నవలలో చూపిన కొన్ని సమస్యలు భయంకరంగా ఏర్పడితే, మరికొన్ని సమస్యలు తేలిపోతాయి. రచయిత్రికి విడాకులకంటే స్త్రీ పునర్వివాహంమీద వ్యతిరేక అభిప్రాయం ఉన్నట్లు కనిపిస్తోంది. అందువలనేనేమో 'బంటీ' సమస్యకి పరిష్కారం హాస్టల్లో పడేయటంగా చూపారు. పురుషాధిక్య సమాజ ధోరణిలోనే కథ నడిపించారేగాని, వయస్సులో వుండి, చదువు, సంస్కారం, అందం, ఆత్మాభిమానం, చివరికి ఉద్యోగం ఉన్న స్త్రీ భర్త వేరే స్త్రీని వివాహం చేసుకున్నప్పటికి కూడా పునర్వివాహం - అందునా భార్య పోయిన వ్యక్తిని చేసుకుంటే ఆమె జీవితంలో వచ్చే పూలనువాసనలకు ప్రాముఖ్యం ఇవ్వకుండా, ముళ్ళకంపలనే ఎత్తి చూపడం అన్యాయం. సాహిత్యం సమాజానికి కొంత విలువలను చూపి పురోభివృద్ధికి తోడ్పడాలి. స్త్రీ పునర్వివాహం చేసుకోవడం ఏదో అపరాధంగా భావించే రోజులు మారాయి. ఈ నవలలో చూపిన సమస్యలకు సామరస్యమైన పరిష్కారం చూపగలిగితే రచయిత్రిని అభినందించేవాళ్ళం. జోషీ పెద్దకూతురు ఈ విషయంలో చొరవ తీసుకున్నట్టుగాని, మీరా ఇంటి వాతావరణంకన్నా జోషీ ఇంటిపరిస్థితి బంటీకి రుచించినట్టుగాని, కనీసం హాస్టలు జీవితంకన్నా బాగున్నట్టు చిత్రిస్తే ఈ నవల ప్రయోజనం సిద్ధించేదేమో!

ఏదేమయినా రచయిత్రి కల్పన వాస్తవానికి చాలా దగ్గర్లో వుంది.

-జి.సునీల్
న్యూపాన్వెల్

## ప్రేమ-మోహం!

*(అయిదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

విచ్చిన్న వివాహబంధాల దుష్పరిణామాలను కళ్ళకు కట్టినట్టుగా చిత్రీకరించిన 'బంటీ' నవల చదూతున్నంతసేపూ కళ్ళు ఆర్ద్రం అయి, ముగింపులో కన్నీటిపర్యంతం అయిపోయామనడంలో అతిశయోక్తి లేదు. ఈ కథలో పాత్రలన్నీ మనచుట్టూరా వున్న సమాజంలో కనిపించేవే. వివాహోత్పూర్వమే అన్నీ ఆలోచించుకోక స్వల్ప కారణాలతో వివాహబంధాన్ని విచ్ఛిన్నం చేసుకోవడం - భారత వివాహవ్యవస్థలో ఇటీవలి దుష్పరిణామం. మనసులు కలియని భార్యాభర్తలు వేర్వేరు మార్గాలను ఎంచుకున్నంత సులభంగా, ఎదగని పసిమనసుల చిన్నారులు 'అడ్జస్ట్' కాలేరుగదా! తమ పిల్లలకు తమతోడిదే లోకం అనో, తమలోకం అంతా తమ బిడ్డలతోనే అనో... భావించేవారి ఆలోచన్లు ఎటు దారితీస్తాయోనన్న కఠినసత్యాన్ని అతి చక్కగా విశ్లేషించి చెప్పిందీ నవల.

అజయ్, శకుంతలల వివాహ విచ్ఛిన్న కథాక్రమం ఇక్కడ చెప్పకపోయినప్పటికీ, వారి వారి అభిజాత్యాలే అందుకు కారణాలని స్పష్టమౌతోంది. వివాహబంధం విచ్ఛిన్నమైన ఓ స్త్రీగా, అండకోసం చూసే సగటు భారతీయ మహిళగా శకుంతలను సమర్థించవచ్చునేమో గానీ, బంటీలాటి తెలివి, విచక్షణగల కుర్రాడికి తల్లిగామాత్రం ఆమె ద్రోహంచేసిందనే చెప్పాలి. అమ్మవెంట మరో వ్యక్తి నీడను కూడా సహించలేని ఆ పసివాడి మనసు సహజంగానే అవుట్‌లెట్‌గా తండ్రివైపు మొగ్గు చూపిందిగానీ, అది ఇంతకంటే దుస్సహం అవుతుందని ఆ పసివాడూహించలేడుగదా!





బాల్యంలో బంటీలాంటి కుర్రాళ్ళ మనసులమీద పడే ఇలాటి మరకలు వికృతరూపం దాల్చే పరిస్థితి ఎవరికీ మంచిదికాదు. ప్రిన్సిపాల్‌గా ఎందరో విద్యార్థుల సైకాలజీ అధ్యయనం చేసే శకుంతల కన్నకొడుకు సైకలాజికల్ ఫీలింగ్స్‌ని ఖాతరుచెయ్యకపోవడం అమానుషం.

బంటీ ఫీలింగ్స్‌ని రచయిత్రి వాస్తవికంగా చిత్రీకరించారు. అక్కడక్కడా ఔత్తరాహిక జాడలు అగుపడినప్పటికీ తెలుగు పాఠకులకు ఈ నవలను అందంగా అందించిన ఉమాదేవిగారు అభినందనీయులు. మంచి నవలలు కోరుకునే తెలుగు పాఠకులకు ఇది చక్కని ఓదార్పు. మంచి రచనలు రావడంలేదనే సాహితీపరులకు ఇది చక్కని విందు.

వివాహబంధాల్ని చీటికీ మాటికీ సవాల్‌చేసే ఆధునిక భార్యాభర్తలకు ఈ నవల షాక్‌ట్రీట్‌మెంట్. ఈ నవలవల్ల విచ్ఛిన్నం అవుతున్న ఏ ఒక్క సంసారం కుదుటపడ్డా భారతదేశంలోని వేలాది బంటీలలో ఏ ఒక్కరైనా విడిపోతున్న అమ్మానాన్నల్ని కలపగలిగినా ఈ కథకు సార్ధకత చేకూరినట్లే. సమాజానికి నేడు కావాల్సినది ఇలాటి నవలలే. కఠిన వాస్తవాలకు వాస్తవ చిత్రీకరణ 'బంటీ'. నవల్లో ఓచోట రచయిత ప్రస్తావించిన 'భారతదేశంలో తల్లిదండ్రులు తమ పిల్లలపట్ల చూపించేది ప్రేమకాదు - మోహంమాత్రమే' అనే అభిప్రాయం ఆలోచించదగింది. శరీరాన్ని మాత్రమే వేడెక్కించే నేటి తెలుగు సాహిత్యంలో మనస్సుని వేడెక్కిస్తోన్న 'చతుర' సంపాదకవర్గానికి పాఠకులెప్పుడూ కృతజ్ఞులై వుంటారు.

-వి.దుర్గ
విజయవాడ

## 'సందేశాత్మక నవల'

***(ఆరవ బహుమతి రూ. 25/- పొందిన సమీక్ష)***

**'బంటీ'** మార్చి నెల 'చతుర'లో ఒక చక్కని నవల చదివిన అనుభూతినిచ్చింది. కేవలం సెక్స్, వయొలెన్స్‌లతో నిండిపోతున్న ఈనాటి తెలుగు నవలాసాహిత్యపు వడగాడ్పుల మధ్య ఒక సామాజిక సమస్య ఎంతటి అనర్థానికైనా దారితీయవచ్చనే సందేశంతో, సేదదీర్చేదిగా వుందీ నవల.

తల్లిదండ్రుల ప్రవర్తన పసిమనసులపై ప్రతిఫలించి వారిలో ఎలాంటి పరివర్తననైనా తెస్తుందనేది నిర్వివాదాంశం. మనమధ్యనే చిన్నపిల్లలున్నారనే విషయాన్ని మరచి ప్రవర్తించడమో... హీనంగా పోట్లాడుకోవడమో లాంటి అనాలోచిత చర్యలు అతి మామూలుగానే చేస్తూంటారు కొందరు. ''ఆ... చిన్నపిల్లలేలే...'' అని మనం చేసే నిర్లక్ష్యం అద్దంలాంటి చిన్నారుల మనసులపై పడి వారి భవిష్యత్తునే దెబ్బతీయవచ్చు. అది సమాజానికి అనర్థదాయకం కావచ్చు.

భర్తకు దూరమైన స్త్రీ మరొక మగవాడికి చేరువ కావాలనుకోవడం తప్పుకాకపోయినా, తాను కన్నబిడ్డ ఆ మగవాడితో 'అడ్జస్టు' కాగలడా అని ఆలోచించకపోవడం... అందుకు అనుగుణంగా ఆ పసివాణ్ణి మలచుకోలేకపోవడం... కాలేజీ ప్రిన్సిపాల్ అయిన శకుంతల విషయంలో చూస్తే 'విద్య'కీ 'విజ్ఞత'కీ సంబంధం లేదనిపిస్తోంది.

'తల్లి తనకి దూరమైపోతుందేమో...' అనే బంటీ మానసిక వేదనని ఎంతో చక్కగా తెలియజేశారు రచయిత్రి. కేవలం తల్లిదగ్గరమాత్రమే పెరిగే పిల్లల ఆలోచనాసరళి, వ్యక్తిత్వం అడుగడుగునా కన్పిస్తుంది 'బంటీ' పాత్రను నడిపించిన తీరులో. బంటీ తల్లిని కాదని తండ్రికి చేరువ కావాలనుకోవడం... పసివాళ్ళలో కలిగే మానసిక పరివర్తనకు అతి సున్నితపు ఉదాహరణ మాత్రమే. మరే సమాజ వ్యతిరేక చర్యలకయినా ఆ పసిమనసుల్లో బీజంపడితే... దారితప్పిన ఆ బాలలకు భవిష్యత్తనేది ఉంటుందా!

'చిన్నవాళ్ళేకదా...' అని నిర్లక్ష్యంచేసేవారికి 'తల్లిదండ్రులూ... జాగ్రత్త!' అని హెచ్చరిక చేస్తున్న ఓ సందేశాత్మక నవల 'బంటీ' అని చెప్పకతప్పదు.

-వి.ఎస్.ఎన్.మూర్తి
తణుకు



# చతుర ప్రపంచం

## పాదరక్షలు కుట్టుకుంటున్న పట్టభద్రుడు!

"యస్సీ, యస్టీలకి ప్రభుత్వం అంతా దోచి పెట్టేస్తోంది. ఇలాగైతే మా ప్రతిభకి విలువేంటి? మేమంతా మట్టికొట్టుకుపోవాల్సిందేనా?" అని అగ్రవర్ణాలూ, "శతాబ్దాలు గడిచినా మా బతుకుల్లో వెలుగు లేదు... మా ప్రాణాలకి విలువలేదు. ఏలినవారి చూపంతా పై తరగతులమీదే" అని దిగువ తరగతుల వాళ్ళూ పరస్పరం సిగపట్లకి దిగడమేతప్ప, మన ప్రభుత్వాలు యిరువర్గాలకీ తెలివిగా 'కుచ్చుటోపీ' పెడుతున్న సంగతి గుర్తించడంలేదు. ఇందుకు ఉదాహరణగా రామ్‌సింగ్ విషయాన్ని చెప్పుకోవచ్చు.




చండీఘర్‌కి చెందిన 27 ఏళ్ళ రామ్‌సింగ్ ప్రథమశ్రేణిలో బి.కామ్. పాసై, బి.ఇడి కూడా పూర్తిచేశాడు. అవడానికి యస్సీ క్యాస్టే అయినా అతనికెక్కడా ఉద్యోగం దొరకలేదు. దీనజనోద్ధరణకోసం కంకణం కట్టుకున్నామని డంబాలు కొట్టుకునే ప్రభుత్వాలు అతని గోడు పట్టించుకోలేదు. ఫలితంగా ఉద్యోగంకోసం కాళ్ళరిగేలా తిరిగి, తిరిగి, విసుగెత్తి చెప్పులు కుట్టుకుంటూ కాలం గడుపుతున్నాడు రామ్‌సింగ్.

నిజానికి రామ్‌సింగ్ తండ్రిది చెప్పులు కుట్టే వృత్తే! కొడుకు పెద్ద చదువులు చదివి గొప్ప ఉద్యోగం చేస్తాడని చెమటోడ్చి చదివించాడాయన. అయినా ఆయన ఆశ తీరలేదు. "నేను చెప్పులు కుట్టే ఉద్యోగంలోనే సెటిల్ అవుతానని ముందే తెలిస్తే ఇంత చదువు చదివేవాడినేకాదు. ఎందుకంటే, ఈ ఉద్యోగానికి ఇంత క్వాలిఫికేషన్ ఎందుకు దండగ?" అంటూ ఏడ్వలేక నవ్వుతున్నాడు రామ్‌సింగ్. భార్యాబిడ్డలతోపాటు తల్లిని, తండ్రినీ పోషించాల్సిన ఆ యువకుడికి ప్రస్తుతం రోజుకో పాతిక రూపాయలు మాత్రమే గిట్టుబాటవుతోందిట.

## అజ్ఞాతవీరుడి చర్మంకోసం పోరాటం

ఫ్రెంచి విప్లవ కాలంలో ప్రాణాలు కోల్పోయిన అనేకమంది విప్లవ వీరులలో లేమాన్‌సో ఒకడు. తుపాకీ గుళ్ళకు గురై ప్రాణాలు విడుస్తూ, "నేను మరణించాక నా చర్మంతో ఓ భేరీ తయారుచేయించండి. ఆ భేరీనుంచి వెలువడే శబ్దంతో నా సోదర విప్లవవీరుల్ని చైతన్యవంతుల్ని చేస్తాను. అప్పుడే నా జన్మకు సార్థకత చేకూరుతుంది" అని చెప్పాడట అతను. విప్లవంపట్ల అతనికిగల అంకితభావానికి సంతసించి, అతని తుదికోరికను మన్నించాలనే ఉద్దేశంతో సహచరులు అతని చర్మాన్ని వలిపించి భేరీలు తయారుచేసే వ్యక్తులకు అప్పగించారు. వారా చర్మాన్ని పరిశీలించి దీనితో భేరీ తయారుచేయడం అసాధ్యమని విప్లవ నాయకులకి దాన్ని తిప్పి పంపేశారు. చేసేదిలేక విప్లవనాయకత్వం ఆ చర్మాన్ని చర్మంలేని అతని దేహాన్ని భద్రపరచి ఉంచమని ట్రిబ్యూనస్ అనే మ్యూజియమ్ డైరెక్టర్‌కి అప్పగించింది. ఆ డైరెక్టర్‌గారు అతి ప్రయాస మీద వాటిని ప్రత్యేకమైన రసాయన మిశ్రమాలలో చెడిపోకుండా ఉంచగలిగారు.

ఆ తర్వాత విప్లవం విజయవంతం కావడంతో విప్లవ వీరులంతా వీరపూజలందుకున్నారు. ఆ సమయంలో మరో మ్యూజియమ్‌వారు అపురూపమైన లేమాన్‌సో చర్మం, దేహం వాస్తవానికి మాకే చెందాల్సుంటుందని కేసుపెట్టారు. కొన్నేళ్ళపాటు కోర్టులో కేసు నడిచింది. ఎట్టకేలకు అవి ట్రిబ్యూనస్ మ్యూజియానికే దఖలుపడ్డాయి. అయితే గమ్మత్తేమంటే ఇంత హంగామాకీ కారణభూతుడైన లేమాన్‌సో వ్యక్తిగత వివరాలేవీ ఎవరికీ తెలియవట. అతని పుట్టుపూర్వోత్తరాలు తెలియచెప్పినవారికి అక్షరాలా రెండువేల డాలర్ల బహుమానం ఇస్తామని ఫ్రెంచి ప్రభుత్వం ప్రకటిస్తోంది.



# జోకర్ పుట్టుక

సర్కస్‌లో బఫూన్లు చేసే హాస్యం ఇంతా అంతా కాదు. వారు తమ చేష్టలతో ఆబాలగోపాలాన్నీ పొట్ట చెక్కలయ్యేలా నవ్వించగల సమర్థులు. ఓ రకంగా చెప్పాలంటే బఫూన్లు లేకుండా ఉండే సర్కస్ ప్రదర్శన ఉప్పులేని కూరలా చప్పగా ఉంటుంది. ఇంచుమించు సర్కస్ పుట్టినపుడే బఫూన్ పాత్రాపుట్టింది. అందుకే ఆరెంటికీ అవినా భావ సంబంధం ఉందంటారు.

తన గుర్రం మీద వివిధ రకాలైన స్వారీ విన్యాసాలు చేయడం ఫిలిప్ అస్లే అనే సైనికుడిగారికి హాబీ. శరీరాన్ని గగుర్పొడిచే అతని




స్వారీని చూడ్డానికి నిత్యం జనం ఎగబడేవారు. అలావచ్చిన జనంనుంచి కొంత రుసుం తీసుకొని తన విన్యాసాల్ని ప్రదర్శించడం మొదలెట్టాడు అస్లే. అలా సర్కస్‌కు అంకురార్పణ జరిగింది. అయితే ఒకనాడు పోర్టర్ అనే అసిస్టెంట్ అస్లేతో పాటు ప్రదర్శన ఇస్తూ ప్రమాదవశాత్తూ గుర్రం మీదనుంచి పడిపోయాడు. ఆ తర్వాత గుర్రం కాళ్ళక్రిందపడి చావకుండా ఉండేందుకుగాను నేలమీదే పడి దొర్లుతూ ఎలాగైతేనేం ప్రాణాలు దక్కించుకున్నాడు. అయితే ప్రేక్షకులతని 'పాట్లు' చూసి జాలిపడకపోగా కేరింతలు కొడుతూ నవ్వారు. దాన్ని దృష్టిలో పెట్టుకుని ఆ తర్వాత అస్లే ఓ బఫూన్ పాత్రను సృష్టించాడు. అలా ప్రారంభమైంది బఫూన్ల శకం.

క్రమేణా బఫూన్లుగా మరుగుజ్జులు కూడా రంగ ప్రవేశం చేశారు. అతడెవరైతేనేం? తను ఏడుస్తూనైనా ప్రజల్ని నవ్వించడం అతని బాధ్యత. సింపుల్‌గా చెప్పాలంటే చూసేవాళ్ళకి ఆహ్లాదం, చేసేవాళ్ళకి ప్రాణ సంకటం' అన్నదే బఫూన్‌కు తాత్పర్యం. అమెరికాలో బఫూన్లని 'ఆగస్ట్‌క్లౌన్స్' అంటారు. 'క్లౌనో' అన్నా 'బఫూనో' అన్నా 'జోకర్' అన్నా పేరేదైతేనేం సమయస్ఫూర్తితో జనాన్ని నవ్వించడమే అతనివిధి. ఇటీవల కొందరు రాజకీయ నాయకులు అర్థంపర్థంలేని స్టేట్‌మెంట్లతో, చేష్టలతో బఫూన్లలా వ్యవహరిస్తూ హాస్యరసాన్ని ఇతోధికంగా పోషిస్తున్నారని మనందరికీ తెల్సిందే.

## బాలమేధావులు

అతి చిన్న వయసులోనే అపారమైన తెలివితేటల్ని ప్రజ్ఞాపాటవాల్ని ప్రదర్శించి ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తిన 'అద్భుత బాలలు' కొందరున్నారు. అలాంటివారిలో ఫ్రెడిరిక్ ఒకడు. జర్మనీలోని ల్యూబెక్‌లో 1921, జూన్ 4న ఉదయం ఆరుగంటలకు జన్మించిన ఆ




పిల్లవాడు మధ్యాహ్నం 12 గంటలయ్యేసరికి 'గుడ్ ఆఫ్టర్‌నూన్ డాడీ' అంటూ పదేళ్ల పిల్లకాయ్‌లా స్వచ్ఛమైన జర్మనీ భాషలో పలకరించాడట. రెండేళ్ళు గడిచే సరికల్లా అతడు పూర్తిస్థాయి తెలివితేటలు సొంతం చేసుకున్నాడు. ఐదేళ్లు వచ్చేసరికి దేశంలోని మహామహామేధావుల్నే తన బహుముఖ ప్రజ్ఞతో నిరుత్తరుల్ని చేసేశాడు. అతని ప్రతిభను గుర్తించిన డెన్మార్క్‌రాజు అతన్ని తన సభలోని మేధావుల సరసన ఆసీనుణ్ణి కావించి గౌరవించాడు.

అయితే ఫ్రెడిరిక్ ఏడేళ్లన్నా నిండక మునుపే మరణించాడు. తన మరణం విషయం కూడా ఒక సంవత్సరం ముందుగానే జోస్యం చెప్పుకున్నాడతను.

1941 సెప్టెంబర్ 8న ఫ్రాన్స్‌లోని సింటన్‌లో జన్మించిన చార్డియాక్ కూడా అలాంటి చిచ్చర పిడుగే! పదిహేనో మాసం తిరిగే సరికల్లా ఫ్రెంచి వ్యాకరణాన్ని ఔపోశన పట్టాడతను. మూడో ఏడు వచ్చేసరికల్లా లాటిన్ భాషలో ఉద్దండపండితుడైపోయాడు. ఆరో ఏట కాలు బెట్టాడో లేదో హీబ్రూ. గ్రీక్, రష్యన్ భాషలు అతనికి బ్రహ్మాండంగా వచ్చేశాయి. అయితేనేం? అంతటి మేధావి అచ్చం ఫ్రెడిరిక్‌లాగే ఏడేళ్ళు నిండకముందే చనిపోయాడు.

అమెరికాలోని మిన్నసోటాలో 1951,

..వంబర్ 7న జన్మించిన విలియమ్ కూడా 'సూపర్‌కిడ్'లాంటివాడే! ఎనిమిదేళ్లు నిండేస రికల్లా అతడు 9 విదేశీ భాషలలో పాండిత్యం సంపాదించాడు. పదకొండో ఏడు వచ్చేసరికి గొప్ప తత్త్వవేత్తగా ఐరోపావాసులందరి చేతా కీర్తింపబడ్డాడు 17 నుంచి 19 ఏళ్లమధ్యలో అతనికెన్నో గౌరవపురస్కారాలు లభించాయి. దురదృష్టవశాత్తూ అంతటి మేధాసంపన్నుడూ ఇరవై రెండో సంవత్సరం వచ్చేసరికల్లా తన శక్తి సామర్థ్యాలన్నింటినీ పోగొట్టుకొని అశక్తుడుగా మారిపోయాడు. ఆ తర్వాత కేవలం నెలకు 85 రూపాయల అతి సామాన్యవేత నంతో బతుకుబండి దొర్లించుకుంటూ తన 46వ ఏట అత్యంత దయనీయ స్థితిలో మర ణించాడతను.

గణిత విజ్ఞాన ఖనిగా పేరెన్నికగన్న జార్జ్ 1951 మార్చి 1న ఇంగ్లాండ్‌లో జన్మించాడు. ఏడాది వయసులోనే నిముషానికి వెయ్యి రాళ్ళను లెక్కించేంతటి మేధస్సు సంపాదించిన జార్జినాలుగో సంవత్సరం వచ్చేసరికల్లా లెక్కలలో ఆరి తేరిన మేధావిగా ఐరోపా మొత్తం పర్యటించాడు. గమ్మత్తేమంటే లెక్కలలో అఖండుడైనా జార్జికి పదేళ్లు వచ్చేదాకా సరిగ్గా రాయడం చదవడం రాలేదు. ఆ తర్వాత క్రమేణా మిగిలిన విద్యలలో కూడా రాణించి సివిల్ ఇంజనీరుగా పని చేశాడతను.

1861 జులై 7న ఇంగ్లాండ్‌లోని ససెక్స్‌లో జన్మించిన విలియమ్ హెంప్రీ బెట్టీ ఎనిమిదేళ్లు నిండేసరికల్లా బ్రహ్మాండమైన నటుడుగా పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నాడు. ఆ వయసులోనే అతను షేక్స్‌పియర్ నాటకంలో హేమ్లెట్ పాత్రను నవరసభరితంగా పోషించాడు. 11 సంవత్సరాలు వచ్చేసరికల్లా బెట్టీకి సొంత నాటకం ట్రూప్ ఒకటి ఏర్పడిపోయింది. అంత చిన్న వయస్సులోనే ఒక్కో ప్రదర్శనకు తన పారితోషికం క్రింద 1100 డాలర్లు పుచ్చుకునే వాడు బెట్టీ. అతని నాటకం అంటే జనానికి ఎంతటి క్రేజంటే ఓసారి హౌస్ ఆఫ్ కామన్స్‌కు చెందిన సభ్యులు మొత్తం సమావేశాన్ని వదిలిపెట్టి నాటకానికి వెళ్లిపోయారు. గత్యంతరం లేక నాటి ప్రధాని విలియం పిట్ సమావేశాన్ని మరునటి రోజుకు వాయిదా వేసుకున్నాడు. ఓసారి బెట్టీ నాటక ప్రదర్శన సందర్భంగా హాలు దగ్గర గుమికూడిన జన సమూహాన్ని చెదరగొట్టేందుకు సాక్షాత్తు మిలట్రీవాళ్ళు రంగంలోకి దిగాల్సివచ్చింది.

జర్మనీలోని మ్యూనిచ్ నగరంలో 1911 ఆగస్టు 9న జన్మించిన ఫిలిప్ బార్టియర్ కూడా సామాన్యుడు కాడు. రెండేళ్లు వచ్చేసరికల్లా అతను 15 విదేశీ భాషలలో ప్రావీణ్యం సంపాదించాడు. ఐదేళ్ల వయస్సు నాటికే అతను బైబిల్ గ్రంథాన్ని గ్రీకు భాషలోకి అనువదించాడు. ఆరేళ్ల వయసులో అతనికి రాయల్ అకాడెమీలో సభ్యత్వం లభించడమేగాక ఫిలాసఫీలో గౌరవ డాక్టరేట్ పురస్కారం కూడా లభించింది. అయితే దురదృష్టవశాత్తూ తన 19వ ఏట బార్టియర్ ప్రమాదవశాత్తూ ఓ బావిలో పడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

భారతీయులకి ఆధునిక విద్యావిధానాన్ని పరిచయం చేసిన వ్యక్తిగా లార్డ్ మెకాలే గురించి అందరికీ తెల్సు. కానీ అద్వితీయమైన బాలమేధావిగా అతను పేరు తెచ్చుకున్నాడన్న విషయం చాలామందికి తెలియదు. రెండేళ్ళ వయసు నాటికే ప్రతి విషయాన్ని రాయడం, చదవడంతోపాటు అవగాహన చేసుకోవడం కూడా అబ్బిందతనికి. నాలుగో సంవత్సరం నుంచే తలలు పండిన మేధావులతో వివిధ విషయాలపై చర్చలు సాగించి వారిని నిరుత్తరుల్ని చేసేవాడతను. ఇంకో గమ్మత్తేమంటే మూడేళ్ల వయసునుంచే అతను 'తాగడం' కూడా అలవరచుకున్నాడు. తాగడం అంటే పాలు కాదు. బ్రాందీ. ఆ వయసులోనే రోజుకి ఐదు పెగ్గులు పట్టించేవాడట.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

